# చతుర

జూన్ 2006

రూ. 7/-



గీత నవల

## రాతిలో తేమ



**కూడాలనుకుంటి ... నిను కూరిమి మీర**

**జాగేల రావే... రావే... నా దరి చేర**

ఐరోపా అడవుల్లో పెట్టను ఆకట్టుకునేందుకు పుంజు చేసే విన్యాసమీ దృశ్యం. సమాగమ రుతువు సమీపించిన వేళ నల్లటి అడవి కోడి పుంజులు కొన్ని ఒక ప్రాంతంలో చేరతాయి. ఆ ప్రాంతానికి చేరే పెట్టల్ని తమ దర్పప్రదర్శనతో వలచి వలపించుకుంటాయి. ఒక వేళ రెండు పుంజులు పోటీ పడితే ఘర్షణ రహితంగా రెక్కల్ని, తోకను విప్పార్చి విన్యాసాలతో ఆధిపత్య ప్రదర్శన చేస్తాయి. ఆ ప్రదర్శనలో విజేతను పెట్ట వరిస్తుంది.







నవ నవలా వేదిక

# చతుర

సంపుటి : 29 | సంచిక : 5
జూన్ : 2006 | 341వ సంచిక

ఈ నెల నవల

## రాతిలో తేమ

సహజ సంఘటనలకు సెలయేటి
సదృశ కథనం

గీత 10



బొమ్మలు: పినిశెట్టి

రచయితలకు ప్రత్యేకం కథలు-కబుర్లు (19)

# అక్షరబద్ధమైన అనుభవమే రచన



పఠనం కొత్త లోకాలకు తలుపులు తెరుస్తుంది. పుస్తకాలు చదవని రచయితలుండే అవకాశమూ లేదు. తెలుసుకోకుండా రాయటం అసాధ్యం. కానీ తెలిసిన పరిజ్ఞానాన్ని 'మనది' చేసుకుని అవసరానికి ఉపయోగించుకోగలగటం అంతకన్నా ముఖ్యం. చిందర వందరగా పుస్తకాలు పడి ఉన్న పెద్ద లైబ్రరీ కన్నా, వాటిని ఒక పద్ధతిలో అమర్చిన చిన్న లైబ్రరీ వల్ల ఎక్కువ ఉపయోగముంటుంది. అలాగే పఠనానుభవం, పుస్తక పరిజ్ఞానం ఎంతున్నా, ఏం చేసుకోవాలో ఎలా ఉపయోగించుకోవాలో తెలియకపోతే అది నిష్ప్రయోజనం. చదివినదాన్ని మనం స్వంత విచక్షణతో, విశ్లేషణతో బేరీజు వేసుకుని అందులోని సమాచారాన్ని స్వానుభవంగా మార్చుకోగలగాలి. 'వివేచన' మంట లాంటిదైతే పఠనం చిరుగాలి. రెంటి కలయిక వల్ల అగ్ని మరింత రగుల్కొంటుంది. ప్రతి సమస్యకూ, సందేహానికీ సమాధానం పుస్తకాల్లో అన్వేషించేవాళ్లకు స్వంత ఆలోచనా శక్తి సన్నగిల్లుతుందంటాడు షోపెనార్. పండితులు ఈ లోకంలోని కఠిన సత్యాలను తెలుసుకోలేరు అనటానిక్కారణం ఇదే. ముఖ్యంగా రచయిత సాటి మనుషుల్ని చుట్టూ ఉన్న సమాజాన్ని అధ్యయనం చెయ్యటం అత్యవసరం. పరుల ఆలోచనలు మంచివే కావచ్చు కాని ఆ దుస్తులు మనకు సరిపోవు గదా. 'చదివి' ఇలా కూడ ఆలోచిస్తారు కాబోలు అని తెలుసుకుని స్వంత దారి వెదుక్కుంటారు విజ్ఞులు. పుస్తకాలు ఆకర్షిస్తాయి. కాని అరవిరిసిన పువ్వుల అందం కాగితం పూలకు రాదు.



ఫ్రాంక్ ఓ కానర్

మనం గ్రహించిన విషయాలు కొందరు ప్రముఖుల ఆలోచనలను పోలి ఉన్నాయని తెలిసినప్పుడు ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఎవరు ఎంత అద్భుత

రచన చేసినా జీవితం పుస్తకం లాగుండదు - వ్యక్తులు తమ అనుభవాన్ని అక్షరబద్ధం చేసే క్రమమే పుస్తకం. అరువు తెచ్చుకున్న అభిప్రాయాలు ఎంత గొప్పగా కనిపించినా అవి కట్టుడుపళ్లు మాత్రమే. రంగులన్నీ కాన్వాస్ మీద గుమ్మరించినంత మాత్రాన గొప్ప చిత్రం కాదు. కళ అంతర్దృష్టి ఫలితం.



కాథరైన్ మేన్స్ ఫీల్డ్

ఆర్థిక, సామాజిక పరిస్థితులు, జీవన సరళి ఎదుర్కొన్న ఒదుదుడుకులు- ముఖ్యం గా ఈ బహిర వాతావరణానికి కలిగిన వైయక్తిక స్పందనల ఆధారంగానే ఆలోచనలేర్పడతాయని అందరూ అంగీకరిస్తారు. అందువల్ల, మరొకరి మాట నీడెలా అవుతుంది! తెలుసుకోవాలి. కాని తెలుసుకున్నది స్వానుభవానికి ప్రత్యామ్నాయం కాదు. శాస్త్ర సాంకేతిక రంగాలలోని పరిశోధనలకు అప్పటిదాకా జరిగిన ప్రగతి తెలుసుకోవటం అత్యవసరం. కాని, కళా, సాహిత్యాలకిది అంత ముఖ్యం కాదు. యాత్రా కథనాలు చదవడం ప్రపంచ పర్యటన అనిపించుకోదు.

* * *

"వేపకాయంత వెర్రి అందరికీ ఉంటుంది. అది తాటికాయంత వున్నవాడే అసలు సిసలైన రచయిత. అంటే, రోజు వారీ జీవితంలో పెద్ద తేడా ఉంటుందని కాదు. సృజనాత్మకమైన ఆలోచనల్లో మాత్రం బీభత్సం. ఎలాగైనా రాయండి. ఎలా వస్తే అలా రాయండి. కాని స్వంతంగా రాయండి. ఫలాన వాళ్లలాగ, ముఖ్యంగా మీ అభిమాన రచయితలాగ మాత్రం రాయటానికి ప్రయత్నించకండి" అంటూ సలహాలిస్తారు ఫ్రాంక్ ఓకానర్ లాంటి అనుభవజ్ఞులు.

గేయానికీ చిన్న కథకూ దగ్గర సంబంధముంది- ఇది సంక్షిప్తతకు మించిన సారూప్యం. చిన్న కథ నవలలో ఒక అధ్యాయం కాదు. అదొక స్వతంత్ర కళా రూపం. మంచి కథలు రాసిన వాళ్లందరూ మంచి నవలలు రాయలేరు. ఉదాహరణకు మపాసా, చెహోవ్, కాథరైన్ మేన్స్ ఫీల్డ్ వగైరా. పేజీలు పెరిగితే మజ్జిగ పల్చనవుతుంది.

చిన్న కథ చిక్కనిది. నిడివి వలన నవలా రచనలో ఒక సౌలభ్యం వుంది. చిన్న కథ అలా కాదు. ఒకటి మరాథాన్; మరొకటి వంద మీటర్ల పందెం.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

## చతుర సమీక్ష

జూన్ 'చతుర' నవల రాతిలో తేమ

సమీక్షకుని పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

# కాలాతీతం



గుస్తావ్ ఫ్లోబేర్

# మదాం బొవరీ

(1851)

మదాంబొవరీ నవలాకర్త గుస్తావ్ ఫ్లోబేర్. ఈ నవల మానవ సంబంధాల శాస్త్ర పరిశోధన అంటే అతిశయోక్తి కాదు. 1856లో ఈ నవల వెలువడినప్పుడు దాన్ని అశ్లీల సాహిత్యంగా పరిగణించారు. రచయిత మీదా, ప్రచురణ కర్తల మీదా కేసు నడిచింది. వాద ప్రతివాదనల తర్వాత రచయిత గుస్తావ్ ఫ్లోబేర్ తెలియక చేసిన తప్పుని వదిలేశారు. ఈ నవల లోని ప్రతి పదాన్నీ వాక్యాన్నీ చిత్రిక పట్టాడు ఫ్లోబేర్. ఇంతటి 'పర్ఫెక్షనిస్ట్' ప్రపంచ సాహిత్యంలో మరొకరు కని పించడు. ఫ్లోబేర్‌కు ఈ నవల రాయ టానికి ఆరేళ్లు పట్టింది. వారంరోజులు నిర్విరామంగా శ్రమించి రెండు వాక్యాలు రాశాను' అంటాడొకసారి. రెండు వాక్యాలే అని కాదు. ఎన్ని పేజీలు రాసినా చివరికి మిగిలి నవి అవే అని అర్థం.

ఫ్లోబేర్‌కు పాతికేళ్లప్పుడు తండ్రీ, సోదరీ మరణిం చారు. ఈ పరిణామంతో తల్లి అతణ్ణి ఒక్కరోజు కూడా విడిచి ఉండలేని స్థితి ఏర్పడింది. ఫ్లోబేర్‌కు ఏం చెయ్యాలో తెలియదు. ఒకనాడు మిత్రుడో కథ చెప్పాడు. దాని ఆధారంగా నవల రాద్దామనుకు న్నాడు. కానీ అనుభవం లేదని సందేహించాడు.

'అనుభవం నిన్ను వెదుక్కుంటూ రాదు. నువ్వే దానికోసం ప్రయత్నించాలి' అంటూ సలహా యిచ్చాడు మిత్రుడు. ఎవరి జీవితమైనా పరిమి తమే. వ్యక్తుల్ని నిశితంగా పరిశీలించటం వల్ల మాత్రమే తెలియని కోణాలు అవగతమవుతాయి. తనకు తెలిసిన అనుభవాలనే మైక్రోస్కోప్ కింద అధ్యయనం చేశాడు ఫ్లోబేర్. ప్రేమ, సెంటిమెంటు, జాలి, సానుభూతి లాంటి వాటికి తావు లేదు.

**ఇతివృత్తం:** మదాంబొవరీ నవలలో హీరోయిన్ ఎమ్మా. ఆమె పుస్తకాలు, ముఖ్యంగా ప్రేమకథలు చదివి బుర్రపాడు చేసుకున్న యువతి. గ్రామంలో వ్యవసాయ కుటుం బంలో పెరిగింది. తండ్రికి గాయమైతే చికిత్స చేయటానికి వస్తాడు చార్ల్స్ బొవరీ. అప్ప టికే అతడి భార్య మరణించింది. ఎమ్మా అతణ్ణిష్టప డుతుంది. పెళ్లవుతుంది. అలా మలుపు తిరుగుం దామె జీవితం. చిన్న ఊళ్లో డాక్టరుగారి ప్రాక్టీసు. భార్యంటే ఇష్టమే. కానీ ఆమె కష్టసుఖాలు కనుక్కునే తీరిక లేదు. చేసిన పొరబాటుకు పశ్చాత్తాప పడు తుంది ఎమ్మా. పెళ్లికి ముందర ఎన్ని కలలు కంది! 'ప్రణయం', 'శృంగారం', 'విరహవేదన' 'దాంపత్య మధురిమ'- తను చదివిన పుస్తకాల్లో ఇలాంటి మాటలెన్నో! భర్త వలన ఏ ఒక్క పదానికీ అర్థం ఆమె అనుభవంలోకి రాలేదు.

రోజూ మనకు కనిపించే సాధారణ స్త్రీ లాగే ఉంటుంది ఎమ్మా. కాని ఆమె కోరికలను, అసంతృ

> "మూర్ఖత్వం, స్వార్థం, ఆరోగ్యం - ఆనందానికి కావలసిన లక్షణాలు. మూర్ఖత్వం లేకపోతే మిగతా రెండూ వృథా" - ఫ్లోబేర్

ప్తిని - ఒకే ఒక్క అగ్నికణం కార్చిచ్చుగా మారే క్రమాన్ని - విశ్లేషించిన రచయిత ప్రతిభకు పాఠకులు చకితులవుతారు.

తన కలల రాకుమారుడు కాదు భర్త. సరసం తెలియని యాంత్రికజీవి. 'యవ్వనోద్రేకాల తుపానులో కొండకు తాకి ముక్కలైన నావ లాగుంది ఆమె జీవితం'. సంగీత, సాహిత్యాలంటే మక్కువ. పెళ్లితర్వాత వాటికీ సమయం చిక్కటం లేదు.

కొత్త ఊరు 'యాన్‌విల్'కు భర్త మకాం మారుస్తాడు. అక్కడ ఓ చిన్న గుమాస్తా లియోన్‌తో ఎమ్మాకు పరిచయమవుతుంది. అతడికీ పుస్తకాలంటే మక్కువ. ఆమె ఒంటరితనం కాస్త తగ్గినట్టనిపిస్తుంది.

పరీక్షలు రాయటానికి ప్యారిస్ వెళతాడు లియోన్. ఎమ్మాది మళ్లీ ఏకాకి జీవితమవుతుంది. కూతురు పుడుతుంది. ముప్పై ఏళ్లు వస్తాయి, అయినా కోరికలు చల్లారలేదు. అప్పుడు ఆమె జీవితంలోకి రుడాల్ఫ్ బొలాంగర్ ప్రవేశిస్తాడు. ధనిక భూస్వామి, శృంగార పురుషుడు. భర్త, కూతురు, ఇరుగు పొరుగులు, ఊరి పెద్దలు-అందర్నీ విస్మరించి ఎమ్మా అతడి వలలో పడుతుంది. "ఎక్కడికైనా లేచిపోదాం" అంటుంది. "వెనిస్ పోతే బాగానే ఉంటుందం"టాడు ప్రియుడు. ఎమ్మా మళ్లీ కలల లోకంలో విహరిస్తుంది. చివరి క్షణంలో "మనసు మార్చుకున్నాను. ఇక యింతటితో నీకూ నాకూ చెల్లు" అంటాడు బొలాంగర్. హతాశురాలైన ఎమ్మా జబ్బు పడుతుంది. కావ్యాలలోని ప్రియులు ఎంత ధీరోదాత్తులు! ప్రేయసి



మదాంబావరీ నవలలో హీరోయిన్ ఎమ్మా నేనే అన్నాడు ఫ్లోబేర్. డాన్‌క్విక్సాట్ గురించి సెర్వాంటెస్ కూడా సరిగ్గా ఇలాగే వ్యాఖ్యానించాడు. రచయితలు తమ కథల్లోని ప్రతి పాత్రతోనూ మమేకం కాక తప్పదు. ఆ దశలో మాత్రమే సృజన సాధ్యపడుతుంది. ఒక రకంగా ఇతివృత్తంలో రెండు నవలలకూ సారూప్యం కనిపిస్తుంది. అయితే ఫ్లోబేర్ మరో సందర్భంలో "ఇది కేవలం కల్పన. నా అనుభవాలు, ఆలోచనలేవీ లేవందులో" అన్నాడు.

వివాదాస్పద పుస్తకాలకు పాఠకుల్లో ఎప్పుడూ క్రేజ్ ఉంటుంది. ఆ విధంగానే మదాం బావరీ నవల బాగా అమ్ముడుపోయింది. అయితే కోర్టు కేసుల వల్ల ఈ పుస్తకం 'గొప్పది' కాలేదు. చిత్రికపట్టి తన రచనా సృజన శక్తిని మధించి రాసింది కనుకే అంత పేరు వచ్చింది. రచయిత అంతర్మథనం పాఠకులకెంతవరకు చేరిందోగాని, ఈ నవలా రచయిత కోర్టుకు ఈడ్చబడ్డారు. "వ్యభిచరించిన వివాహిత ఆత్మహత్య చేసుకున్నంత మాత్రాన కథ నీతిబద్ధంగా చెప్పినట్టేనా? పుస్తకం నిండా కామక్రీడల్ని విశృంఖలంగా వర్ణించటం నీతిబాహ్యం కాదా? ఒళ్లమ్ముకునే స్త్రీలు కూడా చెయ్యని నీచమైన పనులు పట్టపగ్గాల్లేని పద్ధతిలో వర్ణించి చివరికి విషమిచ్చి చంపితే చేసిన పాపం కడుక్కున్నట్టవుతుందా? 'ఈ పుస్తకం ఆలోచింపచేస్తుంది' అంటాడు రచయిత. కాదు ప్రకోపాన్ని కల్గిస్తుంది. చదివిన వాళ్ల బుర్రలు పాడు చేస్తుంది. ఏ భర్తయినా తన భార్య ప్రియుల్ని ఇష్టపడ్డట్టుగా రాస్తే మన కుటుంబ వ్యవస్థ ఏమైపోవాలి? ' అంటూ ప్రాసిక్యూషన్ విరుచుకుపడింది. ఈ కేసు పాఠకులలో అనూహ్యమైన సంచలనం సృష్టించింది. పుస్తకం అంచనాలకు మించి వేలు, లక్షల కాపీలు అమ్ముడుపోయింది. యురోపియన్ భాషలన్నింటిలోకి అనువదించబడింది. ఇది బూతు పుస్తకమని ఇంత రాద్ధాంతం చేశారు గాని, ఆ రోజుల్లోనే అచ్చయిన మరో అసలైన బూతు పుస్తకం 'ఫానీ'. అది 'మదాంబావరీ' కన్నా ఎక్కువ అమ్ముడుపోయింది.

### గుస్తావ్ ఫ్లోబేర్ (1821–1880)

జననం ఫ్రాన్స్‌లోని రూన్ నగరంలో. తండ్రీ, సోదరుడు కూడా డాక్టర్లే. వైద్య విధానంలోని రోగ నిర్ధారణ పద్ధతి ఫ్లోబేర్ రచనా శైలిని ప్రభావితం చేసిందంటారు. పాత్రల పట్ల ఏ రకమైన ఇష్టాఇష్టాలను ప్రదర్శించకుండా కేవలం రోగ నిర్ధారణ చెయ్యటమే తన లక్ష్యమన్నట్టుగా సాగుతుంది అతడి రచన. ఇరవయ్యేళ్లప్పుడు 'లా' చదవటానికి తొలిసారిగా ప్యారిస్ వచ్చాడు. కాని ఆ నగరమూ, అక్కడి మనుషులూ నచ్చలేదు. జబ్బు పడ్డాడు. సొంత ఊరికి తిరిగి వచ్చి పుస్తక పఠనమూ, రచనే లోకంగా బతికాడు. ప్యారిస్‌లో ఉన్నప్పుడు విక్టర్ హ్యూగోతో కలిగిన పరిచయం స్నేహంగా మారింది. హ్యూగోలాగా, బాల్జాక్ లాగా పుంఖానుపుంఖంగా రాయాలని సంకల్పం. కాని పర్ఫెక్షనిస్టులకు అలా రాయటం వీలు పడదు. చిత్రికలు పట్టి ఒక్కొక్క పేజీ రాయటానికి నెలలు గడిచాయి. లోకం చూడాలని పిరనీస్, కోర్సికా తిరిగి వచ్చాడు. స్వంత సంపాదన లేదు. తండ్రి మీద ఆధారపడిన బతుకు. 1846-54 మధ్య ఓ కవయిత్రితో ప్రేమలో పడ్డాడు. పెళ్ళి వీలు పడలేదు. ఆ నైరాశ్యంతో జీవితాంతం మరెవర్నీ చేసుకోలేదు.

ఫ్లోబేర్‌కు ముప్పై ఏళ్లకే బట్ట తలా, బాన పొట్టా వచ్చాయి. ఆరోగ్యం పాడైంది. మూర్ఛలు తగ్గలేదు. మందుల ప్రభావంతో ఊహా శక్తీ, రచనా సామర్థ్యం కూడా తగ్గాయంటారు. తల్లి మరణించింది. ప్యారిస్ అపార్ట్‌మెంట్‌లో ఒంటరి జీవితం ప్రారంభమైంది. చెల్లెలి భర్త అప్పుల్లో ఉన్నాడని తెలిసి ఉన్నదంతా అతని పేర రాసేశాడు. చిరాకు పెరిగింది. చిన్న విషయాలకు కూడా కోపం, కంట్రోల్ చేసుకోలేని పరిస్థితి వచ్చింది. కొన్నాళ్లు మపాసా తోడుగా గడిపాడు. మపాసాకు సాహిత్య గురువు ఫ్లోబేర్. వాళ్లిద్దరికీ బంధుత్వం కూడా ఉంది.

1870 నాటి యుద్ధంలో జర్మన్ సైన్యాలు అతడి ఇంటిని లూటీ చేశాయి. అసలే ఆర్థిక

కోసం ప్రాణాల్కైనా తెగిస్తారు. కాని ఈ లోకంలో అందరూ పబ్బం గడుపుకునే వాళ్లే. పాపం చేసిన ప్రతిసారీ ప్రాయశ్చిత్తంగా చర్చిని ఆశ్రయించటం అందరికీ అలవాటే. ప్రార్థనలు, దానధర్మాలు చేసి నిష్కృతి కోసం ప్రయత్నిస్తుంది.

పరీక్షలు పాసై, ప్రాక్టీస్ పెట్టడానికి పక్క ఊరికి వస్తాడు లియోన్. సంగీతపాఠాలు నేర్చుకోవటానికి రూన్ వెళతానంటుంది. ఎమ్మా భర్తకివేమి పట్టవు. నీ యిష్టం అంటాడు. అక్కడ చవకబారు హోటలు గదుల్లో వాళ్ల ప్రేమాయణం కొనసాగుతుంది జూదరులు, తాగుబోతులు, వేశ్యలు, రోజూ వచ్చే హోటల్ అది. భార్య అడిగిందే తడవుగా, ఆస్తంతా ఆమె పేర రాస్తాడు చార్ల్స్. విచ్చలవిడిగా డబ్బు ఖర్చు పెడుతుంది ఎమ్మా.

ఆ ఊళ్లో వున్న ఒక వ్యాపారస్తుడు ఆమె అడిగినంత డబ్బు అప్పిస్తాడు. కానీ ఇలాంటి విలాసాలు ఎక్కువ కాలం కొనసాగలేవు. ప్రేమోధృతం కూడా తగ్గుతుంది. వివాహమైనా, వివాహేతర సంబంధమైనా కొంత కాలానికి మొహం మొత్తక తప్పదు. అవే చిరాకులు, పరాకులు, జగడాలు, సాధింపులు. అప్పులిచ్చిన వాడు ఎంతకాలం ఊరుకుంటాడు. నోటీసు వస్తుంది. ఎనిమిదివేల ఫ్రాంకులు తక్షణం కావాలని నోటరీని అర్థిస్తుంది ఎమ్మా. ఇదే అదనుగా అతడామెను తన కోరిక తీర్చమంటాడు. కొన్నాళ్లకైనా సర్దమని ఒక టాక్స్ కలెక్టర్ ముందు చేతులు చాస్తుంది. ఎక్కడా డబ్బు పుట్టదు. చివరి ప్రయత్నంగా పాత ప్రేమికుడు రుడాల్ఫ్‌కు తన గోడు చెప్పుకుంది. అతడు ధనవంతుడు. పెద్ద బంగాళాలో ఉంటాడు. గత ప్రేమకు చిల్లి గవ్వంత విలువ కూడా లేదతడి

ఇబ్బందులు. కొత్త ఇల్లు కొనుక్కునే స్తోమత లేదు. మరింత కుంగిపోయాడు. అకాల వృద్ధాప్యం వచ్చింది. చివరి రోజుల్లో జార్జి సాండ్ (ఇది కలం పేరు) అనే రచయిత్రితో స్నేహం చేశాడు. ప్రేమదాకా వెళ్లింది. కాని అప్పటికే ఆమె వృద్ధురాలు. ఎంత కష్టకాలంలోనూ ఫ్లొబేర్‌కు మిత్రులు సహాయం చెయ్యలేదంటే అందుకు అతడి స్వభావమే కారణం. అందరితో చీటికీమాటికీ కలహించేవాడు. ఫ్లొబేర్ చివరి రోజులు దయనీయంగా గడిచాయి. తాగుడు, చెయిన్ స్మోకింగ్ ఎక్కువైపోయాయి. నడక, వ్యాయామం లేదు. పగలంతా, రాత్రంతా కుర్చీకి అతుక్కుపోయిన జీవితం. దుర్భర దారిద్ర్యం. దానికి తోడు సిఫిలిస్ వచ్చింది. ఎన్ని కష్టాలు వచ్చినా ఎవర్నీ సాయం కోరలేదు. మనిషి అహంకారి. మొహమాటం ఎక్కువ. ఒక నిస్సహాయ స్థితిలో 'మానవ ప్రయత్నమే వృథా' అనే నైరాశ్యం ప్రవేశించింది. జ్ఞానార్జన నిష్ప్రయోజనమనిపించింది. 'విధి'పై నమ్మకం కుదిరింది. ఇదే ఇతివృత్తంతో ''Bouvard et Pe'cuchet'' అనే నవల ప్రారంభించాడు. వ్యంగ్యం, హాస్యం కలిగిన కొత్త రచన. "మదాంబావరీ కాదు. ఇది నా మాస్టర్ పీస్" అని అందరికీ చెప్పాడు. పుస్తకం ముగించకుండానే ఒకనాడు హఠాత్తుగా గుండెపోటుతో మరణించాడు.

శైలి గురించి తనను తాను చిత్రహింసలు పెట్టుకున్న ఫ్లొబేర్‌ది ఒక మానసిక జాడ్యం అన్నారు కొందరు. కాని జీవితాన్ని కేవలం రచనా ప్రక్రియకే అంకితం చేసిన అరుదైన రచయిత అతడు. ప్రతిభ, జీనియస్ లాంటివి జన్మతః వచ్చే లక్షణాలు. కేవలం అవిశ్రాంత శ్రమతో అద్భుత రచనలు చేసిన రచయిత ఫ్లొబేర్. 'మదాంబావరీ' తర్వాత ఫ్లొబేర్ రాసిన మరో నవల "సాలాంబో". 'సెంటిమెంట్ ఎడ్యుకేషన్' అనబడే మరో నవలను అతడి మాస్టర్ పీస్ అంటారు కొందరు. స్కూలు కుర్రాడి తొలి ప్రేమ ఇందులోని ఇతివృత్తం. ఫ్లొబేర్ చివరి పుస్తకం "మూడు కథలు" (1877). అందులో భాషను గణిత శాస్త్రంలాగా వాడాడు.

దృష్టిలో. దారులన్నీ మూసుకుపోయాయి, ఒక్క మృత్యు ద్వారం తప్ప. ఆర్సెనిక్ మింగి కళ్లు మూసుకుంటుంది. ఎమ్మా మరణ వేదనకు అనేక పేజీలు కేటాయిస్తాడు రచయిత. చివరిసారిగా అద్దంలో తన మొహం చూసుకొని రోదిస్తుంది ఎమ్మా.

ఈ నవల గురించి గత నూట యాభై ఏళ్లుగా నిరంతరం చర్చ జరుగుతూనే వుంది. 'ఎమ్మా పుస్తకాలు చదివి బుర్ర పాడు చేసుకొంది' అంటాడు రచయిత. కాని ఆమె ఆనాటి ప్రముఖ రచయితలు యూజీన్ సూ, బాల్జాక్, జార్జిసాండ్, వాల్టర్ స్కాట్‌లను చదివింది. చరిత్ర తత్వశాస్త్ర గ్రంథాలు కూడా తిరగేసింది. పరిణతి లేని వ్యక్తులకు పుస్తక పఠనమే విషతుల్యమా? చదవటం వల్లనే కోడలు ఆరోగ్యం పాడైందని బాధపడుతుంది ఎమ్మా అత్తగారు. ఆమె రెండవ ప్రియుడు లిమోన్‌కు కూడా పుస్తక పఠనమంటే ఆసక్తి. మొదట చార్ల్స్ బావరీ ఎమ్మా తండ్రి కాలికి చికిత్స చేసినప్పుడు (నిజానికది ఆపరేషన్) ఆ వార్త స్థానిక పత్రికలో అచ్చయి తనకు కీర్తి వస్తుందనుకుంటాడు. "అంటే, ప్రింటెడ్ మాటర్ వ్యక్తుల మీద ప్రభావం చూపిస్తుందని చెప్పదలచుకున్నాడు ఫ్లొబేర్. అదే సబ్ టెక్స్ట్" అంటారు విశ్లేషకులు.

'నీతి', 'అశ్లీలత' లాంటి మాటల నిర్వచనాలు దేశకాల పరిస్థితులను బట్టి మారుతుంటాయి. కాని గొప్ప రచనలు పాఠకుల మీద చూపే ప్రభావం వీటన్నింటికన్నా లోతైనది.

ప్రపంచ సాహిత్యంలోనే కాదు, శాస్త్ర రంగంలో కూడా 'మదాంబావరీ'కి శాశ్వత స్థానమున్నది. పగటి కలలు కనే స్వభావాన్ని 'బావరిజం' అంటారు సైకాలజిస్టులు.

—ఎం. వసంత

# రాతిలో తేమ

— గీత



ఒకరు...
విద్య,వినయం, సంస్కారం, మంచితనం,
సహృదయత, స్నేహం, ప్రేమ, మానవత్వం,
సర్వజన ప్రియత్వం, నిండైన వ్యక్తిత్వం గల ఆదర్శ మహిళ!

మరొకరు...
అందరికీ మనస్తాపాలు కలిగిస్తూ, అయిన వారితోనూ,
కానివారితోనూ, చీటికీమాటికీ తగాదాలు పడుతూ,
పుల్ల విరుపు మాటలు మాట్లాడుతూ, సదా స్వోత్కర్ష,
పరనిందలతో గడిపే సంకుచిత మనస్తత్వానికి ప్రతీక!
విభిన్న ధ్రువాలవంటి వీరిద్దరికీ పరిచయం పెరిగింది.
స్నేహం కుదిరింది. ఫలితంగా ఎవరి ప్రత్యేకతను
వారు నిల్పుకున్నారా లేక ఆమెలా ఈమె మారిందా?
ఈమే ఆమెలా తయారయిందా అనేదే సస్పెన్స్
ఇది విడిపోవాలంటే వెంటనే నవలలోకి
వెళ్ళాలి మరి! అద్భుతమైన కథాకథనంతో
మన చుట్టూరా జరిగే సంఘటనలకు
అక్షర రూపం కల్పించి
పరిష్కార వేదిక సిద్ధం చేసిన
'గీత' నవల 'రాతిలో తేమ'
ఈ నెల 'చతుర' సమర్పణ.



"లలితమ్మగారూ! లలితమ్మగారూ!" చేతిలో వాటర్ బాటిల్‌తో వాటర్ కూలర్ వైపు నడుస్తున్న నేను తల తిప్పి చూశాను. ఈ జనారణ్యంలో నన్ను పిలిచేది ఎవరై ఉంటారు?

ఎనౌన్స్‌మెంట్లతో, రకరకాల వస్తువులు అమ్మేవాళ్ళ కేకలతో, ప్రయాణికుల రణగొణ ధ్వనులతో, రైళ్ళ హారన్లతో హోరెత్తిపోతోంది విజయవాడ రైల్వేస్టేషన్‌లోని ఆరో నంబరు ఫ్లాట్‌ఫారం. ఈ శబ్దాలన్నీ చీల్చుకుంటూ మళ్ళీ నా పేరు వినిపించింది.

ఆగిపోయి చుట్టూ చూశాను. జన సందోహాన్ని నెట్టుకుంటూ దూరంగా ఎవరో ఇద్దరు ఆడవాళ్ళు నా వైపుగా వస్తున్నారు. పరీక్షగా చూశాను. వారిలో ఒకామెని ఎక్కడో చూసినట్లనిపించింది. నల్లగా, పొట్టిగా సుమారు అరవై అయిదు, డెబ్భై ఏళ్ళుంటాయి. దృఢంగా ఉంది. నల్లటి మొహంలో తెల్లగా మెరుస్తున్న నవ్వుతో నా దగ్గరగా వచ్చింది. ఎవరో తెలిసినట్టే ఉంది. కానీ పోల్చుకోలేక పోతున్నాను. "ఏమిటీ? నన్నింకా గుర్తుపట్టనే లేదా మీరు? " అంది, బహుశా నా అయోమయ స్థితి నా చూపుల్లో కనిపించి ఉండాలి.

మెరుపులా చటుక్కున గుర్తొచ్చింది అదే! సుందరమ్మగారు కదూ! వెంటనే "భలేవారే! మిమ్మల్ని గుర్తుపట్టక పోవడమేమిటి" అన్నాను నేను నవ్వుతూ.

కూలర్ దగ్గర నలుగురైదుగురు నీళ్ళు పట్టుకుంటున్నారు. నేను కొద్దిగా ఎడంగా నిలబడ్డాను.

"అలా నిల్చుంటే మీరు నీళ్ళు పట్టుకునేసరికి మీరెక్కాల్సిన రైలు వెళ్ళిపోతుంది కానీ, ఆ బాటిల్ ఇటివ్వండి" అంటూ చొరవగా నా చేతిలోని బాటిల్ తీసుకొని కూలర్‌కేసి నడిచింది. రెండు నిమిషాల్లో నీళ్ల నిండిన బాటిల్ నా చేతి కందిస్తూ "అన్నట్టు మీరిక్కడ ఉన్నారేంటి? ఎక్కడికేనా వెళ్తున్నారా? లేకపోతే ఈ ఊళ్ళోనే ఉంటున్నారా? మీ అబ్బాయి, కోడలు బాగున్నారా? ఎంతమంది పిల్లలు? " నా వెనకే సింహాద్రి ఎక్స్‌ప్రెస్ వైపు నడుస్తూ ప్రశ్నల వర్షం కురిపించింది.

"రండి, మీనా ట్రైన్‌లో వుంది చూద్దురుగాని" అంటూ నేను మా కంపార్టుమెంటు దగ్గరికి వెళ్ళి కిటికిలోంచి బాటిల్ అందిస్తూ "మీనా! చూడెవరొచ్చారో, గుర్తుపట్టావా? " అన్నాను. మా మీనా ఆమెవైపు రెండు క్షణాలు సాలోచనగా చూసింది. ఆమె నవ్వు బిగపట్టుకుంటూ చిన్న పిల్లలాగా మీనా వైపే కుతూహలంగా చూస్తోంది.

"ఊc! సుందరమ్మగారు కదూ! బావున్నారా? " నవ్వుతూ పలకరించింది మీనా.

"అమ్మయ్య! మీరే నయం మీ అత్తగారి కన్నా! ఎలా ఉన్నారు? " అని మీనాని అడిగి నాకేసి తిరిగి, నా చేయి చేతుల్లోకి తీసుకుని "మిమ్మల్ని చూడ్డం, అదే ఇలా హఠాత్తుగా అనుకోకుండా చూడడం నాకెంత సంతోషంగా ఉందో చెప్పలేను" అంది.

ఆమె అక్కడ కనబడడం ఒక షాకైతే, ఆవిడ మాటల ధోరణి, ఇలా నా చేతులు తాకడం ఇంకా పెద్ద షాకు. ఇలా షాకుల మధ్య ఉక్కిరి బిక్కిరి అయిపోతున్న నాకు వెంటనే మాటలు రాలేదు.

"నానమ్మా! ఈ ఆంటీ ఎవరూ? నేను కూడా దిగనా? " అయిదేళ్ళ మా మనుమడు మాధవ్ కిటికీ దగ్గరకొచ్చాడు. 'ఈ అబ్బాయెవరూ? మీ మనుమడేనా? అంతా రవి పోలికే? " అంది సుందరమ్మగారు వాణ్ణి పరిశీలనగా చూస్తూ.

"అవునండీ! మేం విశాఖలో ఉంటున్నాం. అత్తయ్యగారు గుంటూరులోనే ఉంటున్నారు. మేమిప్పుడు అక్కడికే వెళ్తున్నాం" అంది మీనా.

"అవునండీ! మా రవికి సెలవు లేదు. లేకపోతే వాడే దింపేవాడు. మీనాకి ఏడవ నెల

వచ్చింది. తన పురిటికి నాకు అక్కడ ఉండడానికి కుదరదు. అందుకే పురిటికి నేనే ఆమెని గుంటూరు తీసుకెళ్తున్నాను" అన్నాను.

"అనుకోకుండా ఇలా మనం కలుసుకోవడం బావుంది కదూ! మా వనజా వాళ్ళకి చెప్తే చాలా సంతోషిస్తారు" ఆమె మొహం నిండా నవ్వు పరుచుకుంది. మనస్ఫూర్తిగా నవ్వే నవ్వు మొహాన్నెంత అందంగా చేస్తుందో ఆమెని చూస్తే తెలుస్తుంది.

"అన్నట్టు మీరెక్కడికి వెళ్తున్నారు? " మీనా ఆమెని అడిగింది.

"మా ఫ్రెండ్స్ అందరం అన్నవరం, సింహాచలం చూసుకుని అలా పూరీ దాకా వెళ్దామని బయల్దేరాం. ఇక్కడ కనకదుర్గ గుడి చూసి, ఇప్పుడే స్టేషన్‌కి వచ్చేసరికి, మేం వెళ్ళాల్సిన బండి రెండు గంటలు లేటని తెలిసింది. ఇంతలో మీరు కనిపించారు." ఆశ్చర్యం, ఆనందం ఇంకా ఆమె గొంతులోనూ, మొహంలో కూడా ప్రతిఫలిస్తున్నాయి.

"అన్నట్టు లలితమ్మగారూ! మీరేదో ఆశ్రమం నడుపుతున్నారని మా మాణిక్యం అక్కయ్య కూతురు, మీకూ తెలుసుగా మాధవి అంది. మంచి పని చేశారు. బాగా సాగుతోందా? " అంది కుతూహలం చూపిస్తూ.

"ఆc! మీ దయవల్ల బాగానే ఉంది. ఇప్పుడు పది పదిహేను మందిదాకా ఉన్నారు. అందరికీ దాదాపు మన వయసే ఉంటుంది. అయినా నేను చెప్పడం ఎందుకు, మీరే రండి ఒకసారి.0 మాణిక్యమ్మగారిప్పుడు అక్కడే ఉంటున్నారు. ఆమెని చూసినట్టూ ఉంటుంది కదా!" అన్నాను నేను.

"నా దయేమిటండోయ్, మధ్యన! అంతా ఆ పైవాడి దయ. మీ మంచి మనసుకి అన్నీ మంచిగానే సమకూడుతాయి. ఊరికే చూడడానికి కాదు. ఏదో ఒకరోజు ఏకంగా చేరిపోవడానికే వస్తాను" అంది నవ్వుతూ.

"వనజా, ప్రకాశంగారూ బావున్నారా? వాళ్ళని వదిలి మీరెలా చేర్తారండీ? " అంది మీనా.

## రచయిత్రి పరిచయం

రచయిత్రి కలం పేరు గీత. అసలు పేరు స్వర్ణ ప్రభాతలక్ష్మి. వృత్తి ఆంగ్లభాషా బోధన అయినా తెలుగు సాహిత్యం మీద మక్కువ ఎక్కువ. అప్పుడప్పుడు కథలు, వ్యాసాలు, చిన్న కవితలు రాస్తుంటారు. అవి వివిధ పత్రికల్లో ప్రచురించబడడంతోపాటు కొన్ని, ఆకాశవాణి విజయవాడ కేంద్రం నుండి ప్రసారమయ్యాయి. ఇటీవల 'ఆంధ్రభూమి' నిర్వహించిన 2006 ఉగాది కథల పోటీలో ఈమె కథ 'అనుబంధం'కు ద్వితీయ బహుమతి వచ్చింది. చాలా సంవత్సరాల విరామం తరువాత చెల్లెలు వెలమకన్న మధుమతి ప్రోద్బలంతో మళ్ళీ కలం చేతపట్టి ఈ నవల రాశారు. మనసుని కదిలించి, ఆలోచింపచేసే రచనలు; ముఖ్యంగా మానసిక విశ్లేషణతో సాగే రచనలంటే ఆమెకు చాలా ఇష్టం. ఉత్తేజం, స్వాంతన కలిగించే సంగీతం అర్థకాని భాషలో అయినా వినడం ఆనందమేనంటారు. సాహిత్యపరంగా ఇంకా ఎంతో సాధించాల్సింది ఉందని పేర్కొంటున్నారు.


**గీత,**

8-3-168/20/16,

సిద్ధార్థనగర్(నార్త్)

హైదరాబాద్ - 500 038.



"నాకేం బాదర బందీలున్నాయమ్మా, పట్టుకుని వేళ్ళాడడానికి? అదిగో మా ప్రకాశం కొడుక్కి..."

"ప్రకాశంగారికి పిల్లలా? ఎందరూ?" మీనా ఆశ్చర్యంగా అడిగింది.

"ఒక్కడే, వాడికి రెండేళ్ళు నిండాయి. మళ్ళీ ఇప్పుడు కనే రోజులు"

"మరి మీరు ఇన్ని రోజులు లేకపోతే వాళ్ళకి ఇబ్బంది కదూ! వనజ ఆఫీసుకు వెళ్తే చిన్న పిల్లవాడంటున్నారు? ఎవరు



చూస్తారు" ఆసక్తిగా అడిగింది మీనా.

"చెప్పడం మర్చిపోయానమ్మా. ఇప్పుడు మా అన్నయ్య, వదిన మా ప్రకాశం దగ్గరికే వచ్చేశారు. అన్నయ్యకి తరుచు ఒంట్లో అనారోగ్యం. ఇక్కడైతే వైద్యానికి సదుపాయంగా ఉంటుందని మా ప్రకాశమే బలవంతాన వాళ్లని కదిలించుకు వచ్చాడు. వాళ్ళున్నారనే ధైర్యంతోనే నేనిలా బయల్దేరాను" అంది చిరునవ్వుతో.

"అదా సంగతి. ఇంక మీరు త్వరలోనే

మా ఆశ్రమానికి వచ్చేస్తారన్నమాట" అన్నాను నేను కొంచెం వేళాకోళంగానే.

"ఆ! రావడానికేమండి... మా శ్రీధర్‌కి, అదే ప్రకాశం కొడుక్కి స్కూలుకి వెళ్లే వయసు వచ్చి వనజకి కాన్పు అయితే చంటి పిల్లాణ్ణి మా వదినె ఒక్కతే చూసుకోగలదు. అప్పుడింక నాకేం బాధ్యతలు ఉండవు. ఎన్నాళ్ళని ఈ తాపత్రయాలు? కాస్త పరం సంగతి కూడా ఆలోచించుకోవాలి గదా!" అంది సుందరమ్మ.

ఆమె వేదాంత ధోరణికి మీనా విస్తు పోతూ వింటోంది.

"భలేవారు మీరు. సుందరమ్మగారు ఆశ్ర మానికి వస్తే మాకెలాగా? మా సంఘానికి ఆవిడ గుండెకాయలాంటివారు" అంది అప్ప టివరకూ మౌనంగా ఉండి మా మాట లు వింటున్న సుందరమ్మగారితో వచ్చినామె.

ఆమె ఉనికి అందరికీ గుర్తొచ్చింది అప్పుడే.

"అయ్యో! మర్చిపోయానమ్మా! ఈమె పంకజం అని నాతోపాటే ఈ టూర్‌కి వచ్చిన వాళ్లలో ఒకరు. మీరు అలవాటు చేశారుగా. రోజూ వెంకటేశ్వర స్వామి గుడికి వెళ్లడం, అది రోజూ నేను తప్పనిస రిగా చేసే పనైపోయింది. అక్కడికి రోజూ వెళ్ళే వాళ్లమందరం ఒక సంఘంలా ఏర్పడ్డాం. పండుగలకి, ఉత్సవాలకి గుడి అలంకరణ రోజువారి గుడి శుభ్రతా అంతా ఇప్పుడు మా బాధ్యతే!" అంది సుందరమ్మ గారు నవ్వుతూ.

ఆమె మాటల్లో ఇంకా తెలిసిందేమంటే ఇలా వారి సేవలు గుడి వరకే పరిమితం చేయకుండా ఎక్కడ ఎలాంటి దుర్ఘటనలు జరిగినా సుందరమ్మగారి సంఘం ముందు కొచ్చి చందాలు, పాత బట్టలు, ఇతర సామాగ్రి పోగుచేసి బాధితులకు సహాయం చేస్తుందట.

ఆమె ఇలా చెప్పుకుపోతుంటే మీనా రెప్ప వేయడం మర్చిపోయి ఆమెనే చూస్తూ సంభ్రమంగా వింటోంది. అయితే నాకేం పెద్ద ఆశ్చర్యంగా అనిపించలేదు. ఎందు కంటే సుందరమ్మగారి తెలివితేటలు, సమ ర్థత నాకు బాగానే తెలుసు. అది ఇప్పుడు సవ్యమైన పనులకోసం ఉపయోగపడుతు న్నాయి. అంతే!

పంకజం పొగడ్తలకి ఆమె ముసిముసిగా నవ్వుతుంది. ఆ నవ్వులో కించిత్ గర్వం, కొండంత సంతృప్తి ధ్వనించాయి.

"నేను చేసేదేం లేదండీ! వాళ్ళ అభి మానం అంతే! అయినా అలాంటి పన్లు ఒక్కరి వల్ల అవుతాయా? అందరూ బాధ్య తలు తీరినవారే! ఇప్పుడు మనకి చేతన యింది చేసి ఇతర్లకు సాయపడకపోతే ఇంక మనిషి జన్మకి సార్థకత ఏముంది చెప్పండి' ' అంది సుందరమ్మగారు చాలా హంబుల్‌గా. మా మీనా నోరు తెరుచుకుని, కళ్ళప్పగించి ఆమెని చూస్తోంది. నాకు నవ్వాగలేదు.

"లలితమ్మగారూ! మరి మీరందరూ హైద రాబాదు ఎప్పుడొస్తున్నారు? మా వనజకి కాన్పయిన తర్వాత ఉత్తరం రాయిస్తాను బాలసారెకి అందరూ తప్పకుండా రావాలి" అంది సుందరమ్మగారు.

"అలాగే తప్పకుండా వస్తాం, ఇంకా ఏమిటి విశేషాలు? " అన్నాను నేను.

ఇంతలో మా రైలు బయల్దేరుతున్నట్టు ఎనౌన్స్‌మెంట్, వెంటనే బండి కదలడం జరిగింది.

"మరి ఉంటానండీ! అప్పుడప్పుడు మీ క్షేమ సమాచారాలు తెలియజేస్తూండండి. మీనా నీకు పండంటి పాపాయి పుట్టాలి" అంటూ సుందరమ్మగారు రైలుతో పోటీపడి నడుస్తూ, చటుక్కున చేతి సంచీలో నుంచి కొబ్బరి చిప్ప ప్రసాదం కాబోలు, పూలు తీసి మీనా చేతిలో పెట్టింది.

రైలు వేగం పెరిగింది. ప్లాట్‌ఫారం మీద నిల్చుని నవ్వుతూ చెయ్యూపుతున్న ఆమె క్రమంగా కనుమరుగయ్యింది. నేను మెల్లగా

నా సీటులో వెనక్కి వాలాను. జ్ఞాపకాల దొంతరలు దొర్లాయి, మనసు గతంలోకి వెళ్ళింది.



సంక్రాంతికి మా రవిని, మీనాని గుంటూరు రమ్మన్నాను. తను హైదరాబాదులో ఉద్యోగంలో చేరినప్పుడు కానీ, మీనాతో కాపురం పెట్టినప్పుడు కానీ నేను హైదరాబాదు రాలేదు కాబట్టి పండక్కి నేనే వాళ్ళ దగ్గరికి రావాలని ఎలాగూ సెలవులే కాబట్టి నేను నాలుగు రోజులు వాళ్ళతో గడిపినట్టుంటుందని, మా వాడు పట్టుబట్టాడు. మా ఊరు, మా ఇల్లు దాటి ఎక్కడికీ వెళ్ళాలని ఉండదు నాకు. కాలేజి, ఇల్లు అంతే, అప్పుడప్పుడు ఏదైనా సాహిత్య గోష్ఠులు జరిగితే వెళ్ళడం తప్పించి ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళింది లేదు. తీరిక దొరికితే ఏదో ఒక పుస్తకం ముందేసుకుంటే టైమ్ తెలీదు నాకు. కానీ పండుగపూట పిల్లల్ని వదిలి ఒక్కదాన్ని ఉండబుద్ధి కాలేదు. అందుకే హైదరాబాదుకి బయల్దేరాను.

చిన్నప్పుడు పిల్లలు మన మాట వినాలని మనమనుకుంటే మన పెద్ద వయసులో వాళ్ళ మాట మనం వినడం సబబే కదా!

రైలు హైదరాబాదు చేరేసరికి తూరుపు రేఖలు విచ్చుకోలేదు. స్టేషన్‌కి రవి వచ్చాడు.

"ఎలా జరిగిందమ్మా ప్రయాణం? రాత్రి బాగా నిద్ర పట్టిందా? " అన్నాడు నా చేతిలోంచి సూటుకేసు అందుకుంటూ.

"ఆc! బాగానే పట్టింది. మీనా ఎలా ఉంది? ఇల్లు సౌకర్యంగా ఉందా? " అడిగాను వాణ్ణి పరిశీలనగా చూస్తూ. "నువ్వే చూడబోతున్నావుగా! మళ్ళీ నేను చెప్పడం ఎందుకూ!" అంటూ ముందుకు నడిచాడు.

హైదరాబాదు నీళ్ళు బాగానే వంటబట్టినట్టున్నాయి. అదికాక ఇంటి భోజనమేమో! బాగా రంగు తేలి, బావున్నాడు.

"ఛ! నా కొడుక్కి నా దృష్టే తగుల్తుందేమో? " అనిపించింది.

నవ్వొచ్చింది నాకు. ఎంత చదువుకున్నా, ఎంత ఆధునిక భావాలు అలవాటు చేసుకున్నా, పిల్లల దగ్గరికి వచ్చేసరికి కొన్ని నమ్మకాలను, చాదస్తాలను వదులుకోలేమేమో!.

"ఎందుకమ్మా, నవ్వుతున్నావు? " రవి ఆగి వెనక్కి తిరిగి నాకేసి చూస్తూ అన్నాడు.

"ఏం లేదు కానీ, మీనా వంట బాగా చేస్తుంది కదూ!" అన్నాను నవ్వు దాచుకుంటూ.

అసందర్భంగా ఉన్న నా మాటలు వాడికి ఒక్క క్షణం అర్థం కాలేదు. మరుక్షణంలో వెలిగింది వాడికి.

"అంటే నేను అంత రోడ్డు రోలరులాగా తయారయ్యానా? "అన్నాడు ఉడుక్కుంటూ.

"అబ్బే! అదేం లేదు కానీ, ఏదో కొంచెం రోలు లాగా ఉన్నావు. అంతే!" అన్నాను నవ్వుతూ.

"ఏం చేయను. నీ కోడలు కొసరి కొసరి తినిపిస్తుంది. నీకు లాగానే" అన్నాడు వాడు కూడా నవ్వేస్తూ.

చిన్నప్పటి నుండీ మా రవి కాస్త బొద్దుగా ఉండేవాడు. ఇప్పుడు లావుకి సరిపడా పొడుగు ఉన్నా, వాణ్ణి నేను టీజ్ చేయడం, వాడు ఉడుక్కోవడం అలవాటే!

స్టేషన్ బయటికి రాగానే చలిగాలి రివ్వున కొట్టింది. మంచు కూడా బాగా పడుతోంది. వెన్నులోంచి కుదుపుతో ఒక జలదరింపు.

"స్వెట్టర్ తెచ్చుకోలేదామ్మా! చూడు ఎట్లా ఒణుకుతున్నావో! ఉండు..." అంటూ తన జర్కిన్ నాకు కప్పబోయాడు.

"అబ్బే! వద్దులేరా. ఆటోలో కూర్చుంటే అంత చలేం ఉండ



దులే" అంటూ చీర కొంగు కప్పుకున్నాను.

"ఈ హైదరాబాదు చలి మనవైపు లాగా ఉండదు" అంటూ రవి ఆటోని పిలిచాడు.

ఎక్కిన తర్వాత కాస్త ఊపిరి తిరిగింది నాకు. ఇల్లు చేరేదాకా రవి ఏదో మాట్లాడుతూనే ఉన్నాడు. ఆటో ఒక తెల్లమేడ ముందు ఆగింది.

"అమ్మా! దిగు! వచ్చేశాం" అన్నాడు తను దిగి సూట్కేసు ఆటోనుండి బయటికి తీస్తూ.

ఆటో దిగుతూ యధాలాపంగా తల తిప్పి చూసిన నేను ఒక్క క్షణం అలాగే ఉండిపోయాను. ఆ ఇల్లు పూల పొదరిల్లులాగా ఉంది. ఇల్లు చిన్నగా ఉన్నా తుది మట్టంగా అందంగా ఉంది. చుట్టూతా చోటు ఎక్కువగా ఉంది. రకరకాల పూల

మొక్కలు పొట్టిగా ఉన్న కాంపౌండ్ వాల్ మీద నుంచి కనుల పండుగగా కనిపించాయి. గోడ పక్కగానే ఉన్నట్టున్నాయి- ఎరుపు, తెలుపు, పసుపు



గులాబీలు, గోడ మీదుగా తొంగి చూస్తున్న పసి పిల్లల్లాగా పలకరిస్తున్నాయి. విరబూసిన బటాణీ పూల తీగ గేటుమీద గొలుసులాగా అందంగా అమరింది. ఇంటి ముందు కళ్ళాపి చల్లి నేలమీద కుదురుగా ఉన్న ముగ్గు ముద్దుగా మెరుస్తోంది. గేటుకు రెండు వేపులా ఎత్తుగా ఎదిగిన కొబ్బరి చెట్లు రెండూ నిండుగా బోండాలతో ఠీవిగా ఆకాశంకేసి చూస్తున్నట్టున్నాయి. లోపల ఇంటికి కుడివైపు ఉన్న మామిడి చెట్టు, ఎడమ వైపు ఉన్న నేరేడు చెట్టు డాబా మీదికి కొమ్మల పందిరి వేశాయి. మొత్తం మీద రోడ్డుమీద పోయేవారిని క్షణకాలమైనా నిలబెట్టేంత అందంగా ఉంది ఆ ఇల్లు.

"ఏమిటమ్మా! అలా నిలబడిపోయావు? మన ఇల్లు ఇక్కడుంది. రా! లోపలికి!" హెచ్చరించాడు రవి. ఆ ఇంటి పక్కనే ఉన్న తెల్ల మేడకేసి నడిచాడు రవి. నన్ను చూసి మెట్లు దిగి మేడ మీదనుంచి వచ్చిన మీనా,

"రండి! అత్తయ్యగారూ! బావున్నారా?" అని పలకరిస్తూ రవి దగ్గర్నుండి సూటుకేసు అందుకుంది.

"బావున్నానమ్మా! నువ్వెలా ఉన్నావు?" అన్నాను. నా చూపులు పక్కింటిని వదిలి రానంటున్నాయి. అది గమనించింది మీనా.

"ఆ ఇల్లు మీకు బాగా నచ్చినట్టుందికదా అత్తయ్యగారూ? " నవ్వుతూ అడిగింది.

"చాలా శ్రద్ధ ఉన్నట్టుంది ఆ ఇంట్లోని వాళ్ళకు. ఇంటిని అద్దంలా చాలా చక్కగా ఉంచుకున్నారు" అన్నాను మెచ్చుకోలుగా.

రవి మీనా ఒకరికేసి ఒకరు చూసుకుని నవ్వుకున్నారు.

కాసేపైన తర్వాత మీనా ఇచ్చిన కాఫీ తాగుతూ "ఎవరుంటారక్కడ? " అడిగాను మీనాని.

"ఎక్కడ? " అర్థం కాలేదు వాళ్ళకి.

"అదేరా! మన పక్కింటి మాట అడుగుతున్నాను. కాసిని పూల మొక్కలు అడిగి తీసుకుని ఇక్కడ కూడా వేయకపోయారా? మరీ ఖాళీగా లేదూ ఆ చోటంతా? " అన్నాను ఇంటిముందు ఖాళీ చోటును చూపిస్తూ.

మీనా ఏం మాట్లాడకుండా టిఫిన్ ఏర్పాట్లు చేస్తోంది.

"పక్కింట్లోనుంచా? " అన్నాడు రవి కళ్ళు పెద్దవి చేసి నాకేసి చూస్తూ.

"అవున్రా అక్కడ్నించే! అదేవిటి, ఏదో అడవిలోంచి తెమ్మన్నంత ఆశ్చర్యపోతావేం" అన్నాను కాస్త చికాకుగా.

వాడు నవ్వాడు.

"నవ్వుతావేంరా? " అన్నాను రెట్టిస్తూ.

మళ్ళీ చిరునవ్వే సమాధానమైంది. మొక్కలంటే నాకు చాలా ఇష్టం. అందుకే వదిలిపెట్టకుండా,

"ఏం మీనా? నేనన్న దాంట్లో అంత ఆశ్చర్యపోయేదేముంది? " కోడల్ని ప్రశ్నించాను.

"అబ్బే! అదేం కాదు. ఆ ఇంట్లోంచా అనీ..." నసిగింది మీనా.

"భలేవాళ్ళే! ఇద్దరికిద్దరూ సరిపోయారు. అంత ఇబ్బంది పడతారేమిట్రా? " అన్నాను అర్థం కాక.

"నీకే తెలుస్తుంది లేమ్మా, ముందు ముందు" అంటూ మావాడు స్నానానికి వెళ్ళిపోయాడు.

నేను మీనా వెనకే వంటింట్లోకి వెళ్ళాను.



అది పుష్యమాసం. పొద్దుట ఏడింటికి కూడా ఎండపొడ కనిపించలేదు. అప్పుడే పూజ ముగించి లేవబోతున్నాను. రోడ్డు మీదనుంచి పెద్ద పెద్దగా అరుపులు వినిపించాయి. కంగారుగా బాల్కనీలోకి వచ్చి రోడ్డు వైపు చూశాను. ఇంచుమించుగా నా వయసే ఉంటుంది. ఎదురింటి ముందు నిల్చుని అరుస్తోంది ఒకామె. "ఎవరికుంటే వాళ్ళే తింటారు. ఊళ్ళో వాళ్ళ జోలికొస్తే ఎవరూ ఊరుకోరు. కొవ్వెక్కి అడ్డదిడ్డంగా సంపాదించింది ఉంది కదా అని ఒళ్ళు బలిసి ఇష్టమైనట్టు చేస్తే ఎవరూరుకుంటారు? మీ వంశం నాశనంగానూ! మీ ఇంట పీనుగెళ్ళా! నేనెవరి సంగతీ పట్టించుకోను. నా జోలికెవరైనా వస్తే నేనూరుకోను. అయినా అందరి పాపిష్టి కళ్ళూ నా ఇంటి మీదే!"

ఇలా సాగిపోతోంది ఆమె ధోరణి. నల్లగా సన్నగా పొట్టిగా ఉంది. గొంతు మాత్రం కంచు గంటలాగా మోగుతోంది. ఆవిడ ఎవరితో పోట్లాడుతోందో నాకర్థం కాలేదు.

"అత్తయ్యగారూ! కంగారు పడ్డారా! కాఫీ తీసుకోండి" అంటూ మా మీనా కాఫీ కప్పు అందించింది నవ్వుతూ.

"మీనా! ఎవరామె? ఎందుకలా అరుస్తోంది" అడిగాను.

"ఆమె మన పక్కింట్లో ఉంటుందత్తయ్యా. ఆమె, ఆమె మేనల్లుడు, ఆయన భార్య ఉంటారు" అంది.

ఇంతలో రవి వచ్చాడు. మా మాటలు విని "కాస్త మన సినిమా ఛాయాదేవి టైపులో వుంటుందిలే, అమ్మా! పోను పోనూ నీకే అర్థమవుతుందిలే! కానీ ఆమెతో పెట్టుకోకు. రేపు ఇలాగే మనింటి ముందు కూడా నిలబడి అరిచినా అరుస్తుంది" అన్నాడు నవ్వుతూ.

"ఊరుకోరా! నీకంతా ఎగతాళే! ఆమెతో నాకేం పని. అయినా ఆమెకేమైనా పిచ్చా ఏమిటి. ఊరికే అరవడానికి? ఆమె మనసు ఎంత బాధపడకపోతే నోటంట అలాంటి మాటలు వచ్చాయో!" అన్నాను సానుభూతిగా.

మీనా ఏం మాట్లాడకుండా నవ్వుతూ లోపలికి వెళ్ళింది.

రవి కూడా నవ్వుతూ "నీకే తెలుస్తుందిలేమ్మా ముందు ముందు" అన్నాడు మళ్లీ. నాకర్థం కాలేదు. కాఫీ తాగుతూ పక్కింటికేసి చూశాను. లోపలి ఆవరణ వాళ్ళ వరండా అంతా మా బాల్కనీలో నుంచి కనిపిస్తుంది. ఇంటి చుట్టూ ఉన్న ఖాళీ చోటులో చక్కగా ముగ్గులు తీర్చిదిద్ది ఉన్నాయి. కాని మనుష్యుల అలికిడి మాత్రం వినిపించలేదు. ఇంతలో ఆమె అలాగే అరుస్తూ విసురుగా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ లోపలికి వెళ్ళింది. నేను కూడా ఇంట్లోకి వచ్చేశాను.

మా రవి ప్రమోషన్ మీద ఈ ఊరికి బదిలీ అయి వచ్చిన తర్వాత నేనిక్కడికి రావడం ఇదే మొదటిసారి. ఇరుగు పొరుగు అంతా కొత్తే! నాకు పక్కింటామె మీద ఆసక్తి ఎక్కువైంది. మాటల మధ్య మా మీనా చెప్పిన భోగట్టా ఏమిటంటే, ఆమెకి బాగా చిన్నతనంలోనే భర్త పోయాడు. అప్పటినుంచి పుట్టింటిలోనే ఉంటోంది. ఒకడే అన్న ఉన్నాడు. అతనితో, ఆయన భార్యతో కూడా అంతగా పడదు. ఉన్న ముగ్గురు మేనల్లుళ్ళలో ఇద్దరు వాళ్ళ సొంత ఊరులో తండ్రితో కలిసి వ్యవసాయం చేసుకుంటున్నారు. ఇతను కాస్త నెమ్మదివాడు. ఇతనికి ఉద్యోగం రాగానే, తను కూడా పట్నం వచ్చేసి వండి పెడుతూ ఉండిపోయింది. అతనికీ మధ్యన పెళ్ళైంది. ఎప్పుడూ అందర్నీ అనుమానంగా చూస్తుంటుంది. ఇరుగు పొరుగు వాళ్ళతో కూడా ఏమాత్రం సయోధ్య లేదు.

కానీ ఈ రోడ్డు మొదట్లో బస్టాపు దగ్గరే ఉన్న పచ్చమేడ వాళ్ళదీ, వీళ్ళదీ ఒకటే ఊరు. అందుకనేనేమో వాళ్ళతో మాత్రం కాస్త రాకపోకలున్నాయి. తను ఎక్కడికీ వెళ్ళదు. ఎవర్నీ లోపలికి రానివ్వదు. ఆమె మేనల్లుడు ప్రకాశం గానీ, అతని భార్య వనజగానీ ఎవర్తోనూ మాట్లాడడం ఉండదు. ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు. ఆ పెద్దావిడ పగలు ఎక్కువ భాగం గేటు దగ్గర కూర్చుని వచ్చేపోయే వారిని చూస్తుంటుంది. సాయంత్రం ఏడుగంటల తర్వాత తలుపులు వేసేస్తుంది. "ఏమిటో, పాపం, ఆమె జీవితం" నాకు ఆమెని తలుచుకుంటే జాలేసింది ఆ మాటే అంటే,

"నీకెవరిని చూసినా జాలేనమ్మా! అందరిలో నీకు మంచే కనిపిస్తుంది. చెడు ఉంటుందన్నా నువ్వు ఒప్పుకోవు గదా!" అన్నాడు రవి.

తర్వాత రెండు మూడు రోజులు రవి, మీనా బలవంతం మీద- నాకు పెద్ద ఇంట్రెస్ట్ లేకపోయినా- సాయంత్రాలు వాళ్ళతో కలిసి బిర్లా టెంపుల్, రామకృష్ణ మఠం, సాలార్‌జంగ్ మ్యూజియం చూసొచ్చాను.

నాలుగో రోజు పొద్దున్న మా మీనా స్నానం చేస్తోంది. కిందికి దిగి, కూరల బండి దగ్గర కూరలు కొంటున్నాను. ఆ పక్కింటామె, ఆమె పేరు సుందరమ్మట, ఆమె కూడా వచ్చింది. తనూ కూరలు బేరం

చేస్తోంది. నేను పలకరింపుగా నవ్వాను. కనీసం చిరునవ్వు కూడా బదులు రాలేదు. నేను మరి మాట్లాడకుండా బెండకాయలు ఏరుకుంటున్నాను.

రెండు క్షణాలు గడిచాయి.

"కొత్తగా వచ్చినట్టున్నారే?"

నేను తలెత్తి చూశాను. రెండు చిన్న కళ్ళు నన్ను పరిశీలనగా చూస్తూ కనిపించాయి.

"అవునండీ! ఇక్కడ మా అబ్బాయి దగ్గరికి వచ్చాను. మాది గుంటూరు" అని ఊరుకోక,

"మీకు మొక్కలంటే బాగా ఇష్టమనుకుంటాను. చాలా చక్కగా పెంచారు మొక్కలు" అన్నాను మాటలు పొడిగిస్తూ.

"ఆ! ఏవో ఉన్నాయిలెండి. ఊళ్ళో ముదనష్టపు వాళ్ళ కళ్ళన్నీ మా పూలమీదే! ఎట్లాగో తెంపుకుపోతారు. మాయదారి సంత అంత దొంగ బుద్ధులెందుకో! వీళ్ళ పాడెకట్టా!" పుల్లవిరుపుగా అందామె.

నాకు ఒక్క క్షణం మనసు చివుక్కుమంది. ఆమె మాటలు నన్నే ఉద్దేశించి అన్నవేమోనని అనిపించింది. ఆమె నా సంగతేం పట్టించుకోకుండా,

"సరిగా తూచు, మోసం చేసి గడించిన సొమ్ము అరగదు. ఆ ముదురు బెండకాయలు వెయ్యకు" కూరల వాడిక్కూడా దీవెనలు తప్పలేదు.

"ఇదుగో నీ తప్పుడు తూకాలన్నీ అదుగో జోలె తగిలించుకుని, కులుక్కుంటూ వెళ్తోందే, అలాంటి వాళ్ళ దగ్గరే! నా దగ్గర కుదరదు" అక్కసుగా అంది.

ఆమె ఎవర్ని అంటోందో నాకర్థం కాక చుట్టూ చూశాను. ఎవరో అమ్మాయి అందంగానే ఉంది. భుజానికి బ్యాగ్ తగిలించుకుని ఆఫీసుకో, కాలేజికో వెళ్తోంది పాపం. నాకు తల తిరిగిపోయింది. బేరం కానిచ్చుకుని మరి మాటలు పొడిగించకుండా వచ్చేశాను.

మీనా నా చేతిలోని సంచి అందుకుంటూ "ఏమిటత్తయ్యా! ఆమె మాటలకు షాక్ అయ్యారా?" అంది, పైనించి చూసిందట.

నాకు ఆమెని చూస్తే గుడిపాటి వెంకటచలంగారి 'శేషమ్మ' గుర్తొచ్చింది. 'శేషమ్మ' బాల వితంతువు పుట్టిల్లు చేరినప్పటి నుంచి చాకిరీతోనే ఆమె జీవితం గడిచింది. ఎలాంటి సుఖం నోచుకోని ఆమెకి ఎవర్ని చూసినా అక్కసే! ఆమె కోపానికి, కసికి మనుషులే కాదు, జంతువులు, పక్షులు, కీటకాలు అన్నీ గురవుతుంటాయి. 'బాగున్నారా' అని ఎవరైనా అడగడం పాపం. ఇంట్లోని పాత రాచ్చిప్ప పగిలిపోవడం దగ్గర్నించి తనకున్న కష్టాలన్నీ ఏకరువు పెడుతుంది. లోకం అంతా తనని హింసించి బాధ పెట్టడానికే పుట్టిందని ఆమె ఉద్దేశం. హాయిగా ఆడుకుంటున్న పిల్లల్ని చూస్తే వాళ్ళ కాళ్ళు విరిగి మూలపడాలని శాపనార్థాలు పెడుతుంది. చివరికి కాకులు అరిచినా, 'ముదనష్టపు కాకులు, ఊరికే అరిచి చస్తున్నాయి' అంటుంది. శ్రీపాదవారి చిన్న కథల్లో పాత్రలు కూడా ఇలాంటి బాల వితంతువులే! జీవితంలో ఎటువంటి సుఖానికి నోచుకోక, రేపటి మీద ఎలాంటి ఆశ లేక చాకిరీయే పరమావధిగా చీకట్లో మగ్గిపోయే వాళ్ళలోని శాడిజం ఎన్ని రకాలుగా బయటికొస్తుందో చూస్తే బాధ, ఆశ్చర్యం కలుగుతుంది. అరవై, డెబ్బైఏళ్ళ క్రితం అప్పటి పరిస్థితులకు అనుగుణంగా మలచబడ్డ అలాంటి పాత్రలన్నింటికి సజీవ ప్రతిరూ

ఇదుగో నీ తప్పుడు తూకాలన్నీ అదుగో జోలె తగిలించుకుని, కులుక్కుంటూ వెళ్తోందే, అలాంటి వాళ్ళ దగ్గరే! నా దగ్గర కుదరదు

పంగా అనిపించింది సుందరమ్మగారు. జీవితం బయటికి వచ్చి ప్రేక్షక పాత్రలో జీవన ప్రవాహాన్ని నిర్వికారంగా చూడడం అందరికీ సాధ్యపడే విషయమా? ఆమెని తలుచుకుంటే నా మనసు ద్రవించింది. అందుకే,

"అంత కరుడు కట్టిన పెసిమిజం, శాడిజం ఒక్క రోజులో వచ్చినవి కావు, మీనా! జీవితం పొడుగునా చేదు అనుభవాలు ఎదురవుతుంటే, మనిషిలోని సున్నితత్వం చచ్చిపోయి, మనసు బండబారిపోయి, జీవితమే రసహీనమైపోతుందమ్మా" అన్నాను నెమ్మదిగా.

మీనా కూడా మాట్లాడకుండా ఆలోచిస్తూ ఉండిపోయింది.

* * *

ఆ రోజు మధ్యాహ్నం కాస్త కునుకు తీసి లేచి, మీనా ఇచ్చిన కాఫీ తాగుతున్నాను.

"ఏమండీ!" బయట్నించి ఎవరో పిలుస్తున్నారు.

"ఎవరూ" అంటూ గ్రిల్ తలుపు దగ్గరికి వచ్చాను.

దాదాపు ఇరవైఆరేళ్ళ అమ్మాయి అక్కడ నిల్చుని ఉంది. తెల్లగా, సన్నగా, పొడుగ్గా ఉంది. నల్లగా నొక్కుల జుట్టు. కళ గల మొహం వెంటనే గుర్తు పట్టాను. పక్కింటి సుందరమ్మగారి మేనల్లుడి భార్య. చాలాసార్లు దూరంనించి చూశాను.

"లోపలికి రావచ్చాండీ! నా పేరు వనజ. మేం మీ పక్కింట్లో ఉంటాం" మొహమాటంగా తనని తను పరిచయం చేసుకుంది.

"లోపలికి రామ్మా!" అని మా మీనాని పిలిచాను.

"పేరంటానికి పిలుద్దామని..." సందిగ్ధంగా అంది.

ఇంతలో మీనా వచ్చింది.

"రండి, రండి. ఏమిటి విశేషం? " అని ఆ అమ్మాయిని పలుకరించి, "అత్తయ్యా! ఈమె వనజ, మన పక్కిల్లే!" నాకు పరిచయం చేసింది. ఆమె నమస్కరించింది. నేను

## దేవులపల్లి కృష్ణశాస్త్రి



**అక్షరాలకున్న అందాన్ని, లాలిత్యాన్ని, మాధుర్యాన్ని తన కలం నుంచి జాలువార్చి తెలుగు వారి ముంగిట గుమ్మరించిన భావకవితా చక్రవర్తి దేవులపల్లి కృష్ణశాస్త్రి. ఎప్పుడూ, అప్పుడే విచ్చిన మల్లెమొగ్గలా దర్శనమిస్తూ, మాటలనిండా, పదాల నిండా లేలేత మావి పూత సౌరభాన్ని కూర్చి శ్రోతలు, పాఠకుల మీదకు రువ్విన ఆయన చతురోక్తులు, చెప్పిన జోకులు ఈ నెల కానుక.**

### వీపుపెట్టి.. జోరున వాన!

ఒకరోజు పాఠశాలకు ఆలస్యంగా వచ్చిన కుర్రాడిని సంజాయిషీ అడిగాడు ఉపాధ్యాయుడు. 'ఏం చేయమంటారు? ఒకడుగు ముందుకేస్తే రెండడుగులు వెనక్కి జారుతోంది.. అందుకే ఆలశ్యం? ' అన్నాడు వాడు. నిజమేకదా అనుకున్నారు అయ్యవారు. అయినా ఆయనకు ఇంకో సందేహం.. 'అవునొరే! ఒకడుగు ముందుకేస్తే రెండడుగులు వెనక్కుజారితే బడికెలా చేరావురా? ' అడిగాడు. 'ఏముంది? బడివైపు వీపుపెట్టి ముందుకు నడిచాను. ఎలాగైతేనేం? ఇప్పటికి చేరాను' అన్నాడు ఆ గడుగ్గాయి...

కృష్ణశాస్త్రి ఒకనాడు మిత్రులతో ముచ్చటిస్తూ సందర్భానుసారంగా చెప్పిన జోక్ ఇది.

నేను రానిదే కదిలే ఉద్దేశం లేనట్టు స్థిరంగా అక్కడే నిలబడింది. ఆమె వైఖరి నాకు అర్థం కాలేదు. ఇంక తప్ప దనిపించి లేచి ఆమెని వెంబడించాను. గేటు తలుపు పెద్దగా చప్పుడ య్యేలా బార్లా తెరిచి పక్కగా నిలబడి "రండి" అంది



నవ్వుతూ తల వూపి, ఆమెని పరిశీలనగా చూశాను. దగ్గ ర్నించి ఇంకా బాగుంది. మొహం చాలా సౌమ్యంగా ఉంది. కానీ ఆమె కళ్ళలో ఏదో బెదురు, బెంగా కనిపించాయి. సాధా రణంగా ఉద్యోగం చేసే ఆ వయసు అమ్మాయిల్లో కనిపించే ధీమా, చలాకితనం మచ్చుకైనా లేవు. అతిగా ఊహిస్తున్నా నేమోననిపించింది. "రేపు మా ఇంట్లో పువ్వు తాంబూలం, పండు తాంబూలం నోము ఉద్యాసన చేసుకుంటున్నాను. మీరు తప్పకుండా రండి" అంటూ మీనాకి బొట్టు పెట్టింది. నన్ను చూస్తూ మృదువుగా నవ్వింది.

"మీరు కూడా రండి. మా పిన్నిగారికి కూడా పరిచయ మైనట్టుంటుంది" అంది.

"అలాగేనమ్మా!" అన్నాను నేను చిరునవ్వుతో.

మర్నాడు మీనా తయారయి వెళ్తూ, "మీరూ రండి అత్తయ్యా! వాళ్ళతో పరిచయం కూడా అవుతుంది" అంది.

"పరిచయం నిన్ననే అయిందిగా! అయినా నువ్వెళ్ళిరా ! నేను పెద్దగా ఎవరింటికీ వెళ్ళనని నీకు తెలుసుగా" అన్నాను బద్ధకంగా.

"సరే! నేను త్వరగా వచ్చేస్తాలెండి" అంటూ వెళ్ళిపో యింది.

ఎన్నాళ్ళనుంచో పూర్తి చేయలేకపోయిన "ఫ్రీడం ఎట్ మిడ్ నైట్" పుస్తకాన్ని ఎలాగైనా మళ్ళీ గుంటూరు వెళ్ళే లోపు పూర్తిచేయాలని పట్టుదలగా చదువుతున్నాను. చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉంది.

"అదేమిటీ! మీరు రాలేదేం, మీ కోడలితో పాటు? ఆ పిల్ల మిమ్మల్ని పిలవలేదా? " ఉలిక్కిపడి తలెత్తాను.

సుందరమ్మగారు ఎప్పుడు లోపలికొచ్చిందో నేను చూడలేదు.

"అలాంటిదేం లేదు. వనజ నన్ను కూడా పిల్చింది. కాని పేరంటానికి నేనెందుకని రాలేదు. రండి. ఇలా కూర్చోండి" నా ఎదురు సోఫా చూపించాను.

"ఇంకా నయం. నేనిప్పుడెక్కడ కూర్చుంటానూ? మీరు రాలేదేమిటా అని కనుక్కుందామని వచ్చాను. అక్కడ ఎవరూ ఏమీ అనుకోరు. మీరు బయల్దేరండి" అంది కద లకుండా.

"ఎవరో అనుకుంటారని కాదు. నాకు అలవాటు లేదు. మా మీనా వచ్చింది కదా!" అన్నాను కాస్త ఇబ్బందిగా.

"వస్తే అదే అలవాటవుతుంది. రండి" అంది. నేను రానిదే కదిలే ఉద్దేశం లేనట్టు స్థిరంగా అక్కడే నిలబడింది. ఆమె వైఖరి నాకు అర్థం కాలేదు. ఇంక తప్పదనిపించి లేచి

ఆమెని వెంబడించాను. గేటు తలుపు పెద్దగా చప్పుడయ్యేలా బార్లా తెరిచి పక్కగా నిలబడి "రండి" అంది.

లోపల హాలులో మా మీనాతోపాటు మరొక ముత్తైదువు వుంది.

"రండి" చిరునవ్వుతో ఆహ్వానించింది వనజ. నేను మీనాకి కొంచెం దూరంలో కూర్చున్నాను.

"వనజా! పసుపు సరిగ్గా రాయి. బొట్టు పెట్టావా? " వనజకి సూచనలిస్తూ సుందరమ్మగారు కూడా మాకు దూరంగా గడప దగ్గర కూర్చుంది.

"నాకిటువంటివన్నీ చాలా సరదా! కానీ ఈ పిల్లకేం పట్టదు. అన్నీ నేనే చూసుకోవాలి" అంది నన్ను పరిశీలనగా చూస్తూ.

ఆమె వనజని పేరు వదిలేసి 'పిల్లా' అనడం కొంచెం విచిత్రంగా అనిపించింది. వనజ మౌనంగా ఆమె చెప్పినట్టు చేస్తోంది.

ఇల్లు చాలా శుభ్రంగా ఉంది. ఉన్న కొద్ది సామాను పొందికగా అమర్చి ఉన్నాయి.

"మీరు ఎక్కడుంటారు? " ఆ ముత్తైదువ అడిగింది నన్ను చూస్తూ.

ఆమె చాలా సాత్వికంగా ఉంది. నేరేడు పండు రంగు జరీ చీరలో, ముఖాన పావల కాసంత కుంకుమ బొట్టుతో కళకళలాడుతోంది. ఆమె మాట కూడా ఆమె ఆకారం లాగే చాలా సౌమ్యంగా ఉంది.

మీనా నన్ను పరిచయం చేసింది.

"అవునమ్మా! నిన్ను అప్పుడప్పుడు చూస్తూనే ఉంటాను. మా ఇల్లు ఈ రోడ్డు చివరున్న బస్టాపుకి ఎదురే. మీ అత్తయ్య గార్ని ఎప్పుడూ చూడలేదు. నా పేరు మాణిక్యం" అంది ఆమె తనని పరిచయం చేసుకుంటూ.

సుందరమ్మగారు ఆమె మాట అందుకుంటూ "మేం ఒక ఊరి వాళ్ళమే. మా ఊరు దుగ్గిరాల" అంది.

"మావారి ఉద్యోగరీత్యా చాలా ఊళ్ళు తిరిగి ఇక్కడ స్థిరపడ్డాం. మా అబ్బాయికి రూర్కెలా స్టీలు ప్లాంటులో ఉద్యోగం. మా అమ్మాయి మా దగ్గరే ఉంటుంది. ఇక్కడే ఎల్ ఐ సిలో ఉద్యోగం దీనికి" ఒక క్షణం ఆగిందామె. "మా అల్లుడు ఏక్సిడెంటులో పోయాడు" నెమ్మదిగా అంది. కూతురి విషయం చెప్పేటప్పుడు ఆమె గొంతులో రవ్వంత విషాదం ధ్వనించింది.

వనజ ఆమెకి చీర ఇచ్చి నమస్కారం చేసింది.

ఆమె వెళ్ళడానికి లేచి "వెళ్ళొస్తానమ్మా!" అని వనజకి చెప్పి "సుందరం! మరి నేను వెళ్తాను. మీ బావగారికి పెందరాళే అన్నం తినకపోతే అరగదు" అంటూ రెండడుగులు గుమ్మంవైపు వేసి ఆగి నాకేసి తిరిగి" మీరు ఉంటారా నాలుగు రోజులు? మా ఇంటికి ఒకసారి రండి. నాకూ ఏమీ తోచదు, మీ లాంటి చదువుకున్న వారితో మాట్లాడాలంటే నాకు ఇష్టం" నవ్వుతూ చనువుగా నాతో అంటూ బయటికి నడిచింది. నేను కూడా నవ్వుతూ తలాడించాను. వనజ ఆమెని పంపించడానికి గేటు దాకా వెళ్ళింది.

యథాలాపంగా నేను సుందరమ్మకేసి చూసి విస్తుపోయాను. ఆమె మూతి విరుస్తోంది. నన్ను చూసి "సిగ్గు లేకపోతే సరి! చూడండి వెధవ కూతుర్ని ఊరి మీదికి వదలి ఎంత గొప్పగా చెప్పుకుంటోందో! రేపు దానికి ఏ కడుపో కాలో వస్తేగాని దీనికి బుద్ధిరాదు. పెద్ద కలుపుగోలు మనిషినని బడాయి పోతుంది. ఎప్పుడూ లొడలొడా మాట్లాడడం గొప్పా ఏమిటి" అంది అక్కసుగా.

నాకేం మాట్లాడాలో అర్థం కాలేదు. మీనా నాకేసి చూడకుండా గోడ మీద కాలండర్లని అతి శ్రద్ధగా చూస్తోంది.

వనజ లోపలికి వచ్చింది "మీనాక్కూడా చీర పెట్టు" అంటూ హెచ్చరించింది.

"ఇప్పుడవన్నీ ఎందుకండీ! తాంబూలం ఇవ్వండి చాలు" అంది మా మీనా మొహమాటపడుతూ.



"భలేదానివేలే! ముత్తైదు జన్మ ఎన్ని జన్మలు పుణ్యం చేస్తే వస్తుందీ! ఇస్తుంటే వద్దనకూడదు"

నాకు ఆమెని చూస్తే కడుపులో చెయ్యి పెట్టి కెలికినట్టనిపించింది. వనజ మీనాకి కూడా చీర, తాంబూలం ఇచ్చింది నాక్కూడా వనజ చేత పళ్ళు ఇప్పించింది.

నేను, మీనా వెళ్ళడానికి లేచాం.

"మీరు కూడా ఎప్పుడైనా మా ఇంటికి రండి, దగ్గరేగా!" మర్యాద కోసం పిల్చాను. ఫడీమని నా ముఖం పగిలేలా వచ్చింది ఆమె నుంచి నాకు జవాబు.

"నాకు అలా అందరిళ్ళలోకి జొరబడే అలవాటు లేదు. పనితోటే నాకు రోజంతా సరిపోతుంది" అంది పుల్లవిరుపుగా.

నాకు తల తిరిగిపోయింది మరో మాట లేకుండా గేటుకేసి నడిచాను. ఆమె కూడా మాతోబాటు గేటుదాకా వచ్చింది. మేం రోడ్డుమీద కాలు పెట్టగానే, దగ్గరగా వచ్చి నా చీరకేసి పరీక్షగా చూస్తూ "మీ చీర చాలా బాగుంది ఎంతక్కొన్నారూ? " అంది.

"నాకు తెలీదండీ! మా అబ్బాయి కొనుక్కొచ్చాడు" అంటూ మీనాతో ఇంటికేసి బయల్దేరాను. ఈమెనెలా అర్థం చేసుకోవాలో నాకు తెలీలేదు.

"ఏమిటి! ఆ లేడీ ఇడీ అమీన్ ఇంటికి వెళ్ళొస్తున్నారా? మీ మెదళ్లు అంతా తినేసిందా, ఏమైనా మిగిల్చిందా? " తలుపు తీస్తూ జోక్ చేశాడు రవి.

"నువ్వు మరీ రా! ఆవిడా మనిషేగా!" అన్నాను ఆమెను వెనుకేసుకొస్తూ.

"ఆఁ! ఆకారానికి మనిషిలే" అన్నాడు వాడు.

"కాదుగాని అత్తయ్యగారూ! నేనిక్కడికి వచ్చి చాలా కాలమైంది కదా! పలకరింపు మాట దేవుడెరుగు. కనీసం చిన్న చిరునవ్వైనా ఆమె నాకు ఇవ్వలేదు. అలాంటిది మిమ్మల్ని మనింటికి వచ్చి మరీ పిలవడం మాత్రం పెద్ద విశేషమే! అసలు ఎవర్నీ

వాళ్ళింటి దరిదాపుల క్కూడా రానీయదు కదా!" అంది మీనా ఆశ్చర్యంగా.

"అమ్మ కూడా తనలాంటిదే కదా! ఆమె తన మేనల్లుడి భార్యని వేధించినట్టే అమ్మ కూడా నిన్ను సతాయిస్తుందనీ, ఇద్దరూ ఒకటే జాతివాళ్ళని అనుకుందేమో" అన్నాడు రవి ఎగతాళిగా.

"ఊరుకోరా! నీకు ఆవిడ మీద మరీ దుర భిప్రాయం ఉంది. పోనీలే పాపం!" అన్నాను అలాంటి సంభాషణ పొడిగించడం ఇష్టం లేక.

"అమ్మా! నీకు ఆవిడ మీద చాలా అనవసరంగా సానుభూతి కలుగుతోంది. జాగ్రత్త చిక్కుల్లో పడతావ్ చూసుకో" అన్నాడు నవ్వుతూ.

"నాకు ఆవిడతో చిక్కులు వచ్చేటంత చిక్కటి పరిచయం ఏమీ లేదుగాని నువ్వు కంగారుపడకు" అంటూ లోపలికి వెళ్ళాను.

అయితే అప్పుడు నాకసలు తెలీలేదు, నేను పొరపాటు పడ్డానని.

## 4

రెండు రోజుల తర్వాత ఆఫీసు నుంచి వస్తూనే, హడావుడిగా "అమ్మా! వెంకటేశ్వర స్వామి గుళ్ళో భగవద్గీత మీద ఉపన్యాసాలున్నాయట. నీకు గీత అంటే చాలా ఇష్టం కదా! వెళ్తావా? " అన్నాడు రవి.

నేను నవ్వాను.

"ఎందుకమ్మా! నవ్వుతున్నావు? " వాడికి అర్థం కాలేదు.

"గీతంటే ఇష్టమేమిటిరా? నీకు డిక్షనరీ అంటే ఇష్టం కదూ! అన్నట్టుంది" అన్నాను ఇంకా నవ్వుతూ.

"భగవద్గీతకి, డిక్షనరీకి పోలికేమిటమ్మా" అన్నాడు అయోమయంగా చూస్తూ.

"ఏం, ఎందుకు లేదూ? " నేను రెట్టించాను.

"ఏమో! నీ మాటలు నాకర్థం కావు" అన్నాడు.

"నీకు తెలీని అర్థాలు తెలియజేసి, భాష మీద పట్టు కలిగించి నీ భావాలని స్పష్టంగా



ఇతరులకు చెప్పగలిగేలాగా చేయడమేగా దాని ఉపయోగం? "

"అయితే...? "

"అలాగే భగవద్గీత కూడా జీవితంలో ఎదురయ్యే సమస్య లెన్నింటికో పరిష్కారాలు చూపెడుతుంది. వెతికే ఓపికే ఉండాలి కాని మన జీవితాలకి సంబంధించిన అన్ని ప్రశ్నలకీ సమాధానాలు భగవద్గీతలోనే దొరుకుతాయి" రవితో పాటు మీనా కూడా వింటోంది.

"చాలా మందిలో ఒక అపోహ ఉంది. భగవద్గీత అంటే అదేదో దేవుడికి, మతానికి సంబంధించినదని అనుకుంటారు. అందుకే భగవద్గీత అనేది ముసలి వయసులో మాత్రమే చదివే పుస్తకమని మీలాంటి కుర్రకారు అభిప్రాయం. దానికి తగ్గట్టే సినిమాల్లోను, కథల్లోనూ రిటైరై మరో వ్యాపకంలేని వాళ్ళు, వయసు మళ్ళినవాళ్ళు మాత్రమే మోక్షానికి మొదటి మెట్టుగా గీతా పఠనం చేస్తున్నట్టు చూపెడతారు. నిజానికి భగవద్గీత చదవడానికి ఏజ్ లిమిట్‌గాని, ఏజ్ బార్ అవడం కానీ ఉండదురా! దాంట్లో అన్ని వయసుల వారికీ అన్నీ సమయాల్లోనూ పనికొచ్చే అమృత గుళికలు ఉన్నాయిరా నాన్నా"! అన్నాను నవ్వుతూ.

"అబ్బ! అమ్మా! పెద్ద క్లాసు తీశావు కదా! సర్లే నేను కూడా చదవడానికి ప్రయత్నిస్తాలే!" అన్నాడు లోపలికివెళ్తూ.

నాకు అప్పుడప్పుడూ అనిపిస్తూ ఉంటుంది. నా పెంపకంలోనే ఏదో లోపం ఉండి ఉంటుంది. చిన్నప్పటి నుంచి చదువులోను, ఆట పాటల్లోనూ చాలా చురుగ్గా ఉండేవాడు రవి. వాడి ప్రవర్తన కూడా నాకెప్పుడూ సమస్య కాలేదు. అదృష్టం కూడా తోడై మంచి చదువుతో పాటు మంచి ఉద్యోగం కూడా తేలిగ్గానే వాడి సొంతమయింది. రత్నం లాంటివాడని, చాకులాంటి వాడనీ అంటుంటారు అందరూ వాడి గురించి. కానీ ప్రతి విషయాన్ని తేలిగ్గా తీసుకుంటూ మరీ మెటీరియలిస్టిక్‌గా తయారవుతున్నాడేమోనని నాకు భయం కలుగుతుంటుంది. నాకు పుస్తకాల మీద ఉన్న అభిమానం వాడికి వారసత్వంగా రాలేదు. మంచి పుస్తకం మంచి స్నేహితుడిలాంటిదనే భావం వాడిలో కలిగించలేకపోయాను.

"అత్తయ్యగారూ! కాఫీ తీసుకోండి" మీనా అందించిన కాఫీ మౌనంగా అందుకున్నాను కొత్తగా పెళ్ళైన వాళ్ళ మధ్య అడ్డుగా ఉండడం ఇష్టం లేదు నాకు. అందుకే రవి ఎంత బతిమాలినా హైదరాబాద్‌కి నా ట్రాన్స్‌ఫర్ కోసం నేను ప్రయత్నించలేదు. సెలవులకి వచ్చినా మళ్ళీ నా గూటికి చేరడమే నాకు బావుంటుంది.

వాళ్ళు ఒకరిపట్ల ఒకరు అవగాహన, నమ్మకం, ప్రేమ పెంచుకోవాలంటే ఏకాంతం ఎంతైనా అవసరమని నా నమ్మకం. అందుకే ఇక్కడున్నన్నాళ్ళు అందమైన సాయంత్రాలు వాళ్ళిద్దరికీ వదిలేయాలని నిర్ణయించుకున్నాను.

మర్నాడు సాయంత్రం అలా గుడికి వెళ్ళి భగవద్గీత మీద డిస్కోర్స్ విందామని బయలుదేరాను.

"అమ్మా! నేను నిన్ను బైక్ మీద దింపుతాను. నీకిక్కడ అంతా కొత్త గదా!" అన్నాడు రవి.

"అబ్బే ఎందుకురా, నడిచి వెళ్ళే దూరమేగా. నేను వెళ్తాలే మనం రైల్వే స్టేషన్ నుంచి వచ్చేటప్పుడు గుడి చూశాను" అన్నాను.

గుడి ఆవరణలో ఒక పక్కగా ఎత్తుగా ఉన్న అరుగుమీద ఉపన్యాసానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. అరుగు ముందు వేసి వున్న టార్పాలిన్ పట్టాలమీద అప్పటికే కొందరు కూర్చుని ఉన్నారు.

ఇంకా మొదలవలేదు కాబట్టి ఈలోగా నేను దేవుడి దర్శనం చేసుకుని వద్దామని గుడిలోపలికి వెళ్ళాను. దైవ దర్శనం చేసుకుని, తీర్థం తీసుకుని బయటికొచ్చాను. గుడిలోపల ప్రాంగణం అంతా చాలా

## ముత్యమంతా బురద...




"జిడ్డు మొహం నువ్వూను... ఎప్పుడూ అలా నూనె తాగిన మొహంతో కన్పించకు" ఇలాంటివి అందరి ఇళ్ళలో సర్వ సాధారణంగా విన్పించే తిట్లు.

కొంతమంది శరీరతత్వాన్ని బట్టి, చర్మం జిడ్డు కారుతున్నట్టు ఉంటుంది. ఇలా ఉండడానికి వంశపారంపర్య, హార్మోన్ల లోపం ముఖ్య కారణం. ఈ ఆయిలీ స్కిన్‌కి ప్రత్యేకమైన చికిత్స అంటూ ఏదీ లేదు. అన్నీ తాత్కాలికాలే... అయితే కొన్ని చిట్కాలు సూచిస్తున్నారు. అనుభవజ్ఞులైన చైనావాళ్ళు

ముఖానికి బురదను ఫేషియల్లా పట్టిస్తే కొంతవరకు అది చర్మం స్రవించే నూనెల్ని పీలుస్తుందట. ఇందుకు ముదురు గోధుమ వర్ణం కల బురద మరీ శ్రేష్ఠమట.

అలాగే... వేణ్ణీళ్ళ స్నానం కూడా మంచిదట. వేణ్ణీళ్ళు, సబ్బు కలిసి చర్మం స్రవించే నూనెల్ని తగ్గిస్తాయట. మనం వాడే సబ్బు కూడా నూనెల్ని తగ్గించడంలో ప్రముఖ పాత్ర వహిస్తుందట. క్యూటికురా, క్లియరసిల్, న్యూట్రజీనా వంటి సబ్బులు జిడ్డోడుతున్న చర్మానికి మంచివట. వాటర్ బేస్ ఉన్న కాస్మోటిక్స్‌ను ఎంచుకుని వాడమని కూడా వారు సూచిస్తున్నారు. పసుపుకొమ్ము అరగదీసి, దానిలో రెండు చుక్కలు తులసి రసం కలిపి రాయటం వల్ల మొహానికి అదనపు మెరుపు రావడమేకాక చర్మం జిడ్డోడడం తగ్గుతుందట.

శుభ్రంగా ఉంది. మనసుకి ఏదో తెలియని ప్రశాంతత కలిగింది.

ఒక్కొక్కసారి మనసు అట్టడుగు పొరల్లో ఏదో అలజడి, అసంతృప్తి కారణం వెతికి పట్టుకోవడం ఎంత ప్రయత్నించినా సాధ్యం కాదు. ఆయన సంపాదించి వదిలిపోయిన ఆస్తికి తోడు నా సంపాదనా తోడైంది. అందువల్ల ఆర్థిక ఇబ్బందులేమీ లేవు. కోరి సంపాదించిన ఉద్యోగం మనసుకి నచ్చిన వ్యాపకమే! కాలక్షేపానికి, మానసిక ఉల్లాసానికి మంచి సాహిత్యంతో పరిచయముంది. విద్య, వినయం నాపట్ల ప్రేమ అన్నిటితో పాటు తన కాళ్ళ మీద తను నిలబడగలిగిన మనస్థైర్యం, సమర్థత ఉన్న వాడు మా అబ్బాయి. మా వారు లేని లోటు తప్పించి, నాకు జీవితంలో కావల్సిందేమిటో అర్థం కాక కొట్టుమిట్టాడిన క్షణాలెన్నో! మనకేం కావాలో తెలియని స్థితి కన్నా దౌర్భాగ్యం మరేం ఉంటుంది?

నా ఆలోచనల్లో పడి నేను గమనించనే లేదు. స్వామీజీ వచ్చి కూర్చుని ఉపన్యాస ప్రారంభానికి ఉద్యుక్తులవుతున్నారు.

ఆయన వయసు 30, 35 ఏళ్ళకు మించి ఉండదు. ముఖంలో ప్రశాంతత, కళ్ళలో ఏదో వెలుగు, బహుశా జ్ఞానం తాలూకు మెరుపేమో!

ఇంత చిన్న వయసులో అంత వైరాగ్యం ఎలా కలిగిందో! నా ఆలోచనకి నాకే నవ్వు వచ్చింది. డెబ్బైఏళ్లు వచ్చినా దిండు కింద సెక్స్ పత్రికలు దాచుకుని మరీ చదివేవాడు మా పాపయ్య మామయ్య. వయసుకీ, మానసిక పరిపక్వతకి సంబంధం ఏం

లేదుగా!

స్వామీజీ మృదు మధుర కంఠధ్వని గుడి ఆవరణలో ప్రతిధ్వనిస్తోంది. ఆయన మాటలు చాలా మెత్తగా ఉన్నాయి. చిరుస వ్వడితో సాగే సెలయేరులా సాగిపోతోంది ఆయన ఉపన్యాసం అందరూ మంత్రముగ్ధుల్లాగా వింటున్నారు. ఎంత సమయం గడిచిందీ తెలీలేదు.

స్వామీజీ ఉపన్యాసం ముగించి చిరునవ్వుతో లేచారు.

"రోజూ వస్తున్నారా గుడికి? " నా వెనుకగా వినిపించింది.

వెనక్కి తిరిగి చూశాను. మాణిక్యమ్మగారు చిరునవ్వుతో నావంకే చూస్తున్నారు. మూడు వేళ్ళ వెడల్పున్న జరీఅంచు చీర చక్కగా తీరుగా వేసుకున్న ముడి చుట్టూ ముచ్చటగా ఉన్న కనకాంబరాలు నుదుట సూర్యబింబంలా వెలుగుతున్న కుంకం బొట్టు. ఆ క్షణంలో ఆమెని అక్కడ చూసినప్పుడు గుడిలోని అలివేలు మంగమ్మ ముసలి రూపంలో ఎదురుగా నిల్చున్నట్టుంది.

ఇదేమిటీ! గుడికొచ్చినప్పటి నుంచీ అంతా ఎంతో అందంగా ప్రశాంతంగా కనిపిస్తోందేమిటి? ఇదంతా మనసు చేసే గారడీల్లో ఒకటేమో! నవ్వుకున్నాను.

"ఏమిటి మీలో మీరే నవ్వుకుంటున్నారు? రోజు ఉపన్యాసాలకి వస్తున్నారా? "

నాకేసి కాస్త వింతగా చిరునవ్వుతో చూస్తూ అంది ఆమె.

నన్ను నేను సర్దుకుని

"లేదండీ! నిన్ననే మా అబ్బాయి ఇక్కడ ఉపన్యాసాలున్నాయని చెప్పాడు ఇవాళే మొదటి సారిగా ఇక్కడికి వచ్చాను" అన్నాను.

"మీరు రోజూ వస్తారా? " నేనూ అడిగాను.

"ఆఁ! రెండు రోజుల్నించీ వస్తున్నాను. కానీ రాత్రిపూట చీకట్లో ఒంటరిగా ఇంటికి వెళ్ళాలంటే కొద్దిగా కష్టంగా ఉంది. రండి మీరూ అటేగా" అంటూ ముందుకు నడిచిందామె.

"రేపటి నుంచి నేను కూడా మీకు తోడుగా ఉంటానులెండి" అన్నాను, ఆమెని అనుసరిస్తూ

అంతకు ముందే రోజూ గుడికి సాయంత్రంపూట రావాలని నిర్ణయించుకున్నాను.

"రోజూ వెళ్ళలేకపోతే ఇంట్లోనే కూర్చుని



## కోటలు దాటిన మిత్రుల కోతలు

'హిమాలయాల వద్దకు వెళ్ళి గట్టిగా కేకవేస్తే పది నిముషాల తర్వాత దాని ప్రతిధ్వని విన్పిస్తుంది' అన్నాడొకడు

'ఓస్ అంతేనా? అదే టిబెట్‌లో అయితే ఎనిమిది గంటల తర్వాత దాని ప్రతిధ్వని స్పష్టంగా వినబడుతుంది' అన్నాడు ఇంకొకడు.

'పిచ్చి వెధవల్లారా! నేనైతే రాత్రి అన్నాలు తిన్నాక 'ధర్మరాజా లే!' అని గట్టిగా కేకపెట్టి పడుకుంటాను. ఉదయాన్నే మళ్ళీ దాని ప్రతిధ్వనికి నిద్రలేస్తాను... దీనికేమంటారు? ' అన్నాడు మూడోవాడు.

ఇది కూడా కృష్ణశాస్త్రి మిత్రులతో కబుర్లాడుతున్న వేళ విసిరిన జోకే.

హాయిగా టివి చూడ రాదా" అంటుంది మా మాధవి. నేను గాని, వాళ్ళ నాన్నగారు గాని బయటికొస్తే ఇల్లు చేరేదాకా దీనికి స్థిమితం ఉండదు. ఆ టి.వి. ప్రోగ్రాంలు ఏం బాగుంటాయి. ఎందుకే అంత భయం అంటే విసుక్కుంటుంది" మురిపెంగా అంది.

"ఇంక మీ అమ్మాయి భయపడక్కర్లేదులెండి. నేనూ మీతో ఉంటాగా!"

అలా మాట్లాడుకుంటూ నెమ్మదిగానే నడిచినా మా సందు దగ్గరికి త్వరగా వచ్చేసినట్టుగా ఉంది.

ఒక లేత పసుపు రంగు మేడ దగ్గర ఆగి, "ఇదే మా ఇల్లు రండి లోపలికి" అంది వెనక్కి తిరిగి నాకేసి చూస్తూ.

"తర్వాత వస్తానులెండి. ఇకనుంచీ రోజూ కలుస్తూనే ఉంటాంగా" అన్నాను నేను ముందుకి అడుగేస్తూ.

నేను గడపలో కాలు పెడ్తుండగానే రవీ, మీనా లోపల్నించి నాకెదురొచ్చారు. ఇద్దరి మొహాల్లో ఆదుర్దా కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"ఏమిటమ్మా ఇంత ఆలస్యమైందేమిటి? నువ్వింకా రాకపోతే చీకట్లో ఇల్లు కనుక్కోలేకపోయావేమోనని భయపడ్డాం. గుడి దగ్గరికి వద్దామని బయల్దేరబోతున్నాను" అన్నాడు రవి.

"రేపట్నించి మీ అబ్బాయి బైక్ మీద దింపుతారు మీకు అంతగా వెళ్ళాలనుంటే. ఈ చీకట్లో మీరు ఒంటరిగా రావడమెందుకు? " టేబుల్ మీద భోజనానికి ఏర్పాట్లు చేస్తూ అంది మీనా.

"భలే వాళ్ళేరా! గుడి ఎంత దూరమనీ! అదీకాక ఇప్పుడెంత పొద్దుపోయిందనీ. ఊరికే హడావుడి చేస్తున్నారు" అంటూ చీర మార్చుకోవడానికి లోపలికెళ్ళాను.

"ఎలా ఉందమ్మా, స్వామీజీ ఉపన్యాసం? " భోజనాల దగ్గర రవి అడిగాడు.

"ఆ! మరే మనుకున్నావు మా అమ్మ అంటే, నీలాగా వాకిలి దగ్గర పక్కకి తిరిగి నడవక్కర్లేదు" రవి కళ్ళు ఎగరేసి అంటూ ఏడి పిస్తున్నాడు మీనాని

"అత్తయ్యగార్ని చూస్తూంటే తెలీడంలా బాగా నచ్చినట్టే ఉంది." అంది మీనా నవ్వుతూ.

"అవునమ్మా! స్వామీజీ గీతని చాలా బాగా వ్యాఖ్యానిస్తున్నారు. ఇకనుండి రోజూ వెళ్దామనుకుంటున్నాను" అన్నాను పెరుగు కలుపుకుంటూ.

"అయితే మీరు రోజూ అత్తయ్యగార్ని గుడి దగ్గర దింపి, మళ్ళీ మీరే పికప్ చేసుకురండి" అంది మీనా రవిని హెచ్చరిస్తూ.

నేను పెంచిన రవిని మీనా ఆజ్ఞాపిస్తోంది. ఒక్క క్షణం అసూయ అనే చిరు కెరటం నాలో లేచింది. వెంటనే విజ్ఞత దాన్ని అణిచేసింది.

"అలాగే, మేడమ్" అంటున్నాడు రవి మీనాని వెక్కిరిస్తూ.

"ఎందుకూ? నాకు మాత్రం వేరే ఎక్సర్సైజ్ ఏం ఉంది? ఆ మాత్రం దూరం కూడా నడవకపోతే పదిరోజుల తర్వాత ఇంక నేను నడవలేను దొర్లడమే" అన్నాను నవ్వుతూ. కాని ఎప్పటిలా అది స్వచ్ఛంగా ఉందా అనుకున్నాను.

"భలేవారే అత్తయ్యగారూ! అలా ఏం కాదు. మీరు ఈ వయసులో కూడా ఎంతో స్లిమ్‌గా చక్కగా ఉంటారు" అభిమానంగా నాకేసి చూస్తూ అంది. నేను గిల్టీగా ఫీలయ్యాను. నా మనసు తేలికయ్యింది.

"ఆ! మరేమనుకున్నావు మా అమ్మ అంటే, నీలాగా వాకిలి దగ్గర పక్కకి తిరిగి నడవక్కర్లేదు" రవి కళ్ళు ఎగరేసి అంటూ ఏడిపిస్తున్నాడు మీనాని. వాళ్ళ బెడ్‌రూం వాకిలి కొంచెం వెడల్పు తక్కువగా

ఉంటుంది. కొంచెం ఒడ్డుపొడుగు ఉండే మీనా కొద్దిగా ఇబ్బంది పడుతుంటుంది. అందులోంచి వెళ్ళాల్సివచ్చినప్పుడంతా.

"ఛ, వూరుకోరా! నువ్వు మరీ అతిగా చేస్తావు! వాణ్ణి కసిరి, "అన్నట్టు మీనా, ఆరోజు మన పక్కింట్లో పరిచయమయ్యారు చూడు మాణిక్యమ్మగారు, ఆమె ఇవాళ గుళ్ళో కలిసింది. ఇకనుంచి ఇద్దరం కలిసే గుడికి వెళ్ళాలనుకున్నాం. కాబట్టి మీరేమీ కంగారు పడక్కర్లేదు" నా మాటలు ఇంకా పూర్తి కాలేదు. పక్క ఇంట్లోంచి పెద్దగా అరుపులు వినిపిస్తున్నాయి. నేను గాభరాగా లేవబోయాను.

"కంగారు పడకమ్మా! అదంతా మామూలే!" అంటూ పెరుగన్నంలో ఆవకాయ ముక్క కొరుకుతున్నాడు రవి తాపీగా. మీనాలో కూడా ఏమీ కదలిక లేదు.

"ఇదేమిట్రా! అసలు విషయమేమిటో కనుక్కోవద్దూ? " అన్నాను. నాకు కంగారుగా ఉంది.

"తెలీకపోతే కదమ్మా! నీకు కొత్తకదూ! అందుకే గాభరా పడుతున్నావు" అన్నాడు సింక్ దగ్గర చేతులు కడుక్కుంటూ.

"ఏం లేదత్తయ్యగారూ! ఇది తరుచూ జరుగుతూనే ఉంటుంది. సుందరమ్మగారికి ఇక్కడున్న మేనల్లుడు కాక ఇంకా ఇద్దరు మేనల్లుళ్ళున్నారు. వాళ్ళు ఊళ్ళోనే అమ్మా నాన్నల దగ్గర వుండి పొలం చూసుకుంటుంటారు. ఈమె వాళ్ళెవరినీ ఈ మేనల్లుడితో, అతని పేరు ప్రకాశంలెండి. కలవనివ్వదు. అక్కడికి వీళ్ళు వెళ్ళాల్సిన పరిస్థితి వస్తే తను కూడా వెంట వెళ్ళి ఒకరోజో, అర రోజో ఉండి మళ్ళీ వెంటపెట్టుకుని మరీ తీసుకొచ్చేస్తుంది. వాళ్ళెవరైనా ఇక్కడికి వస్తే వాళ్ళతో గొడవపెట్టుకుని పంపించేస్తుంది" అంటూ మీనా వివరించింది.

"సాయంత్రం మీనా, నేను డాబా మీద కాసేపు కూర్చున్నామమ్మా! అప్పుడు ఆమె రెండో మేనల్లుడు వచ్చాడు. మామూలేగా, ఏదో తగాదా పెట్టుకుని ఉంటుంది. నువ్వేం పట్టించుకోకమ్మా" రవి అంటూనే ఉన్నాడు. గొడవ పెరిగినట్టుంది గొంతులు చాలా పెద్దగా వినిపిస్తున్నాయి.

నేను ఉండబట్టలేక బాల్కనిలోకి వచ్చాను.

"నీ అమ్మా, అబ్బా అడుక్కుతినిపోతారు. నా ఆస్తి అంతా కాజేశారు. నా ఉసురు కొట్టకపోదు. ఇంకా ఏం ఉందని వచ్చావు? మీ అమ్మ పంపిందా? దోచుకు పోవడానికిక్కడ ధనరాశులేం లేవు" చేతులు జోరుగా ఊపుతూ పెద్దగా అరుస్తోంది. సన్నగా పొడుగ్గా ఉన్న తను ఈ గొడవకి బిక్కచచ్చిపోయినట్టున్నాడు. ఆమెకి చిన్నగా నచ్చచెప్పే ప్రయత్నం చేస్తున్నాడు.

"అది కాదత్తయ్యా! రేపు అన్నయ్య కూతురికి అక్షరాభ్యాసం చేద్దామనుకుంటున్నారు. దానికి రమ్మని పిలవడానికే వచ్చాను. ఇక్కడినుంచి నేనేం తీసుకెళ్తాను? "

వరండాలో గ్రిల్స్‌కి ఆనుకుని అతని పోలికల్తోనే ఉన్నాడు మరొకతను. రవి అతన్ని చూపించి అతనే ప్రకాశం అని అన్నాడు.

"ఆమె అంత ఇదిగా గొడవ చేస్తుంటే బుద్ధ విగ్రహంలాగా అసలేం మాట్లాడడేం" అన్నాను. కాస్త చిరాకేసింది అతన్ని చూస్తే.

"వాడొట్టి వాజమ్మ కాబట్టే ఆవిడ అలా రెచ్చిపోతుంటుంది. ఇంట్లో పెళ్ళాన్ని కాల్చుకుతింటున్నా నోరెత్తడు" తిరస్కారంగా అన్నాడు రవి.

"పాపం, ఏం చేస్తాడు, చిన్నప్పట్నించి పెంచిందనే గౌరవం, మమకారం ఉన్నట్లున్నాయి. అటు తోడబుట్టినవాడు, ఇటు పెంచిన మేనత్తా ఎవరికి సర్దిచెప్తాడులే" నేను సానుభూతిగా అన్నాను.

"అంత వెన్నెముక లేని బతుకెందుకూ? చదువుకున్నాడు. ఏదో నేషనలైజ్డు బ్యాంకులో ఉద్యోగం కూడా వెలగబెడుతున్నాడు. మంచిచెడు తెలియక్కర్లా? " కోపంగా అన్నాడు రవి.

ప్రకాశం అన్నయ్య వెళ్ళిపోయాడు. ఇంకా ఆమె పెద్దగొంతుతో అందరినీ కలిపి, విడివిడిగా శాపనార్థాలు పెడుతూనే ఉంది. "అమ్మా! ఆ కచేరి మరో అరగంట సేపయినా సాగుతుందమ్మా! చలిగాలిలో నువ్వు బయటెందుకు. రా! లోపలికి" అంటూ రవి లోపలికి వెళ్ళాడు.

నిట్టూరుస్తూ నేను తలుపు మూశాను.



మాణిక్యమ్మగారితో నా పరిచయం స్నేహంగా మారింది. కొందర్ని కొద్దికాలంగా ఎరిగివున్నా చిరకాల స్నేహం ఉన్నట్టు అనిపిస్తుంది. మరికొందరు చాలా కాలంగా తెలిసినా, ఉత్త పరిచయస్తులుగానే మిగిలిపోతారు. ఆమె పెద్దగా చదువుకోకపోయినా బాగా సంస్కారం ఉంది. మాట మంచితనమూ ఉంది. మా సంభాషణల్లో రకరకాల విషయాలు దొర్లేవి. ఆమెతో కలిసి గుడికి వెళ్ళడం నా దినచర్యగా మారింది. ఆమె చాలాసార్లు వాళ్ళింటికి రమ్మనడం నేను తప్పించుకోవడమూ జరిగింది. ప్రత్యేకించి కారణమేమీ లేకపోయినా ఎందుకో ఎవరింటికీ అంత త్వరగా వెళ్ళాలనిపించదు.

ఆ రోజు ఆదివారం. స్వామీజీ ఉపన్యాసాలకి ఆఖరి రోజు. ఉదయం ప్రత్యేకంగా పూజలు నిర్వహించి తీర్థ, ప్రసాదాలు ఇచ్చారు. ఇంటికి బయల్దేరేసరికి పన్నెండు గంటలయింది. వాళ్ళింటి దగ్గరికి రాగానే ఇంట్లోకి రాకతప్పదని బలవంతపెట్టారు. మరీ మొండికెత్తినట్టుంటుంది, బావుండదని పించింది. "మా మాధవి కూడా మిమ్మల్ని చూడాలనుకుంటోంది. ఇవాళ ఇంట్లోనే ఉంది. మా వారిని కూడా పరిచయం చేస్తాను రండి" అంటూ ఇంట్లోకి దారితీసింది. నేను లోపలికెళ్ళాను. వరండా దాటి లోపలి హాల్లోకి వెళ్ళాం.

"కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అంటూ ఆమె లోపలికి వెళ్ళింది.

వాళ్ళింట్లో చాలా చల్లగా ఉంది. హాలు మధ్యగా చెక్కసోఫాలు ఒక డబుల్ సీటర్ రెండు సింగిల్ సీటర్లు పొందిగ్గా ఉన్నాయి. మధ్యలో ఉన్న బల్లమీద న్యూస్ పేపర్లున్నాయి. తలుపులకి, కిటికీలకీ అందమైన ఎంబ్రాయిడరీ వర్కుతో కర్టెన్లు చూడముచ్చటగా ఉన్నాయి. సోఫాలోని కుషన్లు, కవర్లు ప్రత్యేకంగా అనిపించాయి. అన్నిటికంటే నన్నెక్కువగా ఆకర్షించినవి గోడ మీది ఫొటోలు. ఏదో ఒకటో రెండో లాండ్ స్కేప్ పెయింటింగ్సో, కేలండర్లో, మరేదో డెకరేటివ్ పీస్ మాత్రమే వుంచడం ఫ్యాషన్‌గా మారిన ఈ రోజుల్లో గోడ పొడుగునా చెక్కబద్దలు బిగించి వాటికి వరసగా పటాలు వ్రేలాడదీయటం పాత ఇళ్ళను గుర్తుచేస్తోంది.

రకరకాల ఫొటోలు హాలులో అడుగుపెట్టగానే ఆకర్షిస్తున్నాయి. నేను లేచి వాటి దగ్గరగా వెళ్ళి పరిశీలనగా చూస్తున్నాను. ఎప్పటివో రవివర్మ దమయంతి, చెమ్కీలు కుట్టిన కృష్ణుడు, రాధ ఇలాంటివేకాక మాణిక్యమ్మగారు భర్తతో కలసి ఉన్న ఫొటో, వాళ్ళ పిల్లలేమో ఒక అబ్బాయి అమ్మాయి ఒకరి భుజాల మీద మరొకరు చేతులు వేసుకుని ఉన్న చిన్న ఫొటో. ఇవికాక దాదాపు అందరి దేవుళ్ళ కాలెండర్లు ఫ్రేమ్ చేసి ఉన్నాయి.

"ఏమిటి! మా ఫొటోలు చూస్తున్నారా? ఏమిటో, ఏ ఫొటో అయినా కాలండరయినా మా గోడ మీదకెక్కాల్సిందే. ఆయనకీ, నాకూ కూడా బాగా ఇష్టం. మా మాధవే

విసుక్కుంటుంటుంది. ఇల్లంతా ఫొటో స్టూడియోలాగా ఉందని"

చీర మార్చుకుని వచ్చినట్టుంది, వెనకే నిలబడి నవ్వుతూ అంది మాణిక్యమ్మగారు.

ఇద్దరం కూర్చున్నాం.

మరో రెండు నిమిషాలకి లోప ల్నించి కర్టెన్ తొలగించుకుంటూ ఒక అమ్మాయి వచ్చింది- ట్రే పట్టుకుని.

"రామ్మా! మధూ! మా అమ్మాయి మాధవి. లలితమ్మగారని చెప్పుంటాను కదా! ఇవాళ పట్టుబట్టి మనింటికి తీసుకొచ్చాను" కూతురికి పరిచయంచేస్తూ అందావిడ.

"నమస్తే. ఆంటీ!" ట్రేలోంచి కప్పు నాకందిస్తూ తల కొద్దిగా వంచి అంది ఆ అమ్మాయి పెదాల మీద చిన్న చిరునవ్వు.



"ఇప్పుడెందుకమ్మా! ఇంటికెళ్ళి భోజనం చేయాలి కదా!" అన్నాను.

"ఇది కాఫీ కాదు ఆంటీ నిమ్మరసమే. ఆకలి చంపేయదు తీసుకోండి ఫర్వాలేదు. అయినా ఫస్ట్‌టైం మా ఇంటికి వచ్చారు కదా! ఒక పని చేయండి. ఇవాళ మా ఇంట్లో భోజనం చేయండి" అంది ఆ అమ్మాయి కలుపుగోలుగా.

నాకు ఆ అమ్మాయిని చూస్తే ముచ్చటేసింది. లేతాకుపచ్చ రంగు మీద లతల్లాగా విస్తరించిన గులాబీ పూల డిజైన్ చీరలో ఆమె విరబూసిన పూల తీగెలాగా ఉంది. ముఖం మీద కనిపించీ కనిపించనట్టు చిన్న బొట్టు. నవ్వినప్పుడు బుగ్గమీద చిన్న నొక్కు పడి, మొహమంతా వెలుగుపరచినట్టుంది. ఆ కళ్ళు చిన్నవైనా చురుగ్గా ఉన్నాయి. మొత్తం మీద, ఆమెని చూస్తే అందానికి ఒంటి రంగుకి పసిమి ఛాయ అక్కర్లేదనిపిస్తుంది. ప్రత్యేకమైన ఆకర్షణ ఏదో ఉందామెలో.

"ఏమిటాంటీ! ఏం మాట్లాడకుండా అలా చూస్తున్నారు? " ఆ అమ్మాయి పలకరింపుతో.

"ఆఁ! ఏమన్నావమ్మా, భోజనం చేయమన్నావు కదూ! నీ మాటలకే నా కడుపు నిండిపోయిందమ్మా! మరి నువ్వు మా ఇంటికెప్పుడు వస్తావు? " నేను చనువుగా అన్నాను.

"మీరిప్పుడే పరిచయమయ్యారుగా! ఇంక తరుచూ నా విజిట్స్ ఉంటాయి. మీరే బోరు కొడుతోంది పో అంటారేమో!" అంది నవ్వుతూ.

"మధూ! మరీ చిన్న పిల్లలాగా ఏమిటి? ఆంటీతో అలాగేనా మాట్లాడడం? " మాణిక్యమ్మగారు మాధవిని కసరడం విని నేను "అరే! ఇప్పుడు తనేం తప్పు మాట్లాడిందని, చక్కగా, కలుపుగోలుగా ఉంది" అన్నాను మాధవిని వెనకేసుకొస్తూ.

"దీనికి పుస్తకాలుంటే ప్రపంచంతో పని లేదు. మీకూ పుస్తకాలంటే ఇష్టం కదా! ఇంక మా మధు మిమ్మల్ని వదలదు" అందావిడ నవ్వుతూ.

"అవును! పుస్తకం పెద్ద పెన్నిధి కదా! మంచి అలవాటే" అన్నాను నేను.

"అలా చెప్పండి. ఆంటీ! అమ్మ ఎప్పుడూ నీకు చేతిలో పుస్తకం ఉంటే పక్కన పిడుగు పడ్డా తెలీదు అంటుంది. అఫ్‌కోర్స్! నిజంగానే నా ఆధ్వర్యంలో పాలు చాలాసార్లు విరిగిపోవడం, కూర మాడి బొగ్గులుగా మారిపోవడం జరిగిందనుకోండి!" అంది సరదాగా నవ్వుతూ.

గుమ్మం దగ్గర అలికిడి వినిపించింది. నేను అటువేపు చూశాను.

"అబ్బ! రాత్రి అంత చలేమిటో. పగలు ఈ ఎండలేమిటో! అమ్మా! మధూ కొంచెం చల్లటి మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా" అంటూ లోపలికొచ్చిన వ్యక్తిని, ఫొటోలో మాణిక్యమ్మగారి పక్కన చూసివుండడం వల్ల వెంటనే పోల్చుకున్నాను.

నన్ను చూసి కాబోలు ఆయన కాస్త తటపటాయిస్తూ గుమ్మంలో నిలుచుండిపోయాడు.

"ఏమండీ! ఈమె లలితమ్మగారని మన సుందరం వాళ్ళింటి పక్కనే ఉంటారు. ఈయన మాధవీ వాళ్ళ నాన్నగారు" అంటూ మాణిక్యంగారు పరిచయం చేశారు.

మాధవి అంతా వాళ్ళ నాన్నగారి పోలికే! నేను లేచి నమస్కరించాను. ఆయన ప్రతి నమస్కారం చేస్తూ, "కూర్చోండమ్మా! ఫరవాలేదు. మా మాణిక్యం రోజూ మీ గురించి చెప్తూనే ఉంటుంది. ఇవాళ్టితో గీతా ప్రవచనాలు ఆఖరనుకుంటాను" అంటూ నాతో మాట్లాడుతూనే మాధవి అందించిన మంచి నీళ్ళు తాగారు. మర్యాదకు మరో రెండు నిమిషాలు కూర్చొని ఆయన లోపలికి వెళ్ళిపోయారు.

నేను కూడా లేచి, "మరి నేను వెళ్ళొస్తానండీ!" అన్నాను. మాధవి, మాణిక్యమ్మ

గారు గేటువరకూ వచ్చారు. నేను మాణిక్య మ్మగారిని చూస్తూ.

"మీరు కూడా మా ఇంటికి రండి ఒకసారి మధూ! నేను కూడా నిన్ను 'మధూ' అనే పిలుస్తాను, నీకేం అభ్యంతరం లేదుగా!" అన్నాను, ఆప్యాయంగా ఆమె చేతిని నా చేతిలోకి తీసుకుంటూ. ఎందుకో ఆ అమ్మా యిని చూస్తుంటే నాకే కూతురు లేని లోటు కనిపించింది.

"అలాగే పిలవండి" అంది స్నేహ పూర్వ కంగా నవ్వుతూ. ఇంటికి వచ్చేసరికి రవి, మీనా ఇంకా భోజనం చేయకుండా నా కోసమే ఎదురుచూస్తున్నారు.

* * *

భోగిరోజు సాయంత్రం ఎవరో భోగిపళ్ళ పేరంటానికి పిలిస్తే వెళ్ళింది మీనా. రవి ఇంకా ఆఫీసు నుంచి రాలేదు.

ఉన్నట్టుండి ఆకాశంలో మబ్బులు కమ్ము కున్నాయి. వర్షం వచ్చేలా ఉంది. వెనకవేపు బాల్కనీలో ఆరేసిన బట్టలు తీద్దామని వెళ్ళాను. అక్కడి నుంచి పక్కింటి వాళ్ళ ఇంటి వెనక భాగం బాగా కనిపిస్తుంది.

ఆ ఇంట్లోనించి సుందరమ్మగారి గొంతు ఖంగుమంటోంది. "ఆ వెనకింటి దానితో నీకేమిటే మాటలు? నాకు తెలియకుండా ఏమి గుసగుసలాడావు దానితో? " అను మానం లేదు, వనజని గద్దిస్తోంది. ఆ అమ్మాయి ఏం చెప్పిందో నాకు వినిపించ లేదు.

మళ్ళీ సుందరమ్మ గొంతు తారస్థాయిలో వినిపించింది. "కరేపాకా, దాని బొందా! అంతా నాటకం. సిగ్గు, శరమూ లేని మను షులు. అవతలి వాళ్ళ ఇళ్ళలో అడుక్కున్న వస్తువులతో ఏం పిడక వంటలు మండబె డ్తారూ? అంత కావాలనుకుంటే వాళ్ళ కొంపల్లోనే ఒక మొక్క పెంచుకోవచ్చుగా! రింగు రంగా అంటూ ఇరవై నాలుగు గంటలు బజార్లమీద భోగం ముండలా తిరగటం తెలుసుగానీ మొక్కల పెంపకానికి ఒళ్ళు ఎక్కడ వంగి చస్తుందీ? ఉత్త సంకర జాతి. నా ఇంట్లో వాళ్ళతో దానికి పనే మిటి? ఒక అమ్మకి అబ్బకీ పుడితేగా నీతీ నియమం ఉండడానికి" మధ్య మధ్యలో బూతులు కలుపుతూ అల్లుకుపోతోంది. దండకం నేను వినలేక లోపలికి వచ్చేశాను. ఆ వెనక వాళ్ళని ఆమెకి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుందట. అసలు వనజ ఎప్పుడూ తల దించుకుని తన పని చూసు కుని లోపలికి వెళ్ళిపోతుంది. ఇంటి ముందుకాని వెనకగాని ఎప్పుడేనా కనిపిస్తే చిన్న పలకరింపు చిరునవ్వు తప్పించి ఆమె నాతోకాని, మీనాతో కాని మాట్లాడకపోవడం నాకు పెద్ద ఆశ్చర్యం కలిగించలేదు.

* * *

గుడిలో ఉపన్యాసాలు అయిపోయినా మాణిక్యమ్మగారు, నేను కలిసి రోజూ సాయంత్రాలు గుడికి వెళ్ళడం అలవాటుగా మారింది. అప్పుడప్పుడూ మాధవితో కలిసి ఆమె మా ఇంటికి వచ్చేది.

నాకు సెలవులు అయిపోయాయి. నేను గుంటూరు వెళ్తున్నానని మాణిక్యమ్మగారి ద్వారా తెలుసుకున్న మాధవి, ఆ సాయం త్రం ఆఫీసు నుండి సరాసరి మా ఇంటికి వచ్చింది. రవి, కొలిగ్ కొడుకు పుట్టిన రోజని మీనాతో కలిసి వెళ్ళాడు.

మాధవి వస్తూనే

"ఆంటీ! మీరు రేపు ఊరు వెళ్ళిపోతున్నా రట కదా! నేను మిమ్మల్ని చాలా మిస్ అవు తాను" అంది.

"అవునమ్మా! రేపటి నుంచి క్లాసులు మొదలవుతాయి. నువ్వు మంచిపని చేశావు. వెళ్ళే ముందు నిన్ను కలవడం వీలవదేమో ననుకున్నాను. నేనే వద్దామంటే మా అబ్బాయి వాళ్ళు ఇంట్లో లేరు" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని నా పక్కనే కూర్చో పెట్టుకున్నాను.

"మళ్ళీ ఎప్పుడు వస్తారు? సమ్మర్ హాలీ డేస్‌కి వస్తారా? " అడిగింది.

"ఏమో! అప్పటి సంగతి అప్పుడే!" అన్నాను నవ్వుతూ.

"అదేం కుదరదు. మా అందర్నీ తప్పించుకుని అక్కడే ఉండాలనుకుంటున్నారా? చూస్తుండండి మీరు ఎండాకాలపు సెలవులకి ముందే ఇక్కడికి వస్తారు. నేను చెప్తున్నాను కదా" అంది ఛాలెంజి చేస్తున్నట్టు.

"ఏమిటి మరీ అంత నమ్మకంగా చెప్తున్నావు? జ్యోతిష్యం తెలుసా ఏమిటి నీకు? " అన్నాను నవ్వుతూ. "అదేం లేదు. ఇచ్ఛాబలం అంటారే అదన్నమాట. అంటే కోరిక ఎంత బలమైనదైతే అంత త్వరగా తీరుతుందన్నమాట. నేను చెప్పింది నిజమై తీరుతుంది చూడండి" అంది ధీమాగా నవ్వుతూ.

"చూద్దాం!" అన్నాను నేను కూడా నవ్వుతూ.

కాసేపు కూర్చుని, కాఫీ తాగి వెళ్ళడానికి లేచింది.

నేను కూడా ఆమెతోపాటే కిందికి దిగి గేటువరకు వచ్చాను. సుందరమ్మ వాళ్ళింటి గేటు దగ్గర మెట్లమీద కూర్చుని ఉంది. మాధవిని చూస్తూనే,

"ఏం మాధవీ! మా ఇంటికి రాకుండానే వెళ్తున్నావు కదూ!" అంది నిష్ఠూరంగా.

"మళ్ళీ వస్తాలే పిన్నీ! ఇప్పుడే ఆఫీసు నించి వస్తున్నాను. ఇంకా ఇంటికి వెళ్ళలేదు" అంటూనే వెళ్ళిపోయింది.

నేను సుందరమ్మగారిని చూసి పలకరింపు నవ్వొకటి నవ్వేసి లోపలికి రాబోయాను.

ఆమె లేచి మా ఇంటికేసి నడుస్తూ "ఇదుగో! ఒక్క నిముషం ఆగండి" అంది.

నేను నిలబడిపోయాను. దగ్గరగా వచ్చి గొంతు తగ్గించి, "ఈ చిత్రాంగి మీ ఇంటికొచ్చిందేమిటి? కాస్త జాగ్రత్తగా ఉండండి" అంటూ గొంతు ఇంకా తగ్గించి గుసగుసగా "ఈ పిల్లతో మీ మీనాని చేరనివ్వకండి. తల్లీ కూతుళ్ళు మహా కాని మనుషులు. ఎక్కువగా మీ ఇంటికి రానివ్వకండి. చూశారా! పక్కనే ఉన్న నన్ను చూసి కూడా చూడనట్టే వెళ్ళబోయింది. నిన్న మొన్న పరిచయం అయిన మీరు దగ్గరయ్యారు. దాని ఆటలు నా దగ్గర సాగవని దానికి తెలుసు. ఇంటికి రమ్మన్నా అందుకే రాకుండా పోయింది. అయినా అది రాకపోతే మాత్రం నాకేం తరుగు! ఇలాంటి మనుషులు మా ఇంటికి రావడం నాకసలు ఇష్టమే ఉండదు. చెప్పొద్దూ! ఏదో ఇరుగు పొరుగు కదా! ముందుగా చెప్పలేదంటారని చెప్తున్నా కాని అసలు ఒకరి విషయాల్లో జోక్యం చేసుకోవడం నాకస్సలు ఇష్టముండదు" అంది కళ్ళు చేతులు తిప్పుకుంటూ. నేను నవ్వేసి ఊరుకున్నాను.

"మీ అబ్బాయి, కోడలు లేనట్టున్నారే? " అంది తనే.

దాని ఆటలు
నా దగ్గర సాగవని
దానికి తెలుసు.
ఇంటికి రమ్మన్నా
అందుకే రాకుండా
పోయింది.
అయినా అది రాక
పోతే మాత్రం
నాకేం తరుగు!
ఇలాంటి
మనుషులు
మా ఇంటికి
రావడం నాకసలు
ఇష్టమే ఉండదు



"లేరు రండి లోపలికి" అన్నాను మర్యాదకి.

"అబ్బే! ఎందుకిప్పుడు? నేను ఇంట్లో లేకపోతే క్షణం కుదరదు. దొంగ వెధవలు పూలు కోసుకుపోతారు. వీలుంటే ఇంట్లోకి జొరబడి చేతికందింది కాజేస్తారు ఎవర్నీ నమ్మేటట్టు లేదు ఈ రోజుల్లో" అంటూ వాళ్ళింటివైపు వెళ్ళింది.

ఆమె మాటల ధోరణికి ఈ పదిరోజులుగా అలవాటు పడడం వలన ఆవిడ మాటలు నాకు వింతగా అనిపించలేదు.

6



నేను గుంటూరు వచ్చేశాను. వచ్చినప్పటి నుంచి, కాలేజి యానివర్సరీ దగ్గర పడటంతో కొంచెం తీరిక లేకుండానే ఉండిపోయాను. రవికి అప్పుడప్పుడు ఫోన్ చేసినా క్షేమసమాచారాలు తప్ప ఎక్కువ మాట్లాడడం కుదిరేది కాదు. మరో వైపు మా 'చైతన్య స్రవంతి' సాహితీ సంస్థ యానివర్సరీ కూడా దగ్గర పడడంతో దానికి కాస్త పేరున్న రచయితలను పిలిచి సాహిత్య సమావేశాలు ఏర్పాటు చెయ్యాలని నిర్ణయించాం. దాంతో రోజులెలా గడిచిపోతున్నాయో నాకు తెలీలేదు. కొన్నిసార్లు రాత్రిళ్ళు ఇంటికి చేరేసరికి బాగా పొద్దుపోయేది. అప్పుడు వంట చేసుకునే ఓపిక లేక ఫ్రిజ్‌లో ఉన్నవే తినేసి పడుకునేదాన్ని. రెండిటి వార్షికోత్సవాలు బాగా జరిగాయి. నాకు కాస్త ఊపిరి పీల్చుకునేందుకు సమయం దొరికిందనుకుంటున్నాను.

ఆ రోజు సెకండియర్ వాళ్లకి క్లాసు తీసుకుని స్టాఫ్‌రూంకి అప్పుడే వచ్చాను. మా అటెండర్ శంకరం ప్రిన్సిపాలుగారి నుంచి పిలుపు తెచ్చాడు. నేను వెళ్ళగానే "కూర్చోండి, లలితగారూ!" అని నవ్వుతూ, నిన్నటివరకు మన కాలేజి ఫంక్షన్‌తో బిజీగా ఉన్నారు. మళ్ళీ మీకిప్పుడు చేతినిండా పని" అన్నారు.

"ఏమిటి విషయం? " కూర్చుంటూ అడిగాను.

"హైదరాబాద్‌లో ఇంటర్ కాలేజి కల్చరల్ మీట్ ఉంది. చాలా కాంపిటీషన్స్ కూడా ఉన్నాయి. ఫిబ్రవరి చివరి వారంలోగా మరి మన స్టూడెంట్స్‌ని ఎలా తయారుచేస్తారో మీ చేతుల్లో ఉంది. పోటీల వివరాలన్ని ఈ బ్రోచర్‌లో ఉన్నాయి, చూడండి" అంటూ ఒక కవర్‌ని నా వైపు జరిపారు.

మా కాలేజి కల్చరల్ అసోసియేషన్‌కి ఇన్‌ఛార్జిని కాబట్టి ఇలాంటివి నాకు మామూలైపోయాయి. వెంటనే స్టూడెంట్ యూనియన్ ప్రెసిడెంట్, సెక్రటరీలతో మాట్లాడి అసోసియేషన్ మీటింగు ఏర్పాటు చేసి ప్రోగాం, పాల్గొనే వారి ఎంపిక అన్ని త్వరగా పూర్తి చేయాలనుకుంటూ లేచాను.

"వాళ్ళతో మీరెలాగా వెళ్తారు కదా! మొత్తం ప్రోగ్రాం పది రోజులు పడుతుంది. కావాలంటే మీతోపాటు ఎవర్నైనా ఇద్దరు లెక్చరర్స్‌ని మీకు సహాయంగా తీసుకెళ్ళండి" అన్నారు ప్రిన్సిపాల్. నేను తలూపి బయటికొచ్చేశాను.

నాకు వెంటనే మాధవి మాటలు గుర్తుకొచ్చాయి. ఆమె చెప్పిన ప్రొఫెసీ తలచుకుని నవ్వుకున్నాను.

ఆ రాత్రే రవికి ఫోన్‌చేసి త్వరలో అక్కడికి రాబోతున్నానని చెప్పాను. మీనా కూడా మాట్లాడింది.

మర్నాటి నుంచే మళ్ళీ నేను కల్చరల్ మీట్‌కి వెళ్ళే ప్రయత్నాలు మొదలుపెట్టాను. సెలెక్షన్స్, రిహార్సల్స్... ఊపిరి సలపని పనులు. అంతా మామూలే! రోజులు త్వరగా గడిచిపోయినట్టు అనిపించింది.

# చతుర భాషితాలు

▶ తల రాతను కూడా తారు మారు చేయ గలిగేది సాహసం.

-లియో టాల్‌స్టాయ్

▶ ఎప్పటి పని అప్పుడు పూర్తి చేస్తే మనసు ఉత్తేజ పడుతుంది. మరో పనికి కార్యోన్ముఖుణ్ణి చేస్తుంది.

-ఆర్నాల్డ్ హెచ్.గ్లాస్గో

▶ పుస్తకాలు అలంకరణ కోసం రాయరు. కానీ పుస్తకాలంత అందంగా ఇంటిని అలంకరించే సామాగ్రి మరొకటి లేదు.

-హెన్రీ బీచర్

▶ ఆశావాది విమానం కనిపెడితే నిరాశావాది ప్యారాచూట్ రూపొందించి ఉంటాడు.

-బెర్నార్డ్ షా

▶ ఆకలి మనిషిని శాసించినట్లుగా మరే శక్తీ శాసించలేదు

-రిచర్డ్ దీన

▶ ఆదర్శం నిన్ను శాసిస్తుంది. ధర్మం నిన్ను నిర్దేశిస్తుంది.

-తిరుక్కురళ్

▶ ఆగ్రహమంత త్వరగా మనిషిని మరేదీ నాశనం చేయలేదు.

- థియోడార్ రూస్వెల్ట్

▶ కవి, చిత్రకారుడు కూడా వ్యాపారులే. అయితే వారు మానవ హృదయ వ్యాపారులు.

- డబ్ల్యు.ఎస్. మాపరిక్

▶ ఒక అవివేకి జీవిత కాలం ఒక వివేకవంతుడి రోజుతో సమానం.

-పంచతంత్రం

▶ అదను తెలిసి వ్యవహరించడమంటే ఎంతో శ్రమను, సమయాన్ని ఆదా చేయడమే.

- లాంగ్‌ఫెలో

▶ అడుగు ముందుకు వేయని మనిషిని ఏ దేవుడూ ఆదుకోలేడు.

-స్వామీ వివేకానంద

▶ వాస్తవాలు తమకు అనుకూలించని వారే కుయుక్తి వాదనలకు దిగుతారు.

-ఎమర్సన్

▶ తేనెటీగ మాదిరిగా మన కృషినే మనం వినోదంగా భావించుకోవాలి.

- గోల్డ్‌స్మిత్

ఇలాంటప్పుడు భారం మీద వేసుకుని, బాధ్యత తీసుకుని వ్యవహరించడం ఒక ఎత్తైతే, దీనిలో భాగం పంచుకోకుండా ప్రేక్షక పాత్రల్లో ఉన్న మిగిలిన లెక్చరర్ల విసుర్లని ఎదుర్కోవడం మరో ఎత్తు.

"లలితగారి పనే సుఖం. మనలాగా ఇల్లు, కాలేజి అంటూ ఆసులో గొట్టంలాగా తిరగడం కాదు. చక్కగా అప్పుడప్పుడు బయటి ఊళ్ళకి కూడా వెళ్తుంటారు. కాలక్షేపానికి కాలక్షేపం, పేరుకి పేరు"

వ్యంగ్యమో కాంప్లిమెంటో తెలీని విసురు మరోవైపు నుంచి వస్తుంది.

"ఆc! అందరికీ రమ్మంటే వస్తాయా ఆ అవకాశాలు! ఆమె రచయిత్రి కాబట్టి రకరకాల మనుషులను కలవడం, రకరకాల విషయాలు తెలుసుకోవడం సాధ్యపడుతుంది"

"అవకాశాలు వచ్చినా అందిపుచ్చుకునే అదృష్టం అందరికీ ఉంటుందా! ఇంటికి వెళ్తే కుడితిలో పడ్డ ఎలుకలాగా సంసార జంఝాటంతోనే సరిపోతుంది గదా! ఆవిడకేం అదృష్టవంతురాలు. ఇలాంటి బాదరబందీలేం లేని స్వేచ్ఛా జీవితం. ఉన్న ఒక్క కొడుకూ చేతికంది వచ్చాడు. మరి ఆవిడకి ఇలాంటి కాలక్షేపాలకు కావలసినంత తీరిక"

ఎన్నో ఏళ్ళుగా ఇలాంటి మాటలు వినడానికి అలవాటు పడిపోయాను. ఇలాంటి మాటలకి నా మౌనమే సమాధానంగా ఉంటుంది. చిరునవ్వుతో వింటూ ఉండడం నేర్చుకున్నాను. దానికీ విసుర్లు తప్పవు. "మీరు ఎన్ని మాట్లాడినా లలితగారు లలితంగా నవ్వుతూ ఉంటారు. ఎక్కడ నేర్చుకున్నారండీ ఇంత ఓర్పుగా ఉండడం? మీకసలు కోపం రాదా? " అది కవ్వింపో, కాంప్లిమెంటో అర్థం కాదు.

మనిషి సంఘాన్ని వదిలేసి వెళ్లలేడు. ఆ సంఘంలోనే ఉండేటప్పుడు ఇలాంటి విమర్శలు, విసుర్లు, అసూయ ఎదుర్కోక తప్పదు. వీటన్నిటిని నేను కాంప్లిమెంట్లలాగే తీసుకుంటాను. అప్పుడే మనసుకి ప్రశాంతత లోపించదు. ఇలాంటి వడగాడ్పుల మధ్య చల్లని స్నేహ స్పర్శలూ ఉన్నాయి. అందరితో నేను కలివిడిగానే ఉంటాను. అయినా మనసు విప్పి పరిచే పరిచయం నాకు ఎందుకో ఎవరితోనూ ఏర్పడలేదు. అందుకే ఎంత మందిలో ఉన్నా నేను ఒంటరినే!

* * *

హైదరాబాద్‌కి నేను మరో ఇద్దరు కొలీగ్స్‌తో, మా స్టూడెంట్స్‌తోనూ వస్తున్నట్టు రవికి ముందే చెప్పాను. మీనాతో కలిసి వాడు స్టేషన్‌కి వచ్చాడు. వాళ్లతో మాట్లాడి, మా కందరికీ యూనివర్సిటీ లోనే బస ఏర్పాటు చెయ్యడంతో మా వాళ్లతో కలిసి అక్కడికే వెళ్లిపోయాను.

రెండు రోజులు గడిచాయి. మా స్టూడెంట్స్ బాగానే చేస్తున్నారు. ప్రేక్షకుల స్పందన కూడా ఆశాజనకంగా ఉంది. మూడో రోజు పొద్దుటే ఒళ్ళంతా సలపరంగా అనిపించింది. పట్టించుకోకుండా తిరిగాను. మధ్యాహ్నానికి జ్వరం వచ్చేసింది. టెంపరేచర్ కూడా ఎక్కువగా ఉండడంతో లేవలేకపోయాను. సాయంత్రానికి నాకు మగతగా అనిపించింది. అంతే నాకు తెలుసు.

నేను కళ్ళు విప్పి చూస్తే మంచం పక్కనే దిగులుగా కూర్చొని ఉన్నారు రవి, మీనా. నాకు జ్వరం ఎక్కువ కావడం, పరాకు మాటలు మాట్లాడడం విన్న మా వాళ్లు రవికి ఫోను చేశారట. రవి వచ్చి రాత్రికి రాత్రే నన్ను ఇంటికి తీసుకువచ్చాడట. అలా మూసిన కన్ను తెరవకుండా మూడు రోజులు పడి ఉన్నానట. నేను కళ్లు తెరవడం చూసి మీనా,

"అమ్మయ్యా! లేచారా అత్తయ్యగారూ! ఉండండి కాస్త వేడిగా కాఫీ తాగితే నీరసం తగ్గుతుంది!" అంటూ లేచి వెళ్ళింది.

"ఎంత భయపెట్టేశావమ్మా! నువ్వెందు

కింత స్ట్రెయిన్ అవుతావు? విశ్రాంతిగా ఉండాల్సిన ఈ వయసులో అంత శ్రమ పడుతుంటే నీ బాడీ తట్టుకోగలదా! చెప్తే వినవు" డగ్గుత్తికతో అంటున్నాడు రవి. వాడిలో చిన్నప్పటి రవి మళ్ళీ కనిపించాడు. నాకు కొంచెం నలతగా ఉండి మంచమెక్కితే కాలు కాలిన పిల్లిలా బిక్క మొహంతో నా మంచం దగ్గరే తచ్చాడేవాడు. పిల్లలెవరైనా అంతేగా! తల్లులు మంచం పడితే ప్రపంచ గమనమే ఆగిపోతుంది వాళ్ళకి.

"బాగా కంగారు పెట్టేశానేమిట్రా!" అన్నాను లేవడానికి ప్రయత్నిస్తూ.

"ఉండు! లేవకు. డాక్టరుగారు నీకు బాగా రెస్ట్ కావాలన్నారు. ముందు ఈ టాబ్లెట్ వేసుకో" అంటూ చేతికి టాబ్లెట్ ఇచ్చి మంచి నీళ్ళు తాగించాడు.

తల పక్కకి తిప్పి చూస్తే మంచం పక్క టేబుల్ ఒక మినీ డిస్పెన్సరీ లాగా ఉంది.

"ఈ హడావుడి అంతా ఏమిట్రా? అన్నట్టు మా వాళ్ళకి కొంచెం ఫోను చెయ్యి. ఏం చేస్తున్నారో ఏమిటో" అన్నాను. అలా వాళ్ళందరిని మధ్యలో వదిలేసి, నేను ఇక్కడికి రావడం నాకు చాలా గిల్టీగా అనిపించింది.

"నువ్వు కంగారు పడకు. మీ వాళ్ళే నువ్వెలా ఉన్నావోనని ఫోన్ చేశారు. మీ అయిటమ్స్ అన్నిటికీ మంచి రెస్పాన్స్ వస్తోందిట. మీ నాటికకు, గ్రూప్ సాంగ్‌కి ఫస్టు ప్రైజులు వచ్చినట్టు అనధికారికంగా వాళ్ళకి తెలిసిందట. నువ్వు ఇంకా ఆ విషయంలో వర్రీ అవకు" అన్నాడు రవి.

మీనా నా పక్కనే కూర్చుని, నా చెయ్యి పట్టుకుంటూ, "మూడు రోజులుగా మీరు మూసిన కన్ను తెరవకుండా ఉంటే మాకు కాలు చెయ్యి ఆడలేదు" అంది. ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

వాడిలో చిన్నప్పటి రవి మళ్ళీ కనిపించాడు. నాకు కొంచెం నలతగా ఉండి మంచమెక్కితే కాలు కాలిన పిల్లిలా బిక్క మొహంతో నా మంచం దగ్గరే తచ్చాడేవాడు

"పిచ్చి పిల్లల్లాగా ఉన్నారు ఎక్కడో! అంత దిగులు పడడానికిప్పుడేమయింది? వరసగా కాలేజి యానివర్సరీ, ఈ కల్చరల్ మీట్ రావడం వల్ల కొంచెం బడలికతో జ్వరం వచ్చింది. ఇంత మాత్రానికి అంత గాభరా ఎందుకు? ధైర్యంగా ఉండాలి" అన్నాను.

వాళ్ళు నా కోసం పడే ఆరాటంతో నా మనసు అంతరాంతరాళాల్లో సంతోషంగా అనిపించింది. అభిమానం, ప్రేమలను మించి మనిషికి కావల్సినదేమిటి?

ఫోన్ మోగింది. రవి మాట్లాడుతున్నాడు. మీనా కూడా వెళ్ళి వెంటనే నా దగ్గరికి వచ్చింది.

"అత్తయ్యగారూ! మీ వాళ్ళు ఫోన్ చేశారు. నిన్న సాయంత్రం జడ్జిమెంట్. ప్రైజ్‌లు ఇచ్చారుట. మీ వాళ్ళకి నాలుగు వచ్చాయట. ఈ రోజు డిన్నరుందిట. తర్వాత గుంటూరు వెళ్తామన్నారు" అంది.

"మరి నేను కూడా హాస్టల్‌కి వెళ్ళి, వాళ్ళతో కలిసి గుంటూరు వెళ్తానురా! మీనా! కాస్త నా సూట్కేసు సర్ది పెట్టమ్మా" అన్నాను.

"భలేదానివే! నువ్వెక్కడికీ వెళ్ళడం లేదు. డాక్టరు నీకు ఎంత లేదన్నా పదిహేను రోజులు విశ్రాంతి కావాలని చెప్పారు. మీ విమలగారు, వైదేహిగారు మీ ప్రిన్సిపాల్ గార్కి నీ విషయం చెప్తామన్నారు. వాళ్ళే నీకు మెడికల్ లీవ్ సాంక్షన్ అయ్యేలా చూస్తామన్నారు. నువ్వింక ఆ విషయం ఆలోచించకు" అన్నాడు రవి.

"అయ్యో! అదేమిటిరా. ఇయర్ ఎండింగ్. పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. ఇప్పుడు నేనిక్కడ ఉంటే ఎలా? " అన్నాను ఆందోళనగా.

"అమ్మా! నువ్వు ఇప్పుడు వెళ్ళకపోతే ఆ

కాలేజి రష్ అవడం ఆగిపోదు. అవన్నీ నీ ఆరోగ్యం కంటే ఎక్కువ కాదు. నువ్వు ఇక్కడే ఉంటున్నావు. కావాలంటే మీ వాళ్లతో ఫోన్‌లో మాట్లాడు. అంతే!" అంటూ జడ్జిమెంటు చెప్పేసిన జడ్జిలాగా లేచి వెళ్లిపోయాడు. కొద్దిసేపటి క్రితం ఉన్న బిక్క మొహం ఏమైందో! నవ్వుకున్నాను. వీడెప్పుడూ ఇంతే! మొండి పట్టుపడితే వద లడు. నేను ఇక్కడ ఉండక తప్పదని తేలి పోయింది. నాక్కూడా అక్కడికి వెళ్ళి ఈ పరిస్థితిలో ఒంటరిగా ఉండగలననే నమ్మకం కలుగలేదు.

నా చేత మా కొలీగ్స్‌కు ఫోన్ చేయించి మెడికల్ లీవ్ పదిహేను రోజులపాటు పెడ్తానని చెప్పించి తర్వాత నాచేత లీవ్‌కి అప్లై చేయించిన తర్వాత గాని మా రవి, మీనా స్థిమిత పడలేదు.

"అమ్మయ్య! ఇప్పుడు మాకు నిశ్చింతగా ఉంది అత్తయ్యగారూ! మీరక్కడికి వెళ్ళినా ఎలా ఉన్నారో అని మాకిక్కడ బెంగగానే ఉంటుంది" అంది మీనా.

7



మర్నాడు మధ్యాహ్నం నేను పథ్యం తిన్నాను. ఆదివారం కావడం వల్ల రవి ఇంట్లోనే ఉన్నాడు. నేను నిద్ర పోకుండా నా దగ్గర కూర్చున్నాడు.

"అమ్మా! ఈ మూడు రోజుల్లో నీకు విజి టర్స్ కూడా వచ్చారు" అన్నాడు.

"ఎవర్రా? "

"అదే అత్తయ్యగారూ! మాణిక్యమ్మగారు, మాధవి వచ్చారు. మాధవి ఆఫీసు నుంచి ఇంటికి వెళ్తూ రోజూ మిమ్మల్ని చూసి ఇంటికి వెళ్లేది" అంది మీనా బత్తాయిపండు ఒలుస్తూ. "ప్రపంచ వింతల్లో ఒకటి కాదగిన వింత కూడా జరిగిందమ్మా!" అన్నాడు రవి.

మీనా నవ్వుతూండిపోయింది.

"ఏమిట్రా అంత వింత విషయం? " కుతూహలంగా అడిగాను.

"కనుక్కో చూద్దాం!" అన్నాడు క్విజ్ మాస్టర్‌లాగా.

"ఏమిటది మీనా, నువ్వైనా చెప్పు" అన్నాను.

మీనా రవికేసి చూసింది చెప్పనా అన్నట్టు.

"అయితే కనుక్కోలేవన్నమాట. అదే మీ స్పెషల్ ఫ్రెండ్ కూడా నిన్ను చూడ్డానికి వచ్చింది"

వాడు చెప్పేది సుందరమ్మ గురించేనని నాకు అర్థమైంది. ఆమె అంటే వీడికి మరీ లోకువైపోయింది. అయినా తెలీనట్టు "ఎవర్రా? " అన్నాను. "మీ సుందరమ్మా ది గ్రేట్' నీ కోసం వచ్చి కూర్చుని కాసేపు మాట్లాడి వెళ్ళింది" అన్నాడు వాడు ఎగతా ళిగా. 'కూర్చొని' అనే పదం నొక్కి పలు కుతూ ఆమె ఎప్పుడన్నా లోపల కాలు పెట్టినా కిటికీ, వాకిళ్ళ కర్టెన్లు తగలకుండా, నేల కూడా తన చీరకి తగలకుండా, చీర ఎత్తి పట్టుకుని నిలబడే మాట్లాడివెళ్తుంది. నాకు నవ్వు వచ్చింది.

"అత్తయ్యగారూ! మీరు ఉద్యోగం మానేసి ఇక్కడికి వచ్చేయాలని కూడా సలహా ఇచ్చింది" అందుకుంది మీనా.

ఆరోజు సాయంత్రం మాణిక్యమ్మగారు, మాధవి వచ్చారు. "అబ్బ! లేచారా? అందర్నీ ఎంత గాభరా పెట్టేశారండి" అంది మాధవి వస్తూనే.

"బాగా నీరసపడిపోయారు. ఇప్పుడెలా వుంది? " మాణిక్యమ్మగారు పలకరించారు.

"ఇవాళే చారన్నం తిన్నాను. నీరసం ఇంకా తగ్గలేదు. రండి, కూర్చోండి"

## ప్లీజ్, నీళ్లు తాగకండి

కొంతమంది తీరని దాహంతో అల్లాడిపోతున్నట్లు చెంబుల మీద చెంబులు నీళ్ళు తాగేస్తుంటారు! అదేమి టండీ అని ఆశ్చర్యంగా అడిగితే వాటర్ థెరపీ అంటారు. అదెందుకూ అనడిగితే ఎండిపోయినట్లు ఉండే చర్మం బాధను తగ్గించు కోవడానికే ఈ నీళ్ళ తంటాలు అని వాపోతుంటారు.కానీ చెంబులకొద్దీ నీళ్ల లాగించెయ్యడం సరికాదు. మీది డ్రై స్కిన్ అయితే ఎక్కువగా నీళ్ళు తాగటం వల్ల చర్మంలో తేమ పెరగదు. అందుకే దాన్నాపేసి చర్మంలోకి నీరు చేరే మార్గం చూసు కోవాలి.

ఆ మార్గాలేమిటీ అంటే... గోరు వెచ్చని నీరు గల బాత్‌టబ్‌లో పదిహేను నిమిషాల పాటు శరీరాన్నుంచితే చాలు. అమిత వేడిగా ఉండే నీళ్ళు పనికిరావు. తర్వాత చల్లని నీటితో స్నానం చెయ్యాలి. మీకు మాయిశ్చరైజింగ్ లోషన్ వాడే అలవాటుంటే స్నానానంతరమే దాన్ని వాడాలి. ఎందుకంటే... మాయిశ్చరైజింగ్ లోషన్ చర్మంలో ప్రవేశించిన తడిని ఆరని వ్వదని అంటున్నారు కెనడియన్ డెర్మటాలజిస్టు రాన్ వెండర్.

అలాగే... ఓట్‌మీల్ స్నానం చెయ్యటం వల్ల కూడా చర్మంలో తేమ శాతం పెరుగుతుందట. "ఓట్ మీల్ బాత్" అంటే... రెండు కప్పుల కొల్లాయిడల్ ఓట్ మీల్‌ని గోరువెచ్చని నీళ్ళలో పోసి దానితో స్నానం చెయ్యడమే. కొల్లాయిడల్ ఓట్ మీల్ అంటే "అవీనో" ఇది అన్ని ఫార్మాస్యూటికల్స్‌లో లభ్య మవుతుంది.



అన్నాను.

మాధవి వచ్చి నా పక్కనే కూర్చుని నా చేతికి ఏదో న్యూస్ పేపర్ పాకెట్టు అందించింది.

"ఏమిటమ్మా ఇది!" అడిగాను అర్థంకాక.

"తీసి చూడండి!" అంది నవ్వుతూ.

విప్పి చూశాను. లోపల ముదురు నీలం రంగు స్వెట్టర్ చాలా బాగుంది.

"ఇక్కడ ఇంకా చలిగానే ఉంది. ఇది వేసుకోండి రోజూ" అంది అభిమానంగా నాకేసి చూస్తూ.

"ఎందుకమ్మా ఇదిఎంతపెట్టి కొన్నావో!" నొచ్చుకున్నాను నేను.

"దానికోసం నేనేం ఖర్చు పెట్టలేదు. ఆంటీ! ఊలు నా దగ్గరే ఉంది అల్లడానికి నాకేం ఖర్చుకాలేదు" అంది.

"ఏమిటీ, నువ్వే అల్లావా? నీకు స్వెట్టరు అల్లడం కూడా వచ్చని నాకు తెలీదే! చాలా బాగుందమ్మా" అన్నాను మెచ్చుకోలుగా. దానిని మళ్ళీ పరీక్షగా చూశాను. నిజంగా అల్లిక చాలా చక్కగా ఉంది.

"మా మధుకి కుట్లు, అల్లికలు అంటే చాలా ఇష్టం. మా ఇంట్లో మీరు చూసిన కర్టెన్లు, సోఫా కుషన్ కవర్లు అన్నీ అదే ఎంబ్రాయిడరీ చేసింది" అంది మాణిక్యమ్మ గారు. ఎందుకో ఆవిడ గొంతులో ఉత్సాహం ధ్వనించలేదు.

వాళ్ళకి మీనా టీ అందించింది, నా చేతి

"ఆ సుందరమ్మగారు మాధవి గురించి ఏదేదో చాలా చెడ్డగా చెప్తూంటుంది. పైగా ఈయన ఉన్నప్పుడు మాధవిని రానియ్య వద్దని కూడా హెచ్చరించింది" అంది మెల్లగా



లోని స్వెట్టరు తీసుకుని తనూ చూసింది.

"నిజంగా చాలా బావుందండీ! ఇంత బాగా అల్లడం ఎక్కడ నేర్చుకున్నారు?" అంది.

మాధవి ఏం మాట్లాడలేదు. ఆమె మొహం మ్లానమైంది. నీలి నీడలు కదలాడటం నా దృష్టిని తప్పించుకోలేదు.

"మధు పెళ్ళయ్యాక కొంతకాలం అస్సాంలో ఉంది, అప్పుడు నేర్చుకుంది" అన్నారు మాణిక్యమ్మగారు పొడిగా. వాళ్ళ నిర్లిప్తత చూసిన తర్వాత నేనూ ఆ విషయం మరి పొడిగించలేదు. మీనా కూడా అర్థం చేసుకున్నట్టుంది. కాసేపు అందరం మౌనంగా ఉన్నాం. వాతావరణాన్ని తేలిక చేసే ఉద్దేశంతో నేను, "చాలా థాంక్స్! మాధవీ! రోజంతా ఆఫీసులో పనిచేసి మళ్ళీ ఇంటికి వచ్చి నా కోసం స్వెట్టర్ అల్లావా? నాకు చలి వేసినప్పుడంతా నువ్వు గుర్తొస్తావులే ఇకనించీ!" అన్నాను నవ్వుతూ. నిజంగా నా మనసు ఆర్ద్రమయింది. ప్రతిఫలాపేక్ష లేకుండా మనం అంటే అభిమానం చూపించే వాళ్ళు ఉండడం కన్నా అదృష్టమేముంది.

కాసేపు కూర్చుని వెళ్ళడానికి లేచారు.

"ఆంటీ! మీరు బాగా బలం పుంజుకునే వరకూ ఇక్కడే ఉంటే మంచిది. బాగా రెస్ట్ తీసుకోండి. మీకేం బుక్స్ కావాలన్నా నేను తెచ్చిస్తాను. మీకు ఓపిక ఉందంటే అప్పుడప్పుడు వచ్చి బోర్ కూడా కొట్టిస్తాను" అంది నవ్వుతూ.

"తప్పకుండా!" అన్నాను నేను నవ్వుతూ.

"అంటే మీ అభిప్రాయమేమిటి ఆంటీ! తప్పకుండా 'బోరు కొట్టు' అనా! నిజంగా నా మాటలు మీకు అంత బోర్‌గా ఉన్నాయన్న మాట" అంది తెచ్చి పెట్టుకున్న సీరియస్‌నెస్‌తో.

"అహ! అలా కాదు 'తప్పకుండా' అనే మాట నీ రాకకి మాత్రమే అప్లై చేసుకో" అన్నాను.

అందరం నవ్వుకున్నాం. వాళ్ళు వెళ్ళిపోయారు.

స్వెట్టర్ విషయం అడిగితే మాధవి అంత మూడీగా ఎందుకయిందా అని ఆలోచిస్తూ పడుకున్నాను.

"అత్తయ్యగారూ!" మీనా నా పక్కనే కూర్చుని పిల్చింది నెమ్మదిగా.

ఏమిటన్నట్టు చూశాను.

"ఆ సుందరమ్మగారు మాధవి గురించి ఏదేదో చాలా చెడ్డగా చెప్తూంటుంది. పైగా ఈయన ఉన్నప్పుడు మాధవిని రానియ్యవద్దని కూడా హెచ్చరించింది" అంది మెల్లగా.

"నువ్వు నమ్ముతున్నావా?" ఆమె మొహంలోకి సూటిగా చూస్తూ అడిగాను.

"ఆహా! అది కాదు. ఆవిడ అందరి గురించి చెడుగానే చెప్తుం

## రెండూ కలిపి...



వడ్డాది సుబ్బారాయుడు స్మృతి కావ్యాలు రాసిన తొలికవులలో ముఖ్యులు. 'సతీస్మృతి' పేర తన భార్యలు వెంకమాంబ, రత్నాంబ, విజయలక్ష్మి, సుబ్బలక్ష్మి, అన్నపూర్ణ చనిపోయిన తర్వాత ఒక్కో సారి ఒక్కో చిన్న కావ్యాన్ని విడుదల చేశారు. ఒక సారి భార్య చనిపోయినా ఆయన నుంచి స్మృతి కావ్యం రాకపోవడంతో అంతా ఆశ్చర్యపోయారు. ఒకాయన అదే విషయాన్ని దేవులపల్లి వద్ద ప్రస్తావిస్తే-

'దానికెందుకు కంగారు? ఈ పర్యాయం రెండూ కలిపి వేస్తారులే' అని చమత్కరించారు.

---

టుంది. అందుక్కాదు. ఇంత మంచి అమ్మాయిని కూడా ఆమె వదిలి పెట్టలేదు. అందుకు నాకు ఆశ్చర్యంగా ఉంటుంది" అంది.

"కొందరంతే మీనా! ఎక్కడైనా చెడు ఉందా అని వెతుకుతుంటారు. దాని గురించే మాట్లాడతారు. ఏం లేకపోతే ఏదో కల్పించి అయినా చెప్పకపోతే నిద్రపట్టదు వాళ్ళకి. అసలు నువ్వు ఆవిడ మాటలు ఈ చెవితో విని ఆ చెవి నుంచి బయటికి వదిలేయడం మంచిది" అన్నాను దిండు మీద వెనక్కి వాలుతూ.

"మీ అబ్బాయి కూడా అదే అన్నారు. అసలు ఆమెని ఇంట్లోకే రానివ్వద్దు అంటారు"

అప్పుడే వచ్చాడు రవి.

"ఏమిటి అత్తాకోడళ్ళు తీరిగ్గా మాట్లాడుకుంటున్నారు? "

"ఏం లేదు. సుందరమ్మగార్ని మీరు రానివ్వద్దనలేదూ! అదే చెప్తున్నాను" అంది మీనా.

"అవునమ్మా! నాలుగు రోజులు ఆమె మనింటికి వస్తే ఆ భాష, అభిప్రాయాలు, ఆవిడ ఆలోచనలు మనక్కూడా వచ్చేస్తాయేమోనని నా భయం. అబ్బ! చాలా దారుణమైన మనిషి. మీనా! నిన్ను గోడమీద నుంచో, గేటు మీద నుండో పలకరిస్తుంటుందేమో నువ్వు ఎంత ముభావంగా ఉంటే అంత మంచిది" అని మీనాని హెచ్చరిస్తూ బట్టలు మార్చుకోవడానికి లోపలికి వెళ్ళాడు. కాని వాడు కోరినట్టు జరగలేదు.

ఆరోజు సాయంత్రం బాల్కనీలో పాకిన సన్నజాజి తీగ దగ్గర నిలబడి పూలు కోస్తోంది మీనా. నేను కూడా అక్కడే కూర్చుని పూలు మాల కడుతున్నాను. రవి ఇంకా ఆఫీసు నుండి రాలేదు.

సుందరమ్మగారు యథాప్రకారం ఎవరితోనో పోట్లాడుతోంది. నాకు నీరసం ఇంకా తగ్గలేదేమో. ఆ అరుపులకు తల పగిలిపోతున్నట్టుంది.

"ఏంటి మీనా! ఎవరితో పోట్లాడుతోంది" అన్నాను కణతలు నొక్కుకుంటూ.

ఇంతలో ఆవిడే మా ఇళ్ళ మధ్య ఉన్న కాంపౌండ్ వాల్ దగ్గరకు వచ్చింది.

"ఎక్కడ పడిందీ! నీ బొంద! గాలిపటాలు ఎగరేసుకోవాలనుకుంటే మీ కొంపల్లో ఎగరేసుకోండి. మా ఇంట్లో పడితే వెతికి, తీసి నీకు అందించేటందుకు నేనేం నీ నౌఖ

రునా? మీ కొంపల్లోకి నేను ఎప్పుడైనా వచ్చానా? ముదనష్టపు వెధవలు. పిల్లలా మీరు, పిశాచాలు కాని, గాలి పటాలని వస్తారు. మొక్కలన్నీ కలయతొక్కి, ఆ పూలన్నీ మొగ్గలతో సహా తెంపుకు పోతారు. మీ దొంగ బుద్ధులెవరికి తెలీనివి? అసలు మీ అమ్మా బాబుల్ని అనాలి. మిమ్మల్ని కనేసి ఊరిమీదికి తోలినట్టున్నారు. మీ కాళ్ళు విరగా! చెప్తుంటే మీక్కాదూ! లోపలికి వచ్చారంటే కాళ్ళు నిజంగానే విరగ్గొడతా!" ఆమె వాక్ ప్రవాహం ఉరవడిగా సాగిపోతోంది. గాలిపటం కోసం వెతుకుతున్నట్టుంది. రేడియో సిలోన్ లాగా దగ్గరగా కాసేపు, దూరం నుండి కాసేపు రకరకాల వేవ్‌లెంత్‌ల్లో ఆమె గొంతు వినిపిస్తోంది.

మీనా పూలు కోయడమైనట్టుంది.

"అత్తయ్యా! ఇక్కడ చలిగాలి వస్తోంది. లోపలికి రండి" అంది. నేనూ లేచి లోపలికి పోబోతున్నాను.

"ఓరి నాయనో! చచ్చాన్రా దేవుడా! నీ ఇంట పీనుగెళ్ళా! నీ దెవసం చెయ్యా! నీ బూడిదెత్తా..."

ఏడుపుతో కలిసి ఆమె గొంతు ఈసారి తారస్థాయికి చేరుకుంది. మీనా నేను గబగబా మెట్లుదిగి గేట్లోంచి బయటికి వచ్చాం.

దూరంగా ఇద్దరు పదిపన్నెండేళ్ళ కుర్రాళ్ళు పరిగెత్తిపోతున్నారు.

సుందరమ్మ నుదురు రక్తసిక్తంగా ఉంది. రక్తం కారుతున్న గాయాన్ని ఒక చేతో నొక్కి పెట్టి అక్కడే నిలబడి శాపనార్థాలు పెడుతోంది.

మీనా గబగబా వెళ్ళి ఆమెని మా ఇంటికి తీసుకురావడానికి ప్రయత్నించింది. చివరికి ఆమెతో కలిసి వాళ్ళింట్లోకే వెళ్ళింది.

నాకు కాళ్ళు చేతులు ఆడడంలేదు. వాళ్ళింటికి వెళ్ళాలంటే కాలు తీసి వేయలేనంత నీరసమనిపించింది. అక్కడే మీనా కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాను.

పది నిముషాల తర్వాత వచ్చింది మీనా.

"ఏమైంది? " ఆదుర్దాగా అడిగాను.

"అదే! ఆ పిల్లలకి గాలిపటం ఇవ్వలేదనుకుంటా. పోతూపోతూ ఏం పెట్టి కొట్టారో గానీ బాగా దెబ్బ తగిలింది. చీర మీదంతా రక్తం కారింది. ఆ పక్కసందులోనే డాక్టరు దగ్గరికి వెళ్దామంటే రానంటే రానంది. ప్రకాశంగారు, వనజ కూడా ఇంకా ఇంటికి రాలేదు. పసుపు అద్దుతాను. కాఫీ పొడి రాస్తాను అంటుంది" ఇద్దరం మేడ మీదికి వెళ్ళాం. మీనా బాండేజి క్లాత్ టింక్చరు తీసుకుని మళ్ళీ వెళ్ళింది. నాకైతే ఆవిడ అవేమీ వాడుతుందని నమ్మకం లేదు.

నేననుకున్నట్టే అయిదు నిముషాలు గడవకముందే వచ్చేసింది. 'ఆవిడ నా మాటలు వినిపించుకోలేదత్తయ్యగారూ. నేను వెళ్ళే సరికే ఇంత పసుపు అద్దేసింది. వనజా వాళ్ళు వచ్చిన తర్వాత తీసుకెళ్తారేమో లెండి" అంది లోపలికి వస్తూ. ఆమె అమాయకత్వానికి నాకు నవ్వొచ్చింది. ప్రకాశం, వనజ ఇద్దరికిద్దరూ చాలా మెతకవాళ్ళు. వాళ్ళ మాట ఈమె ఎక్కడ వింటుంది. నాకు ఆశ్చర్యంగా అనిపించిందేమిటంటే పది నిమిషాల సేపు అంత గొడవ జరిగినా వీధిలో ఎవరూ పట్టించుకోలేదు.

ఆ సంఘటన తర్వాత ఆమె కాస్త తరుచుగానే మా



ఇంటికి రావడం మొదలెట్టింది. రకరకాల విషయాల మీద ఆమె తన అభిప్రాయాలను నిర్మొహమాటంగా చెప్పేది. ఎక్కువ స్వోత్కర్ష. పరనింద చోటు చేసుకునేవి ఆవిడ మాటలు వినడానికి చాలా ఓపిక కావాలంటుంది మీనా. ఒకటి రెండుసార్లు రవి ఇంట్లో ఉన్నప్పుడే ఆమె వచ్చింది. ఆమె వెళ్ళిన తర్వాత

"అమ్మా! ఈవిడ నిన్ను పట్టుకుందేమిటి? శని కంటే పవర్‌ఫుల్ గ్రహం జాగ్రత్తమ్మా! ప్రపంచంలో తనకి తెలీని విషయం లేనట్టు మాట్లాడుతుందేమిటి? నీకు చాలా ఓర్పు వుందిగాని ఈవిడ ఇలా మాటిమాటికి వస్తుంటే తగ్గిన నీ జ్వరం మళ్ళీ వచ్చినా రావచ్చు. పోనీ ఇల్లు మారిపోదామా?" అన్నాడు ఒకసారి.

ఆవిడ



మాట వస్తేచాలు వీడి ధోరణి నల్లేరుమీద బండిలాగా సాగుతుంది.

"బాగానే ఉందిరా! ఆమె కోసం మనకి సౌకర్యంగా వున్న ఇల్లు వదిలేసిపోతామా? లోకంలో రకరకాల మనుషులుంటారు. ఇదొక రకమని సర్దుకుపోవాలి" అన్నాను. వాడు మాట్లాడకుండా ఊరుకున్నాడు. కానీ సమాధానపడలేదని నాకు తెలుసు.

8



ఒకసారి మాణిక్యమ్మ గారింట్లో సుందరమ్మగారి ప్రస్తావన వచ్చింది.

"నా పెళ్ళికి సుందరానికి ఎనిమిదేళ్ళు. పన్నెండేళ్ళకే పెళ్ళిచేశారు. మేనత్త కొడుకే! కాపరానికి వెళ్ళిన తర్వాత ఏ రెండు మూడేళ్ళుందో అత్తవారింట్లో! అసలు విషయమేమిటో తెలీదు కాని అక్కడ అది సుఖపడిందేమీ లేదు. ఏం గొడవలో మరి, వాళ్ళ నాన్న దాన్ని పుట్టింటికి తీసుకొచ్చేశాడు. కోర్టుకు వెళ్ళి భరణం కూడా తెచ్చాడు కాని కాపురం లేకుండా పోయింది. పాపం! కాస్త పిల్లాజెల్లా అయినా ఉంటే వాళ్ళని చూసుకుని బతికేది. అదీ లేకపోయె. ఆ మేనత్త మహా గయ్యాళిట. దీని వీపుమీద పిడకలు కొట్టేదిట. తర్వాత అతను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడట. కాని అతను పోయి కూడా ముప్ఫై ఏళ్ళు అవుతుంది. సుందరం వాళ్ళ నాన్న చండశాసనుడు. దీనికి తర్వాతైనా చదువు సంధ్యా చెప్పించలేదు. ఇంట్లో చాకిరీ చేస్తూ ఉండేది. ఇప్పుడిలా పెడసరంగా, గయ్యాళిగాతయారైంది కానీ, చిన్నప్పుడు బాగానే ఉండేది. ఏమిటో దాని ఖర్మ!" అంది మాణిక్యమ్మగారు జాలిగా.

మనుషుల్లోని మార్పులకు పరిస్థితులే కారణం అనిపించింది నాకు.

"ఏనాటి ఋణమో! ప్రకాశం ఇంటికి కుక్క కంటే ఎక్కువగా కాపలా కాస్తుంది" అంది ఆమె నిట్టూరుస్తూ.

మాధవి వచ్చింది ఆఫీసు నుంచి.

"ఎవరి సంగతమ్మా! సుందరం పిన్ని గురించేనా" అంది.

"ఆంటీ! ఆమె గురించి అయితే భారతమంత పెద్ద కథే అవుతుంది. అన్నట్టు ఆవిడ దెబ్బ మీరింకా రుచి చూడలేదా. ఆవిడ వడదెబ్బ కంటే ప్రమాదకరం" అంది. నాకు అర్థం కాలేదు.

"ఏమిటంటున్నావు? " అన్నాను.

"పిన్నికి మహా అనుమానం. ప్రతి విషయం రకరకాలుగా ఆరాలు తీస్తుంది. ప్రపంచంలోని ప్రతి మొగవాడు మోసగాడని, ఆడవాళ్ళకి రంకుతప్ప మరో వ్యాపకం ఉండదని ఆమె ప్రగాఢ విశ్వాసం" అంది.

"ఊరుకో, మధూ! మరీ అసహ్యంగా మాట్లాడుతున్నావు". మాణిక్యమ్మ గారు మాధవిని వారించాలని చూశారు. ఈ విషయంలో మాధవి మా రవికంటే రెండాకులు ఎక్కువే చదివినట్టుంది. "నేనేం లేనిది చెప్పడం లేదుగా! ఆంటీ! మీనా గారి మీద ఏమైనా చెప్తుందేమో నమ్మకండి. నిప్పు లేనిదే పొగ రాదంటారు. కానీ సుందరమ్మ ఉన్న చోట పొగే కాదు, నిప్పు కూడా పుడుతుంది. వయసులోని ఆడవాళ్ళంతా వాళ్ళ ప్రకాశం అంటే పడి చస్తారని, ఆమె భాషలో చెప్పాలంటే, వల్లో వేసుకుందామని చూస్తారని అనుకుంటుంది ఆంటీ! నా మాటలు కొంచెం అసభ్యంగా ఉన్నాయేమో కానీ అసభ్యమైన వాళ్ళ గురించి సభ్యతగా చెప్పడం నాకు రాదు. నేను చెప్పేవన్నీ మాత్రం పచ్చి నిజాలే!" అంది. మాధవిలో ఆవేశం కనిపించింది. ఆమెని అలా అంత

వరకు చూడలేదు.

"మధూ! ఊరుకో. అలా నోరు పారేసు కోకు" మాణిక్యమ్మగారు మళ్ళీ మాధవి ధోర ణికి అడ్డుకట్ట వేయాలని ప్రయత్నించారు.

"ఆంటీ! ఇలా మాట్లాడుతున్నందుకు ఏమీ అనుకోకండి. ఇక్కడుంటే నా నోరు ఊరు కోదు. మీకు కాఫీ తెస్తాను" అంటూ లోప లికి వెళ్ళిపోయింది.

ఆమె ఉద్వేగాన్ని ఆపుకోవడానికి ప్రయత్ని స్తోంది. సుందరమ్మ విషయంలో ఆమె అంత వైల్డ్‌గా ఎందుకు రియాక్టయిందో నాకర్థం కాలేదు. మాణిక్యమ్మగారి మాటల్లో తర్వాత నాకు సమాధానం దొరికింది.

"మా మధుకి, సుందరమ్మకి ఒక్క క్షణం పడదండి. మేము ఉద్యోగరీత్యా ఊళ్ళు తిరు గుతుంటే పిల్లల చదువులు పాడవుతాయని, మగపిల్లవాడు కాబట్టి మా మహేష్‌ని హాస్టల్‌లో ఉంచి చదివించాం. మధుని ఆడపిల్ల, కాస్త మా అత్తగారికి తోడుగా ఉంటుందని దుగ్గిరాలలోనే స్కూల్‌లో చేర్పించాం. వాళ్ళ ప్రకాశం, మధూ ఒకే స్కూల్‌లో చదివారు. వాడు మధు కంటే మూడు నాలుగేళ్ళు పెద్దవాడు. చిన్నప్పటి నుంచి కలసి ఆడుకున్నారు. తర్వాత మా అల్లుడు పోయిన తర్వాత మా మధు కోసం ఇక్కడే స్థిరపడ్డాం. ప్రకాశం కూడా ఉద్యోగం వచ్చి ఇక్కడికి వచ్చాడు. ఆవిడ కూడా వచ్చింది మేనల్లుడితో.

మాణిక్యమ్మగారు వివరిస్తుండగానే మాధవి కాఫీ తీసుకుని వచ్చింది. మా ఇద్దరితో పాటే తనూ కాఫీ తాగుతూ కూర్చుంది.

"ప్రకాశానిక్కూడా బాగా పుస్తకాలు చదివే అలవాటుంది. అతని దగ్గర చాలా మంచి మంచి బుక్స్ ఉన్నాయి. చిన్నప్పటి నుంచి పరిచయం ఉంది కదా అని నేను పుస్తకాల కోసం వెళ్ళేదాన్ని. ప్రతిసారీ అనుమానంగా చూస్తూ వీడితో నీకేం పని అని నిలదీసేది. అబ్బ! చాలా హారిబుల్ ఉమన్. ఆమెతో కాస్త పరిచయం కలిగితే ఎదుటి వ్యక్తికి జీవితం మీదే విరక్తి పుడుతుంది" అంది అసహనంగా.

నేను ఆమెని సముదాయించే ప్రయత్నం చేశాను.

"పోనీలేమ్మా! జీవితంలో ఏ సుఖం నోచుకొని మనిషికి ఎవరి మీదో తెలీని కసి, కోపం కలుగుతాయి. మరి వాటికి అవుట్‌లెట్ ఉండాలి కదా! అది చుట్టుప క్కల వాళ్ళే అవుతుంటారు. మనం పట్టించు కోనక్కరలేదు" అన్నాను.

"మన బతుకు మోడైతే ప్రపంచం అంతా అలాగే ఉండాలంటే ఎలా! అయినా కష్టాలు లేని మనిషి ఈ భూమ్మీద వుంటాడా? ఆమెకి ఈ ప్రపంచంలోని సమస్త చరాచర సృష్టి మీదా ద్వేషమే. అయితే ఒకే ఒక్క ఎక్సెప్షన్ అదే! ప్రకాశం!" అంది మళ్ళీ మామూలుగా నవ్వేస్తూ.

* * *

నాకు నీరసం ఇంకా పూర్తిగా తగ్గలేదు. ఏం తోచటంలేదు. నాలుగైదు రోజుల నుండీ మాణిక్యమ్మగారు కూడా రావటం లేదు. ఈ జ్వరం వల్ల నా పుస్తకాలు మూల పడ్డాయి. కొంచెంసేపు చదివితే బాగా తల నొప్పి వస్తోంది. ప్రతిరోజూ ఆఫీసు నుంచి వచ్చి ఇక్కడ కాసేపు కూర్చున్న తర్వాతే ఇంటికి వెళ్ళేది మాధవి. తనూ రావటం లేదు. ఏమైందో తెలీలేదు. నాకు నవ్వొచ్చింది.

గుంటూరులో ఉంటే ఇరుగు పొరుగు ఎవరున్నారో కూడా పట్టించుకోని నేను ఇక్కడికి వచ్చినప్పటి నుంచీ వీళ్ళ గురించి ఇంతగా ఎందుకు ఆలోచిస్తున్నానో నాకే అర్థం కావడంలేదు. మాధవి అంటే నాకు తెలియకుండానే మమకారం కలిగింది. ఎన్నోసార్లు అలాంటి కూతురు ఉంటే బాగుండేది అని అనిపిస్తుంది. నా ఆలోచన లకి నాకే ఆశ్చర్యం కలుగుతోంది.

కొంచెం ఓపిక వచ్చింది కాబట్టి నేనే వెళ్ళి విషయం కనుక్కుందామని బయల్దేరబోతు

న్నాను.

"అత్తయ్యగారూ! ఇంత నీరసంగా ఉన్నారు ఎక్కడికి వెళ్తున్నారూ? ఏమైనా కావాలంటే నాకు చెప్పండి నేను వెళ్లి తెస్తాను" అంది మీనా

"ఏం లేదమ్మా! మాధవీవాళ్ళు నాలుగైదు రోజులుగా రావడంలేదు కదా! ఏమైందో కనుక్కుందామనీ..." నాన్నాను. నాకెందుకో కొంచెం సిగ్గుగా అనిపించింది.

మీనా కూడా నాకేసి ఆశ్చర్యంగా చూస్తోంది. అంత ఇదిగా నేను ఆరాటపడడం, నీరసంగా ఉన్నా, అంతగా ఎవరింటికి వెళ్ళని నేను బయల్దేరడం ఆమెకి ఆశ్చర్యం కలిగించి ఉండొచ్చు

"మీకింకా అంత ఓపిక రాలేదు. సాయంత్రం చూద్దాం. రాకపోతే నేను వెళ్ళి కనుక్కొస్తాను మీరు రండి" అంటూ నన్ను లోపలికి నడిపించింది. నేనూ సరేనన్నాను.

మా మీనా అన్నట్టే సాయంత్రం మాణిక్యమ్మగారొక్కరే వచ్చారు.

"రండి! మధ్యాహ్నం మీ గురించే అనుకున్నాం ఈ మధ్య మీరు రాకపోతే మీకు ఒంట్లో బాగోలేదో ఏంటోనని అత్తయ్యగారే బయల్దేరారు" అంది మీనా ఆమెని ఆహ్వానిస్తూ.

"నాకు బాగానే ఉంది. నిన్న మా అతుల్ పుట్టినరోజు. మా మధు వాడి దగ్గరికి వెళ్ళింది. రాత్రికి రావాలి. మా వారికీ కాస్త ఒంట్లో నలతగా ఉంది. ఒక్కరినీ వదిలి రావడమెందుకని నేనూ ఇల్లు కదలలేదు" అంది కూర్చుంటూ.

"అతుల్ ఎవరు? " మీనా అడిగింది కుతూహలంగా.

"అతుల్ మా మధు కొడుకు. రిషి వేలే స్కూలులో మూడవ తరగతి చదువుతున్నాడు. వాడు హాస్టల్ లో ఉన్నా ప్రతిఏడు వాడి పుట్టినరోజుకి వాడి దగ్గర మాధవి ఉండాల్సిందే! లేకపోతే గొడవ పెడతాడు" మనవడి సంగతి మురిపెంగా చెప్పిందావిడ.

"మాధవి కొడుకా!" నేను స్వగతంలా అనుకున్నాను.

"అవునండీ! మాధవికి కొడుకున్నాడు. ఆ భగవంతుడు దాని రాత అలా రాసినా ఈ నలుసుని దాని కడుపున వేశాడు. అతుల్ అంతా మా మధు పోలికే. ఈసారి వేసవి సెలవుకు వస్తాడుగా చూద్దురుగాని. వాడింట్లో ఉంటే మాకు రోజూ పండుగ సందడే!" ఆమె మొహంనిండా నవ్వు పరుచుకుంది. ఆమెలో ఆ సంతోషం చూసిన తర్వాత మాధవి గతం గురించి అడిగి బాధ పెట్టాలనిపించలేదు. కాసేపు ఆ మాటా ఈ మాటా మాట్లాడి ఆమె వెళ్ళిపోయింది.

## 9



నాకు సెలవులు అయిపోతున్నాయి. గుంటూరు వెళ్ళడానికి ట్రైన్‌లో టిక్కెట్ కూడా రిజర్వ్ చేయించుకున్నాను. మర్నాడు ప్రయాణమనగా మళ్ళీ జ్వరం వచ్చింది. మళ్ళీ డాక్టరు, పరీక్షలు... అన్నీ అయిన తర్వాత టైఫాయిడ్ జ్వరం అని తేల్చారు. మళ్ళీ నా ప్రయాణం వాయిదా పడింది. రవి పట్టుబట్టి మెడికల్ లీవు ఎక్స్‌టెన్షన్‌కి అప్లై చేయించాడు. వేసవి సెలవుల ముందు ఒకసారి వెళ్ళిరావడానికి నిర్ణయించుకున్నాను. ఈ హైదరాబాద్‌లో ఏ ముహూర్తంలో కాలు పెట్టానో కానీ ఇన్నాళ్ళు ఇక్కడే చిక్కుబడిపోయాను. అసలు ఇల్లు వదిలి ఎక్కడికీ ఎప్పుడూ కదలను. అలాంటిది ఇన్నిరోజులు ఉన్న

ఊరు, సొంత ఇల్లు వదిలి ఉండాల్సి వచ్చింది. చేయగలిగిందేమీ లేదని సరిపె ట్టుకోవడమే!

మాధవి వచ్చింది

"ఆంటీ! మీకు అనారోగ్యంగా ఉండడం బాధగానే ఉన్నా మరికొంత కాలం ఇలా ఆలోచించడం దుర్మార్గమేమో కదా! మా దగ్గరుంటారంటే నాకు మాత్రం చాలా సంతోషంగా ఉంది" అంది.

"ఇదీ నీ సంకల్ప బలమేనా ఏమిటి?" అడిగాను నవ్వుతూ, తనూ నవ్వేసింది.

ఈ సారి వారం రోజులు మంచం మీద ఉన్నాను. నాలోని శక్తి అంతా పోయింది. బాగా నీరసపడ్డాను. రవి, మీనా కంటికి రెప్పల్లాగా చూసుకుంటున్నారు. మాధవి, మాణిక్యమ్మగారు తరుచూ వస్తున్నారు. రవికి కూడా వాళ్ళు బాగా పరిచయమ య్యారు. వాళ్ళు వచ్చినప్పుడు వాడు కూడా ఇంట్లో ఉంటే వచ్చి మా దగ్గర కూర్చునే వాడు. మాధవికి, రవికి ఇద్దరికీ కొత్తా పాతా లేదు. మా రవి కూడా పలకరించని వాళ్ళు పాపాత్ములు అన్నట్లుంటాడు. అంద రితో కలివిడిగా ఉండడం వాడికి వాళ్ళ నాన్నగారి దగ్గర్నించి వచ్చిన వారసత్వం.

ఎక్కువగా సంభాషణలు అనడం కంటే చర్చలు, వాగ్వివాదాలు అనడం సబబేమో! ఏదో విషయం కదిపేవాడు రవి.

ముగ్గురూ మూడు రకాలుగా స్పందించే వారు. ఒకరి అభిప్రాయానికి మరొకరికి పొంతన ఉండేది కాదు. సాధారణంగా మాధవిదే పైచెయ్యి అవుతుండేది. ఆ అమ్మాయి అలా గలగలా మాట్లాడుతుంటే మా ఇంటికే నిండుదనం వచ్చినట్టుండేది. ఆ అమ్మాయి నిర్మొహమాటం, ముక్కుకు సూటిగా పోయే స్వభావం అన్నీ నాకు నచ్చేవి. మాణిక్యమ్మగారూ, నేను శ్రోతలం. ఎప్పుడైనా తీర్పు కోసం నా అవసరం వచ్చేది. రవి "అమ్మ మాధవీ పక్షపాతు రాలు తీర్పులో న్యాయం ఉండదు" అంటుం టాడు.

"ఈ పక్షపాతురాలేమిటి రా! ఏదో పాపా త్మురాలు అన్నట్టుంది" అనేదాన్ని నేను.

వాళ్ళకి వాదించుకోవడానికే విషయం దొరకనప్పుడు రవిచేత పాటలు పాడించే వాళ్ళు. వాడిది చాలా శ్రావ్యమైన కంఠం. చిన్నప్పటి నుంచీ భాషాభేదం లేకుండా ఏ పాటయినా ఒక్కసారి వింటే పట్టేసేవాడు. హైస్కూలులో ఉన్నప్పుడు కర్ణాటక సంగీ తం కూడా నేర్చుకున్నాడు. కాలేజి చదువుకి వచ్చిన తర్వాత సంగీతం వెనకపడింది. అయినా నలుగురూ కలిసినప్పుడు వాణ్ణి పాడమనడం సాధారణంగా జరిగేది.

ఇప్పటికీ ఎక్కడైనా సంగీత విభావరి, కచేరి ఉంటే వాడు హాజరవాల్సిందే!

ఇప్పుడు ఇంట్లోనే శ్రోతలు దొరికారు వాడికి. పాతవి కొత్తవి, హిందీ, తెలుగు అన్ని రకాల పాటలు మాధవి కోరి మరీ పాడించేది.

రోజులు సరదాగా గడిచిపోతున్నాయి. మరో విశేషం ఏమిటంటే సుందరమ్మగారి రాకపోకలు కూడా కాస్త ఎక్కువైనాయి. వనజ విషయాలలో ఆమె ధోరణి విని వినీ ఆమెతో ఆ విషయం కదపాలని ఉన్నా, కొద్ది పరిచయంతో మరీ చనువు తీసుకున్న ట్టుంటుందని, అదీకాక ఆమె ఎలా రియాక్ట వుతుందోనని తటపటాయించేదాన్ని.

ఆ రోజు సాయంత్రం ఇంట్లో ఉక్కగా ఉన్నట్టనిపించి, చల్లగాలికి బాల్కనీలో కూర్చున్నాను. విచ్చుకుంటున్న సన్నజాజుల పరిమళం మత్తుగా చుట్టుముడుతోంది. మనసు ప్రశాంతంగా ఉంది. ఆకాశంలో నక్షత్రాలు అందంగా మెరుస్తున్నాయి.

"ఆఫీసు ఐదు గంటలకే అయిపోతే ఎని మిది గంటలదాకా ఎక్కడ తిరిగొస్తున్నావు? ఇది సంసారుల కొంప అనుకున్నావా లేక పోతే సాని కొంపగా మార్చేద్దామని చూస్తు న్నావా?"

రుచిగా ఉన్న పరవాన్నంలో పలుగు

రాయి లాగా వినిపించింది సుందరమ్మ. ఇప్పుడు నేనూ, రవీ వాళ్ళలాగా కాస్త నిర్లిప్తంగా ఉండగలుగుతున్నాను. కొత్తగా వచ్చినప్పుడు పడినట్టు ఆవిడ అరుపులు వినగానే కంగారు పడడంలేదు.

వనజ ఇవాళ ఆఫీసు నుంచి లేట్‌గా వచ్చి ఉంటుంది.

ఆ అమ్మాయి ఏదో సన్నగా చెప్తోంది. నాకు వినిపించలేదు.

"అసలు మా ప్రకాశిగాడికి బుద్ధిలేదు. ఆడదానికి ఉద్యోగమేమిటంటే విన్నాడా? పెద్దవాళ్ళు చెప్పడం, పిల్లలు వినడం వాడి పెళ్ళితోనే అయిపోయింది. వాడి అలుసు చూసుకుని నువ్వు ఆడుతున్నావు ఆట"

ప్రకాశం ఇంట్లోనే ఉన్నట్టున్నాడు. ఏదో అంటున్నాడు కానీ ఆమె వాక్ప్రవాహంలో అతని మాటలు కొట్టుకుపోయాయి. "నీకెలాగూ రోడ్లు పట్టుకు తిరగడం అలవాటేగా! రాత్రికి ఇక్కడే పడి ఉండు. ఈ సుందరమ్మంటే ఏంటో నీకు అప్పుడు కానీ తెలిసిరాదు. హనుమంతుడి ముందా నీ కుప్పిగంతులు?" ఆమె అరుపులకు సన్నగా ఉన్న తలనొప్పి ఎక్కువైంది. రవి అన్నట్టు ఇల్లు మారితే ఈ రభస తప్పుతుంది కదా! అని ఒక్క క్షణం నాకూ అనిపించింది.

ఈ గొడవకి మీనా వంటింట్లోంచి వచ్చింది.

"అత్తయ్యా! ఈ అరుపులు, గోల మామూలు వాళ్ళకే గుండెదడ కలిగిస్తాయి. లోపలికొచ్చెయ్యండి. తలుపులు మూస్తే కాస్త చిన్నగా వినిపిస్తాయేమో!" అంది.

అదే నయమనిపించింది నాకు కూడా. కానీ వనజని తలుచుకుంటే చాలా బాధ కలిగింది. నిజంగా ఆ అమ్మాయిని రాత్రంతా బయట వరండాలో ఉంచేస్తుందేమోనని భయంగా ఉంది. మొదటిసారిగా ప్రకాశం మెతకతనానికి చిరాకనిపించింది. ఏం మగాడు! భార్యకి కాస్త అండగా నిలబడలేడు!

కాని మధ్యలో మనం కల్పించుకోవడం సంస్కారం కాదుగదా! ఈ సమాజంలో సభ్యత, సంస్కారాల ముసుగు వేసుకుని మనం ఎన్ని అన్యాయాలు, ఘోరాలు జరగనిచ్చేస్తున్నాం! ఇలా ఎంత కాలం?

అప్పుడే రవి వచ్చాడు. వస్తూనే

"ఏమిటి? మన హీరోయిన్ కథాకళి మొదలు పెట్టినట్టుందే, ఏమిటి సంగతి?" అన్నాడు.

వీడికి సుందరమ్మ మీద ఒంటికాలి మీద లేవాలని చాలా కోరికగా ఉంది అనుకున్నాను.

మీనా వివరించింది.

"గంట నుంచీ పాపం ఆ వనజ మీద దెబ్బలాడుతోందండీ! ఆఫీసు నుండి రావడం ఇవాళ ఆలస్యమైనట్టుంది. తిట్టిన తిట్టు తిట్టకుండా తూర్పారపడుతోంది. రాత్రంతా ఆ వరండాలోనే ఉండమంటోంది" మీనా కళ్ళు పెద్దవి చేసి మరీ చెప్తోంది.

"ప్రకాశం లేడా?" అన్నాడు బాల్కనీలోకి వస్తూ.

"ఉన్నాడు కానీ ఆయన మాట ఆవిడ ఎక్కడ వినిపించుకుంటుందీ?" అంది మీనా.

"అవున్లే! అతను ఉన్నా లేకపోయినా ఒకటే! ఉత్త డమ్మీ కాండిడేట్"

"పాపం! ఆ పిల్లని చూస్తే జాలేస్తోందిరా! రాత్రంతా బయటే ఉంచేసేలాగా ఉంది" అన్నాను జాలిగా.

"మొన్న పొద్దునా అంతే! పాలు పోయించుకుంటూ పాలవాడితో మాట్లాడిందని యాగీ చేసింది!" అంది మీనా.

"ఉండు! నేను వెళ్ళి కనుక్కుంటాను. ఇదేం అడవా! పక్కన అంత గొడవ జరుగుతుంటే కల్పించుకోకపోతే మనం మనుషుల మనిపించుకుంటామా? ఆ ప్రకాశానికి కాస్త గడ్డి పెట్టకపోతే ఇంక లాభం లేదు" అంటూ రవి దూకుడుగా చెప్పులేసుకొని బయల్దేరాడు.

## అదే కారణమట!



బిడ్డలు లేని ఆడవాళ్లని గొడ్రాళ్లనీ, మగవాళ్లనైతే... ఇంకేదో అనీ అంటుంటారు. కానీ ఒక్కోసారి, దంపతులిద్దరూ ఆరోగ్యవంతంగా ఉన్నా పిల్లలు పుట్టటం ఆలస్యమవుతుంది. మగవాళ్లలో స్పెర్మ్ ఉత్పత్తి ఉండవలసిన శాతం; ఆడవాళ్లలో అండోత్పత్తి, మెచ్యూరిటీ అన్నీ సవ్యంగా ఉన్నా ఫలదీకరణ జరగదు. అలాంటి సమస్యను ఎదుర్కొంటున్న దంపతుల్లో దానికి కారణమైన జన్యువును ఇప్పుడు శాస్త్రవేత్తలు కనుగొన్నారు. ఇది ఫలదీకరణ ప్రక్రియ సరిగా జరిగేలా చూస్తుందట.

ఒకసారి స్పెర్మ్ అండంలోకి ప్రవేశించగానే, ఈ జన్యువు స్పెర్మ్‌లో ఉండే డి.ఎన్.ఎ. సరైన పద్ధతిలో అండంలోని డి.ఎన్.ఎ.తో సంగమించేలా చేస్తుందట. ఆరోగ్యవంతమైన స్పెర్మ్, అండం ఉండి కూడా ఫలదీకరణ జరగలేకపోవడానికి కారణాన్ని ఈ జన్యువు వల్ల తెలుసుకోవచ్చంటున్నారు శాస్త్రజ్ఞులు.

"రవీ! తొందరపడకు. ఇప్పుడు నువ్వు వెళ్ళి కల్పించుకోవడం బాగుండదు. దానికిది సమయం కాదు. నీకు ప్రకాశంతో పరిచయం ఉంటే అతన్ని మన ఇంటికి పిలు. నెమ్మదిగా విషయం వివరించి మాట్లాడదాం" అన్నాను వాడి దూకుడికి కళ్ళెం వేస్తూ.

"వాడి మొహం. మనం ఎంత మాట్లాడినా, ఏం మాట్లాడినా ఆ నోట్లో నాలుక లేనివాడు ఆ బ్రహ్మరాక్షసినేం అదుపు చేయగలడు!" చులకనగా అన్నాడు. వాడి ఆవేశం పాలపొంగులా చప్పబడింది.

"అలా మాట్లాడకు రవీ! ఆమె చిన్నప్పట్నించి తల్లిలాగా పెంచిందట. మరి ఎంతో కొంత సాఫ్ట్ కార్నర్ ఉండడం సహజమేగా! అసలు ఇంత గొడవలు జరుగుతుంటే వనజా వాళ్ళ పుట్టింటి వాళ్ళేం పట్టించుకోరా? ఆమెకి వాళ్ళ అండ, ఆసరా ఉంటే, సుందరమ్మ కాస్త అణిగి ఉంటుంది కదా!" అన్నాను.

"లేదత్తయ్యా! వనజ ఒకసారి చెప్పింది. వాళ్ళ నాన్నగారు తన చిన్నప్పుడే పోతే తల్లితో వనజ కూడా వాళ్ళ మేనమామ ఇంట్లోనే ఉండేదిట. వనజ పెళ్ళి కూడా ఆయనే చేశారట. వాళ్ళత్తయ్యకి ఆయన వీళ్ళతో మాట్లాడడం కూడా ఇష్టం లేదుట. ఏదో పెళ్ళయితే బయట పడొచ్చని అనుకునేదట వనజ. ఇంక వాళ్ళు తనకి అండగా ఏం నిలుస్తారూ!" అంది మీనా.

"పాపం! ఆ అమ్మాయి పని పెనం మీద నుండి పొయ్యిలో పడినట్టయింది. పుట్టింటికి వెళ్ళే యోగం కూడా లేదన్నమాట" అన్నాను. నాకు చాలా బాధగా ఉంది.

"పుట్టింటిదాకా ఎందుకమ్మా! ఆ అమ్మాయిని ఆవిడ పక్కింటికి కూడా పోనీయదు కదా! ముందు ఆ అమ్మాయిని ఎడ్యుకేట్ చెయ్యాలి" రవి విసుక్కుంటూ లోపలికి వెళ్ళాడు.

పక్కింట్లో గొడవ కూడా సద్దుమణిగింది. మీనా బాల్కనీలో నుండి పక్కింట్లోకి తొంగి చూసింది. సుందరమ్మ ప్రకాశం లేరు. వనజ మాత్రం వరండాలో గ్రిల్స్‌కి ఆనుకుని

కూర్చుంది. చేసేదేం లేక మేమూ లోపలి కొచ్చాం. భోజనాలయిన తర్వాత తలుపు లన్నీ వేస్తూ, బాల్కనీ తలుపు వేయబోతూ మీనా యథాలాపంగా పక్కింటికేసి చూసిం దిట. వనజ అలాగే గోడకానుకుని కూర్చుని ఉంది.

నన్ను పిలిచింది మీనా.

రాత్రి పదకొండు గంటల వేళ తిండి తిప్పలు లేకుండా అలా నిస్త్రాణగా పడివున్న ఆ అమ్మాయిని చూస్తే నాకు కడుపు తరు క్కుపోయింది. కాని వెళ్ళి కాస్త తినడానికే మైనా ఇచ్చి నాలుగు ఓదార్పు మాటలు చెప్పాలన్నా, ఏ మూలనుంచో సుందరమ్మ చూస్తూనే ఉండటం ఖాయం. అందుకని అలాంటి ప్రయత్నం చేయకుండా, సిగ్గు కలి గినా చేసేదేం లేక లోపలికొచ్చాం.

అన్నట్టుగానే ఇది జరిగిన మూడోరోజు, బాంక్ నుంచి మా ఇంటి ముందునుంచి ఇంటికి వెళ్తున్న ప్రకాశాన్ని రవి కాపేసి మరీ పట్టుకున్నాడు. నేను బాల్కనీలోంచి చూస్తు న్నాను.

"పక్కపక్కనే ఉంటాంగానీ మనం కలవ డమే కుదరదు ఎప్పుడూ. రండి, సార్! కాసేపు కూర్చుని వెళ్దురుగాని" అంటున్నాడు రవి.

"అబ్బే! వెళ్ళాలండీ. ఇంట్లో ఎదురు చూస్తుంటారు" ప్రకాశం నసిగాడు.

మొహమాట పడిపోతున్నాడు. నాకు నవ్వొచ్చింది. ఇంట్లో ఎదురు చూసేది ఎవరూ! మరీ ఇంత మేథకుడా! అనిపిం చింది.

ఏం చెప్పాడో వినిపించలేదు కాని మొత్తా నికి అతన్ని మా ఇంటికి తీసుకొచ్చాడు రవి.

"ఏంటి సార్ విశేషాలు! అయినా మీకేంటి బ్యాంక్ వాళ్ళు కడుపులో కూల్‌డ్రింక్ కదల కుండా కూర్చుంటారు" రవి జోకాడు.

"అది ఒకప్పటి మాటండీ! అప్పట్లో బ్యాంకు ఉద్యోగాలంటే క్రేజ్ ఉండేది. ఇప్పు డన్నీ బాధ్యతలే! ఎక్కువ రిస్కు ఉన్న జాబ్స్‌లో మాదీ ఒకటి" అన్నాడు. బ్యాంక్ సంగతులు, ప్రమోషన్ అవకాశాలు చెప్తు న్నాడు. ఫరవాలేదు భార్య విషయంలో తప్ప మిగిలిన విషయాల్లో చురుగ్గానే ఉన్నాడు అనుకున్నాను.

మీనా వాళ్ళకి కాఫీలు తీసికెళ్ళింది. నేను కూడా వెనకే వెళ్ళాను. "అబ్బే! ఇప్పుడెందు కండీ! ఇంటికే వెళ్తున్నాను కదా!" మొహమా టపడుతూ అన్నాడు.

"ఫరవాలేదు కాఫీయేగా తీసుకోండి. ఇంటికి వెళ్ళిన తర్వాత మళ్ళీ తాగొచ్చు లెండి" రవి గొంతులో కొద్దిగా కొంటెతనం తొంగి చూసింది. అతనికి నన్ను పరిచయం చేశాడు.

అతను చాలా వినయంగా నమస్కరిం చాడు.

ఉన్నట్టుండి రవి "అన్నట్టు మీ అత్తయ్య గారు మీకు పెద్దదిక్కులాగా ఉండి అన్ని చూసుకుంటారనుకుంటాను" అన్నాడు.

వాడి మాటల్లో వ్యంగ్యం గుచ్చుకున్న ట్టుంది. ప్రకాశం కొంచెం చిన్న బుచ్చుకుని.

"అవునండీ! చిన్నప్పటి నుండీ నన్ను ఆమె పెంచింది. నేను పుట్టినప్పుడు మా అమ్మకి చాలా జబ్బు చేసిందట. అందుకని మా అత్తయ్య నాకు తల్లి కాకపోయినా తల్లిలాంటిది" అన్నాడు. పేలవంగా నవ్వుతూ రవి ఆంతర్యం అతనికి అర్థమ యింది.

నేను కల్పించుకున్నాను.

"అంతేకదా బాబూ! కన్న ప్రేమకంటే పెంచిన ప్రేమే ఎక్కువంటారు కదా! మీలాగే మీ భార్య కూడా చాలా నెమ్మదైన అమ్మాయిలా ఉంది" అన్నాను సంభాషణ పొడిగిస్తూ.

అతడికి మా మాటలు దేనికి నాందీ ప్రస్తావనో అర్థం అయింది. అందుకే, "అవు నండీ! మా అత్తయ్యకి నోరు కాస్త ఎక్కువ. మీకు వినిపిస్తూనే ఉంటాయి అనుకుంటా. మా ఇంట్లోని సరాగాలు చిన్నప్పటి నుంచి

ఆమె అంతే! ఆమె ఎక్కడుంటే అక్కడ మిగిలిన వాళ్లు నెమ్మదిగానే ఉంటారు" అన్నాడు అర్థవంతంగా నవ్వుతూ.

"అందరి స్వభావం ఒక్కటిగా ఉండదుగా! ఎవరి తీరు వారిది!" అన్నాను, అతన్ని మరింత నొప్పించకూడదని.

కానీ మా రవి కార్యసాధకుడు కదా. అందుకని దారాన్ని వదలకుండా,

"అవుననుకోండి! ప్రకాశంగారూ! మీరేమీ అనుకోకపోతే ఒక్క మాట. మీ మిసెస్‌ని ప్రతి రోజూ ఏదో విధంగా అల్లరి పెడుతూనే ఉంటుంది. మీరు కాస్త కంట్రోల్ చెయ్యకపోతే ఇంట్లో మన శ్శాంతి ఉండదు కదా! మీరు నేను మీ పర్సనల్ విషయాల్లో జోక్యం చేసుకుంటున్నా.



నని ఏమీ అనుకోకండి. ఏదో నైబర్‌గానే కాకుండా ఫ్రెండ్‌గా నా అభిప్రాయం చెప్పాను"

అబ్బో! మా రవికి లౌక్యం కూడా తెలుసే. నవ్వొచ్చింది నాకు. అయినా అతను నొచ్చుకున్నాడేమో, నేను మాట్లాడదా మనుకున్నాను.

కానీ ప్రకాశమే, "నిజమేనండీ! రోజూ ఏదో విషయంలో గొడవ చేస్తూనే ఉంటుంది. నాకూ తెలుసు. అందరూ ఏమ నుకుంటారో! కానీ ఏంచేయను చెప్పండి. ఆమెకి వ్యతిరేకంగా ఏం మాట్లాడినా నాకు కృతజ్ఞత లేదని, నా కోసం తన జీవితం ధారపోశానని అంటుంది. నన్ను ఎమోషన ల్‌గా బ్లాక్‌మెయిల్ చెయ్యడం ఆమెకి బాగా తెలుసు. నాక్కూడా ఈ విషయంలో ఏం చేయాలో తెలీడం లేదు" అన్నాడు తన మనసులోని బాధను వెళ్ళగక్కుతూ.

"పోనీ నాలుగు రోజులు అలా తీర్థయాత్రలకైనా పంపించండి. ఆమెకి భక్తి, మీకు రక్తీ" అన్నాడు రవి నవ్వుతూ.

"అబ్బే అలాంటివేం పని చేయవండీ. మా ఇల్లే ఆవిడకు వైకుంఠం, కైలాసం అన్నీ. తను లేకపోతే ఇల్లు వల్లకాడయి పోతుం దని మా అత్తయ్య అభిప్రాయం. ఆఖరికి మా ఊరు కూడా వెళ్లదు" అన్నాడు నిస్పృహగా.

ఇంక ఈ సంభాషణ కొనసాగించడం కుసంస్కారమనిపించుకుంటుందనిపించింది. అందుకే నేను కల్పించుకున్నాను.

"ఆమే తెలుసుకుంటుందిలెండి. వేరే వ్యాపకమేదీ లేక ఆమె అలా అయిందేమో! చక్కగా ముగ్గులు పెడ్తారు. మొక్కల్ని పెంచుతారు. అంటే ఈస్థటిక్ సెన్స్ ఉన్నట్టే. ఆ మాత్రం సున్నితత్వం ఉంది కాబట్టి ఏదైనా వ్యాపకం కల్పించవచ్చేమో ఆలోచించు బాబూ! మధ్య నీ భార్య నలిగిపోతోంది కదా!" అన్నాను చనువుగా.

"నిజమేనండీ! నేను కూడా ఆలోచిస్తాను. కాని మా అత్తయ్యకి మీరంటే గురి కుదిరి నట్టుంది. అసలు ఆవిడ ఎక్కడికీ వెళ్లదు. అలాంటిది అప్పుడప్పుడు మీ ఇంటికి వస్తుం టుందట కదా! మీరు కూడా కొంచెం నచ్చ చెప్పండి" అన్నాడు.

అతను అలా మనసు విప్పి మాట్లాడ డంతో మాకు బరువు దిగినట్టనిపించింది. కాసేపు కూర్చొని వెళ్లిపోయాడు ప్రకాశం.

తర్వాత రవి నన్ను చూసి నవ్వుతూ,

"అమ్మా! చిన్నప్పటినుంచీ చూస్తున్నాను కదా! అందరూ నీ దగ్గరికి వచ్చి కష్టసుఖాలు చెప్పుకుంటారు. నువ్వూ నీకు తోచిన సలహాలు ఇస్తూనే ఉంటావు. అలాంటప్పుడు ఈ లేడీ ఇడీ అమీన్‌ని కూడా సంస్కరించి బుద్ధభగవానుడి చెల్లెలిలాగా మార్చేయరాదూ!" అన్నాడు. వాడు హాస్యంగా అన్నా నాలో వాడి మాటలు ఆలోచనలు రేపాయి.

అప్పుడు నేను తేలిగ్గా నవ్వేసినా నాలో అస్పష్టంగా ఉన్న ఆలోచనలు ఒక రూపు దిద్దుకుంటున్నాయి.



రోజులు దొర్లిపోతున్నాయి. నేను గుంటూరు వెళ్ళి చివరి వర్కింగ్‌డేనాడు జాయిన్ అయ్యాను. వేసవి సెలవులు.

గుంటూరు ఎండల్లో ఎందుకక్కడ? ఇక్కడికి వచ్చేయమంటూ రవీ వాళ్లు నేను గుంటూరు వచ్చే ముందే గట్టిగా చెప్పారు.

ఈసారి నేను కూడా హైదరాబాదులోనే

సెలవులు గడపాలని నిశ్చయించుకున్నాను. అందుకే హైదరాబాదు వచ్చేశాను.

ఈసారి ఇంటి వాతావరణంలో ఏదో మార్పు కనిపించింది. నాకు తెలియకూడదని అనుకుంటూ. రవీ, మీనా నా ముందర మామూలుగానే ఉన్నట్టు ప్రవర్తిస్తున్నా వాళ్ళిద్దరూ ఎప్పటిలాగా ఉన్నట్టు నాకనిపించలేదు. నాకుగా నేను తరిచి అడగదల్చుకోలేదు. ఎదిగినవాళ్ళు చదువు, ఇంగితం ఉన్న వాళ్ళు. నేను అనవసరంగా తల దూర్చకపోతే వాళ్ళే సర్దుకుపోతారని నా కనిపించింది.

ఆ రోజు ఆదివారం, పుస్తకాల మీద మనసు నిలవలేదు. రవి ఇంట్లో ఉన్నాడు. వాళ్ళిద్దర్నీ ఏకాంతంగా వదిలివెళ్ళాలని, మాణిక్యమ్మగారూ వాళ్ళని కలిసినట్టూ ఉంటుందని, చాలా రోజుల తర్వాత వాళ్ళింటికి బయల్దేరాను.

శ్రీనివాసరావుగారు హాల్లో ఎదురయ్యారు- ఆయనతో నాకు పెద్దగా పరిచయం పెరగలేదు. చాలా మితభాషి. ఎప్పుడూ ఏదో పుస్తకం చదువుతూనో, టి.వి. చూస్తునో కనిపిస్తారు. కలిసినప్పుడు మాత్రం మర్యాదగా పలకరిస్తారు.

నన్ను చూస్తూనే సోఫాలోంచి లేచి "రండమ్మా! ఇప్పుడు మీ ఆరోగ్యం ఎలా ఉంది? " అంటూ నమస్కరించి సాధారంగా పలకరించారు.

"చాలావరకు తగ్గిందండీ" అన్నాను. నేను ప్రతి నమస్కారం చేసి "అంతేనమ్మా!" ఈ వయసులో ఏం వచ్చినా చిన్నప్పటిలాగ రెసిస్టెన్స్ ఉండదేమో, కోలుకోవడానికి చాలా కాలమే పడ్తుంది" అంటూ "మాణిక్యం"! అని పిలిచారు.

"లోపల వంటింట్లో ఉన్నట్టుంది. నేను పిలుస్తాను. కూర్చోండి" అంటూ లోపలికి వెళ్ళబోయారు. ఇంతలో ఆమె రెండు కప్పుల్లో కాఫీ తీసుకుని వచ్చారు.

"రండి, రండి, ఎలా ఉన్నారూ" ఆప్యాయంగా పలకరిస్తూ కాఫీ కప్పు నాకందించారు.

శ్రీనివాసరావుగారు కాఫీ తాగేసి పక్కగదిలోకి వెళ్ళిపోయారు. "మాధవి కనిపించదేం! ఇంట్లో లేదా? " అన్నాను కాఫీ కప్పు అందుకుంటూ.

"పబ్లిక్ గార్డెన్స్‌లో ఏదో ఫ్లవర్ షో ఉందట, మధ్యాహ్నమే వెళ్ళింది. వచ్చేస్తుంది" అంటూ ఆమె కూడా కాఫీ కప్పు తెచ్చుకుని కూర్చున్నారు. ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నాం. ఉన్నట్టుండి ఆమె లేచి "మా అతుల్ పుట్టినరోజు ఫొటోలు వచ్చాయి" అంటూ ఒక కవరు తీసుకొచ్చి ఇచ్చారు.

నేను కవరు తెరిచి ఫొటోలు చూశాను. అన్ని ఫొటోల్లో చాలా అందంగా నవ్వుతున్నాడు. ముద్దుగా, అంతా మాధవిలాగా ఉన్నాడు. ఆ మాటే మాణిక్యమ్మగారితో అన్నాను. "మాధవి పోలికే అంతా! తల్లి పోలిక కొడుక్కి వస్తే అదృష్టం అంటారు" అన్నాను ఫొటోలు జాగ్రత్తగా కవర్‌లో పెడ్తూ.

"ఏం అదృష్టమండీ! తండ్రి మొహం ఎరగడు కదా! పుట్టకముందే తల్లి అదృష్టాన్ని తుడిచేశాడు" ఆమె కళ్ళు తడి అయ్యాయి. "ఊరుకో! పసివాడు. వాడేం చేస్తాడు. మన రాతలకి వాడిదా బాధ్యత? " ఎప్పుడొచ్చారో శ్రీనివాసరావుగారు పుస్తకాల రాక్‌లోంచి ఒక పుస్తకం తీస్తూ మందలింపుగా అన్నారు.

"వాణ్ణి అంటం కాదండీ! నా కడుపులో బాధకి అలా అన్నాను కానీ వాడిమీద నాకేం పగా" అంటూ కన్నీళ్ళు తడుచుకున్నారు.

"మేం ఉన్నన్నాళ్ళూ చూసుకుంటాం. తర్వాత దాని బతుకెట్లా తెల్లవారుతుంది!" అంది ఆవేదనగా.

నాకేం మాట్లాడాలో తోచలేదు.

కాసేపు మౌనం రాజ్యమేలింది. నేను ఉండబట్టలేక, "చిన్న వయసే కదా! మళ్ళీ

పెళ్ళి చేసేయకపోయారా? పూర్వపు రోజుల్లో అయితే తప్పు పట్టేవారు కానీ ఇప్పుడు అంత కష్టం కాదు కదా!" అన్న తర్వాత అతిగా చొరవ తీసుకున్నానేమోనని పించింది.

"ఈ రోజుల్లో మొదటిసారి పెళ్ళి అవ డమే కష్టమవుతుంటే మళ్ళీ పెళ్ళి ఎక్కడ కుదురుతుందీ! అదీ ఒక పిల్లాడికి తల్లైంది కదా!" మాణిక్యమ్మగారు అన్నారు నిస్పృ హగా.

"మేం ప్రయత్నించటానికైనా అసలు మధు ఒప్పుకుంటే కదమ్మా! ఒకసారి అయిన అనుభవం చాలు అంటూ మొండి కెత్తింది" శ్రీనివాసరావుగారి గొంతులో దుఃఖపు జీర. ఒక్కసారిగా వాతావరణం బరువుగా మారిపోయింది. నేను అనవస రంగా వచ్చి వాళ్ళని ఏడిపించానేమోనని నాకూ చాలా బాధ కలిగింది.

"ఆంటీ! ఎంతసేపైంది వచ్చి? ఆకాశం మేఘావృతమైంది. వర్షం కురిసిందా? " అంటూ మాధవి లోపలికి వచ్చింది.

మా మూడ్స్ పసిగట్టినట్టుంది. తల్లి మొహంలోకి చూసి "ఏంటమ్మా! నా ఫ్లాష్‌బా క్‌లోకి వెళ్ళావా? " అంటూనే "ఆంటీ, ఐదు నిమిషాల్లో వస్తాను" అంటూ లోపలికి వెళ్ళి పోయింది. నేనక్కడ ఉండడం ఇబ్బందిగా ఉంది నాకు. మధు బట్టలు మార్చుకుని వచ్చింది.

"సారీ! నేనొచ్చి అనవసరంగా మానుతున్న గాయాన్ని కెలికాను" అన్నాను గిల్టీగా.

"అదేం లేదు ఆంటీ! ఇది మాకు మామూ లుగా ఉండేదే! మీరేం బాధపడకండి అన్నట్టు మీరు ఇవాళ పబ్లిక్ గార్డెన్స్‌లో మంచి ఫ్లవర్ షో మిస్ అయ్యారు. ఇక చిన్న క్రాష్ కోర్సు కూడా ఉందట" అంది. వాతావరణం కొద్దిగా తేలికపడింది. శ్రీనివా సరావుగారు తన గదిలోకి వెళ్ళారు. మాధ వికి టీ తెస్తానని మాణిక్యమ్మగారు కూడా లోపలికి వెళ్ళిపోయారు. "నా విషయంలో నాన్నగారూ ఇప్పటికే గిల్టీగానే ఫీలవుతు న్నారు ఆంటీ! అమ్మ సరేసరి. వాళ్ళ తర్వాత నా గతేమిటని బాధపడని రోజుం డదు" భారంగా ఉంది మాధవి గొంతు.

"అది సహజమేగా మధూ! ఏ తల్లిదండ్రు లైనా పిల్లల క్షేమం, సుఖమేగా కోరుకుం టారు" అన్నాను.

"ఇప్పుడు మాత్రం నాకేం లోటు చెప్పండి. మంచి ఉద్యోగం ఉంది, తోడుకి మా అతుల్ ఉన్నాడు" అంది.

ఆమె చేతిని నా చేతిలోకి తీసుకున్నాను. "మధూ! నువ్వేమనుకోకపోతే ఒక మాట చెప్పనా? అసలు నువ్వెందుకిలా మోడు లాగా ఉండాలి? నీకేం తక్కువ? అంతగా అయితే మీ అబ్బాయి బాధ్యత అమ్మావాళ్ళు చూసుకుంటారు. నువ్వెందుకు మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదూ!" చిన్నగా అడిగాను. "అతుల్ సమస్య కాదు. ఒకసారి అయిన అనుభవం చాలదా జీవితాంతం గుర్తుండి పోవడానికి. అడుసు తొక్కనేల కాలు కడగ నేలా అన్నారుగా పెద్దలు" అంది పేలవంగా నవ్వుతూ.

"ఆ పెద్దలే ధైర్యే సాహసే లక్ష్మి అని కూడా అన్నారు కానీ, నీకు ఏం జరిగిందో నాకు తెలీదు కాని గతం గతః అని భవిష్య త్‌కి పునాదులు వేసుకోవడం అంత కుదరని పనా ఏమిటి? " మృదువుగా అడిగాను.

"మీరు పరిచయమైన క్షణం ఎలాంటిదో కానీ, ఎన్నో ఏళ్లనుండీ తెలిసినట్టున్నారు. మీకు నా గురించి చెప్పాలి ఆంటీ!" అంది ఆర్ద్రంగా

"నాక్కూడా ఎన్నోసార్లు నీలాంటి కూతురు ఉంటే బాగుండు అనిపిస్తుంది నిన్ను చూస్తే" అన్నాను.

మాణిక్యమ్మగారు మాధవికి టీ అందిం చింది. "అసలు దాని బతుకిలా అవడానికి మా తొందరపాటే కారణం, లలితమ్మగారూ! మేం చేసిన దానికి అది ఫలితం అనుభవి స్తోంది" అంది డగ్గుత్తికతో.

"ఆంటీ! నా కథలో సినిమాకి పనికి వచ్చే ఎలిమెంట్ ఉంది. వినడానికి మీకు ఓపిక ఉందా? " నవ్వుతూ అడిగింది మాధవి.

"ఓపిగ్గా నువ్వు భరించినప్పుడు వినటానికి నాకు ఓపిక ఉండదా? " అభిమానంగా ఆమెకేసి చూశాను.

"అసలు ఆ సంబంధం, ఆ మాటకొస్తే అప్పుడు పెళ్ళి చేయడం నాకు సుతరామూ ఇష్టం లేదండీ! వాళ్ళ నాన్నగారే పట్టుపట్టి చేశారు" మాణిక్యమ్మ గొంతులో నిష్ఠూరం.

"అమ్మా! అవసరంగా నాన్నగార్ని తప్పు పట్టావెందుకు? అలా జరగాల్సి ఉంది, జరిగింది అంతే"

"అంతేలే! ఆ వేదాంతమే చివరికి నీకు మిగిలేటట్టుంది. ఆయన మీద ఈగ కూడా వాలనివ్వడు. మా అత్తగారికి తోడుగా ఉంటుందని దీన్ని దుగ్గిరాల్లో ఉంచాం. ఆవిడ బాగా పెద్దవారు వచ్చే ప్రాణం, పోయే ప్రాణంగా ఉండేది.

తను పోయేలోగా దీని పెళ్ళి చూడాలని పట్టు పట్టారు. దానికేమో పదహారు ఏళ్ళైనా లేవు. పదో తరగతి చదువుతోంది. అప్పటికప్పుడు సంబంధం కుదరాలంటే దొరకద్దూ! మాధవి మామగారు వారితో కలిసి పని చేశారు. ఇద్దరూ సెంట్రల్ ఎక్సైజ్ డిపార్టుమెంటే! పైగా స్నేహం కూడా ఉంది. ఆయనకి మా అల్లుడు ఒక్కడే కొడుకు. ఆ అబ్బాయి తల్లి చిన్నప్పుడే పోయింది. ఆయన మళ్ళీ పెళ్ళి చేసుకున్నారు కానీ ఆ సంబంధానికి పిల్లల్లేరు. ఆస్తిపరులు. ఒక్కడే కొడుకు. చదువుకున్నాడు. ఉద్యోగస్తుడు. అస్సాంలో టీ ప్లాంటేషన్‌లో మేనేజరుట! స్నేహితులతో సంబంధమని ఇతరత్రా విచారించను కూడా లేదు. కుదిర్చేశారు. నాకసలు దాన్ని బాగా చదివించాలని ఉండేది. అంత చిన్న వయసులో పెళ్ళి చెయ్యడమే ఇష్టం లేదు. పైగా పిల్ల కళ్ళ ముందు ఉండకుండా అల్లుడికి అక్కడెక్కడో ఉద్యోగం. అంత దూరం పిల్లను పంపించడం నాకైతే సుతరాము ఇష్టం లేదు. కాని మా అత్తగారు తొందర పడుతోందని, వంక పెట్టలేని సంబంధమని నన్ను మాట్లాడనివ్వలేదు. ఇంతా చేసి అది అక్కడ సుఖపడిందేం లేదు" ఆవిడకు ఏడుపొచ్చేసింది.

"ఊరుకోండి!" అన్నాను నేను.

"ఊరుకోక చేసేదేముందండీ" అంటూ కళ్ళు తుడుచుకున్నారు.

మాధవి కల్పించుకుంది.

"అమ్మా! నేను చెప్తాను కాని నువ్వు ఇంకేం మాట్లాడకు" అంది.



నేను టెన్త్‌క్లాసు పరీక్షలు రాయగానే, నాకు పెళ్ళి అన్నారు. నాకు ఇంకా చదువుకోవాలని ఉన్నా నాన్నగారు, మా నాయనమ్మ పరిస్థితి, ఆమె కోరిక వివరంగా చెప్పిన తర్వాత నేను కాదనలేకపోయాను.

పెళ్ళికొడుకు వచ్చాడు. చూశాడు(ట) నాకు సిగ్గేసింది. అయినా చూశాననుకోండి. బావున్నాడు. యద్దనపూడి సులోచనారాణి గారి రాజశేఖరంలా ఉన్నాడని, మా ఫ్రెండ్స్ కూడా సర్టిఫై చేశారు. ఆయన పేరు కూడా అదేనట. అప్పట్లో మేమంతా 'సెక్రెటరీ' నవలని భగవద్గీత లాగా పారాయణం చేసేవాళ్ళంలెండి" మధు చెప్పే తీరుకు నాకు నవ్వొచ్చింది.

"పట్టుచీరలు, నగలు, అందరూ నన్ను ప్రత్యేకంగా మహారాణి లాగా చూడడం, ఏదో మరో లోకంలో ఉన్నట్టుంది నాకు ఆ పెళ్ళి వారం రోజులూ! దుగ్గిరాలలో నా

పెళ్ళి జరిగినంత ఘనంగా అప్పటివరకూ ఎవరిదీ జరగలేదట. పెళ్ళైన వెంటనే మా అత్తగారి ఊరు కైకలూరు వెళ్ళాం. మళ్లీ దుగ్గిరాల వచ్చి రాగానే సెలవుల్లేవనీ, మళ్లీ ఇప్పట్లో రావడం కుదరదనీ ఆయన అన్నారు. అందుకని నన్ను ఆయనతో కాపు రానికి పంపడానికి ఏర్పాట్లు చేశారు. మా నాయనమ్మకి సీరియస్‌గా ఉండడంతో ఆమెని వదిలి మా అమ్మ నాతో అంత దూరం రావడం కుదిరే పని కాదు. మా అత్తగారు అదే! మా వారి సవతి తల్లి వద్దా మనుకున్నారు. కానీ ప్రయాణం రెండు రోజులుండనగా కాలు జారి బాత్‌రూంలో పడ్డారు. కాలు విరిగి ఆమె మంచమెక్కారు. అలా నాతో రావడం ఎవరికీ కుదరలేదు.

"కాసిని రోజులు హాయిగా నన్ను దుగ్గిరా లలోనే ఉండనివ్వొచ్చుగా!" అనుకున్నాను. కానీ ఆయన నన్ను వెంటనే తీసుకెళ్తానని పట్టుబట్టారు. అల్లుడుగారికి కోపం వస్తుం దని, బాధగానే ఉన్నా అమ్మా, నాన్నగారూ నన్ను ఆయనతో పంపించెయ్యడానికి నిశ్చ యించారు. అలా గౌహతి దగ్గర్లోని టీ ప్లాంటేషన్‌కి నా ప్రయాణం సాగింది. అలా రోజుల తరబడి ప్రయాణం చెయ్యడం నాకు అదే మొదటిసారి. ఆయన కొంచెం సీరియ స్‌గా ఉండేవారు. వయసు కూడా పది సంవత్సరాలు తేడా ఉంది. నాక్కూడా ఆయ నని చూస్తే భయమేసేది. ఏవేవో కథల పుస్తకాలు అన్నీ తెలుగువే కొన్నారు.

నా పని ఆ పుస్తకాలు చదువుకోవడం, టైం ప్రకారం తినడానికి తిండి పెట్టేవారు. అవి తినడం, కిటికీలోంచి బయటికి చూస్తూ కూర్చోవడం, ఇవన్నీ విసుగు పుట్టినప్పుడు కునికిపాట్లు పడడం. ఆయనకి సిగరెట్ అల వాటుంది. ఐదు నిమిషాలకొకటి కాలుస్తూ ఏదో పరీక్ష కెళ్లేవాళ్లలాగా దీక్షగా ఇంగ్లీషు పేపరు చదివేవారు. మధ్య మధ్య 'చలే స్తోందా! స్వెట్టర్ వేసుకో, షాల్ కప్పుకో! ఆక లేస్తోందా!... కిటికి షట్టర్ వేసుకో!' ఇలాంటి చిన్న చిన్న పలకరింపులు, సూచనలు ఉండే వనుకోండి! అలా సాగింది మా ప్రయాణం. కంపార్టుమెంట్‌లో అందరూ నాకేసి వింతగా చూసేవాళ్ళు.

స్టేషన్‌కు ఆయన కింద పని చేసేవాళ్ళు వచ్చారు. నాకు తెలుగు తప్ప వేరే భాష రాదు. ఇంగ్లీషు కొంచెం అర్థం అయ్యేది. కాని పల్లెటూరిలో చదువుకదా! మాట్లాడ్డం రాదు. ఈయన వాళ్లతో హిందీనో అస్సా మీనో నాకు తెలీదు కానీ బాగా మాట్లా డారు. నాకు నోరు కుట్టేసినట్టయింది. వాళ్లే సామానంతా వెంట తెచ్చిన వ్యాన్‌లో సర్దే శారు. మేం జీపులో గంట ప్రయాణం చేశాక ప్లాంటేషన్ దగ్గరికి వచ్చాం. వాతావ రణం చాలా చల్లగా ఉంది. అప్పటివరకు నేను టీ తోటలు సినిమాల్లో చూడడమే! ఎత్తుగా ఉన్న దేవదారు చెట్ల మధ్యగా వెళ్ళి చిన్న బంగళాలాగా ఉన్న ఇంటి ముందు ఆగింది మా జీపు.

"దిగు. ఇదే మన ఇల్లు" అన్నారు తను దిగి నాకు చేయి అందిస్తూ.

ఆయన 'మన ఇల్లు' అంటుంటే కొత్తగా, వింతగా అనిపించింది. అక్కడ పనివాళ్ళు సామాను లోపలికి తెచ్చారు.

ఇద్దరు ఆడవాళ్ళు, ఒకామెకి దాదాపు నలభై ఏళ్ళ వయసుంటుంది. మరొకామె నాకంటే కొంచెం పెద్ద అయి ఉండొచ్చు ఇద్దరూ నా దగ్గరగా వచ్చి పరిశీలనగా చూస్తున్నారు. నాకు సిగ్గుగా ఉంది. లోప లికి రమ్మని సైగ చేశారు. వాళ్ల చీర తమా షాగా చుట్టినట్లు కట్టుకున్నారు.

"రా!" అంటూ ఆయన ముందు నడి చారు.

ఆయన వెనకే గృహప్రవేశం చేశాను. ఆ మధ్యవయస్కురాలు ప్లాంటేషన్‌లో లేబరు. గిన్నెలు తోమడం, ఇల్లు తుడవడం, బట్టలు ఉతకడం లాంటి పనులు చేసి వెళ్లిపోతుం దట. నా వయసమ్మాయి మాత్రం వంటా వార్పు చూస్తూ ఇక్కడే ఉంటుందట.

రాత్రిళ్ళు కూడా ఇక్కడే నాకు తోడుగా ఉంటుందట. జీపు దిగి ఇంట్లో పది నిమిషాలు కూర్చుని ఆఫీసులో పని చూసుకుని మళ్లీ వస్తానని ఆయన వెళ్లిపోయారు.

నేను ఇల్లంతా తిరిగి చూశాను. మేడ మీద రెండు గదులున్నాయి. ఒకటి ఆయన బెడ్ రూం అంటే ఇక నుంచి 'మా' బెడ్ రూం అన్నమాట. అక్కడ డబుల్ బెడ్, బట్టల బీరువా, చిన్న టేబుల్ గోడ వారగా సోఫా ఉన్నాయి. నా సామాను ఆ గది లోనే పెట్టారు. రెండో గది కొంచెం చిన్నది. అక్కడ ఆయన ఆఫీసు పని, చదువు కోవడం లాంటివి చేస్తారట. బల్లమీద కంప్యూటరు, పక్కనే ఒక చిన్న చెక్క బీరువా ఉన్నాయి. మిగతాది ఖాళీ ప్రదేశం. గదుల గోడలు చెక్కవి లాగా ఉన్నాయి. పైకప్పు ఏటవాలుగా ఉంది. డాబా మీద కాసేపు తిరిగాను. టీ తోటలు దూరంగా విస్తరించి ఉన్నాయి. సూర్యుడు పడమట వాలి పోతున్నాడు.

కిందికి వచ్చాను. పైన కంటే కింద విశాలంగా ఉంది. ముందు చిన్న వరండా. అది దాటితే ఒక హాలు. అక్కడ టివి ఉంది. దానికి ఎదురుగా సోఫాలు, మధ్యలో టీపాయి మీద టెలిఫోను. అది దాటితే డైనింగ్ హాలు. అక్కడ గుండ్రంగా ఉన్న డైనింగ్ టేబుల్. దాని చుట్టూ కుర్చీలు ఉన్నాయి. గదికి ఎడమ వేపు ఎటాచ్డ్ బాత్‌రూం కుడి వైపు వంట గది ఉంది. అన్ని వస్తువులు చక్కగా అమర్చి ఉన్నాయి. స్టౌ, మిక్సీ, ఎలక్ట్రిక్ ఓవన్ కూడా ఉన్నాయి. గిన్నెలన్నీ శుభ్రంగా సర్ది ఉన్నాయి. వంట గది వెనకగా చిన్న గది ఉంది. అక్కడే ఆ అమ్మాయి అంటే బసంతి ఉంటుందిట. చిన్న చెక్క మంచం, దాని మీద పరుపు, దుప్పటి, నీట్‌గా మడత పెట్టిన బొంత లాంటిది ఉంది. ఇలాంటిదే పైన గదిలో కూడా ఉంది. దాన్ని 'రొజాయ్' అంటారని ఆయన తర్వాత చెప్పారు. అక్కడ చలికి దుప్పట్లు, శాలువాలు కూడా ఆగవట. పక్కనే కుంపటిలో బొగ్గులున్నాయి. అక్కడ కుంపటి ఎందుకో నా కర్థం కాలేదు.

బసంతి వంట చేస్తోంది. నేను స్నేహంగా నవ్వాను. బదులుగా నవ్వకుండా నాకేసి దీర్ఘంగా చూసింది. నాకు బోర్ కొట్టి ఇవతలికి వచ్చేశాను. ఇంటి చుట్టూ గోడలేదు.

నాకు చాలా అలసటగా అన్పించి స్నానం చేశాను. సినిమాల్లో, నవలల్లో మొదటి రాత్రి సీన్లు చాలా తెలుసు నాకు. నేను తెల్లచీర కట్టుకుని పూలు పెట్టుకోవాలి కదా! పళ్ళు, స్వీట్లు అన్నీ పెడ్తారు కదా! అవన్నీ అయన వచ్చిన తర్వాత చేయిస్తారేమోనని చాలా సేపు నిద్ర బలవంతంగా ఆపుకుని ఎదురు చూశాను. కానీ ప్రయాణ బడలిక ఆపైన వేడినీళ్ళ స్నానం చేయడంతో ఒళ్ళు తెలియని నిద్ర పట్టేసింది.

నేను తెల్లచీర కట్టుకుని పూలు పెట్టుకోవాలి కదా! పళ్ళు స్వీట్లు అన్నీ పెడ్తారు కదా! అవన్నీ అయన వచ్చిన తర్వాత చేయి స్తారేమోనని చాలాసేపు నిద్ర బలవంతంగా ఆపుకుని ఎదురు చూశాను



మర్నాడు నేను నిద్ర లేచేసరికి బాగా పొద్దెక్కిపోయింది. రాత్రి ఆయన వచ్చి చూశారేమో! నిద్రపోతున్నానని కోపం వచ్చిందేమోనని భయం వేసింది. గబగబా నా పనులు పూర్తిచేసుకుని కిందకి వచ్చాను. ఆయన ఎక్కడా కనిపించలేదు. బసంతి డైనింగ్ టేబుల్ తుడుస్తోంది. సైగలతో ఆమెని "ఆయన వెళ్ళిపోయారా? " అని అడిగాను. ఆమె కూడా సైగలతోనే పొద్దున్నే వెళ్ళిపోయారని చెప్పింది. నాకు టిఫిన్ పెట్టింది. రాత్రి కూడా ఏం తినలేదు. బాగా ఆకలి మీద ఉన్నానేమో అంతా తినేశాను. తర్వాత ఏం చేయాలో తోచలేదు. చదువుకోవడానికి పుస్తకాలేమైనా దొరుకుతాయోమోనని అన్ని గదుల్లో వెతికాను. పుస్తకం కాదుకదా కనీసం న్యూస్ పేపర్ కూడా ఎక్కడా కనిపించలేదు. అప్పుడు నిజంగా అడవిలో ఉన్నానేమోనని భయం వేసింది. అమ్మ, నాన్నగారు, నాయనమ్మ, దుగ్గిరాలలోని నా స్నేహితురాళ్ళు అందరూ గుర్తొచ్చారు. బెంగగా అనిపించింది.

ఆయన వచ్చేవరకు ఈ బసంతితోటే కాలక్షేపం చేయాలి కాబోలు. నాకు నవ్వొచ్చింది. ఆయన వచ్చినా నా బెంగ ఎలా తీరుతుంది? ఆయన కూడా నాకు కొత్తే కదా! కొత్తగా పెళ్లైనవాళ్ళు సరదాగా కబుర్లు చెప్పుకుంటారట.. పాటలు పాడుకోకపోయినా ఒకరి కళ్లలోకి మరొకరు చూసుకుంటూ అయినా ఉండాలి కదా! కాస్త కొత్త తగ్గితే మేము కూడా అలాగే ఉంటామేమోనని నాకు నేను సమాధానపడి వంటింటి దగ్గరకొచ్చాను.

బసంతి చాలా నిశ్శబ్దంగా పనిచేసుకుంటోంది. నన్ను చూసినా పట్టించుకోలేదు. నేను ఏదేనా సాయం చేద్దామని ప్రయత్నించాను. "నేను చేసుకుంటా"నని నాకు అర్థమయ్యేలా సైగలు చేసింది. ఈ సైగల భాష, ఆమె వైఖరి నాకు విసుగు పుట్టించాయి. డైనింగు టేబుల్ దగ్గర కుర్చీలో కూర్చుని ఆమెనే గమనించసాగాను. బసంతి చాలా బావుంది. పచ్చగా దబ్బపండు రంగులో చిన్న కళ్ళతో నల్లని జుట్టుతో అంత పొడుగు, పొట్టి కాకుండా అందంగానే ఉంది. కాసేపైన తర్వాత అదీ బోరు కొట్టింది. ఏం చేయాలో తోచలేదు. లేచి హాల్లోకి వచ్చి టీవీ ఆన్ చేశాను. ఏవో హిందీ ప్రోగ్రాములు. నాకు అసలే హిందీలో ఎప్పుడూ పాస్ మార్కులు కూడా రాలేదు. ఎలా వస్తాయి? పరీక్షల్లో ఏదైనా తెలుగు మాటకి హిందీ మాట తెలీకపోతే తెలుగు మాటనే నా సొంత ఆలోచనతో హిందీలాగా రాసేదాన్ని కదా అంటే! 'ఇల్లు' అనే మాటని 'ఇల్'లాగా అన్నమాట!

నిజంగానే ఆ ప్రోగ్రాం ఏ మీ అర్థం కాలేదు. ఆఫ్ చేసి ఈ పాటికి



అమ్మావాళ్ళు ఏం చేస్తుంటారో, నాయనమ్మ ఎలా ఉందోనని ఆలోచిస్తూ అలాగే కూర్చుండిపోయాను.

మధ్యాహ్నం ఒంటిగంట దాటిన తర్వాత ఆయన వచ్చారు. వస్తూనే,

"బోర్ కొట్టిందా? టిఫిన్ తిన్నావా? " అంటూ నవ్వుతూ పలకరించారు. ఆయన నవ్వుతుంటే చాలా బావున్నారు. ఆయన నవ్వు చూసి నాకు కాస్త ధైర్యం వచ్చింది.

"పొద్దున మీరు లేవగానే నన్నూ లేపకపో యారా? నాకు భలే నిద్రపట్టింది. అసలు ఎప్పుడూ నేను అంత లేటుగా లేవను సారీ!" అంటూ అడక్కపోయినా సంజా యిషీ ఇచ్చాను.

ఆయన నవ్వేశారు "రా! భోంచేద్దాం" అంటూ లోపలికి నడిచారు. ఇద్దరికీ భోజనం పెట్టింది బసంతి.

ఆయన మౌనంగా భోజనం చేస్తున్నారు.

"ఈ బసంతి మూగదా, మాటలు రావా? " గుసగుసగా ఆయన్ని అడిగాను. ఆయన మళ్ళీ నవ్వి, "అదేం లేదు, నువ్వు ఇంకా కొత్తకదా! అన్నట్టు పొద్దుటి నుంచి ఏం చేశావు? " అన్నారు.

"ఏం చేస్తాను. బసంతితో మాట్లాడదా మంటే నాకు తన భాష రాదు. తనకి తెలుగు రాదు. టి.వి. చూద్దామంటే అన్నీ హిందీ, అస్సామీ కాబోలు ఆ ప్రోగ్రాములే! పోనీ ఏదైనా పుస్తకం చదువుదామంటే ఒక్కటీ కనబడలేదు. అవునూ! మీరు న్యూస్ పేపర్ కూడా తెప్పించరా? " పొద్దు ట్నించీ మాట్లాడ్డానికి మనిషి దొరక్క మొహం వాచిపోయానేమో, మాటలు ప్రవా హం లాగా వచ్చాయి.

"పేపరు ఆఫీసుకి వస్తుంది. నీకు కావా లంటే ఇంటికి పంపిస్తాను. అయితే తెలు గువి దొరకడం కష్టం" అన్నారు.



"ఈ బసంతి వంట బాగానే చేస్తుందే. మీరు నేర్పించారా? " అన్నిటికి ఆయన చిరు నవ్వే నాకు సమాధానం.

భోజనాలయ్యాక ఆయన మేడ మీదకు వెళ్ళిపోయారు. నేను కంచాలు సింక్‌లో ప డేసి, టేబుల్ తుడవబోతుంటే బసంతి వచ్చి ఆ పని చేసేసింది. నేను కూడా మేడ మీదికి వెళ్ళాను.

ఆయన మంచం మీద పడుకుని ఉన్నా రు. నేను రావడం చూసి సర్దుకుని నాకు చోటు చూపిస్తూ.

"రా! కూర్చో" అన్నారు. నేను బెరుగ్గానే వెళ్ళి కూర్చున్నాను. ఆయన నా ఫ్రెండ్స్ గురించి, నా చదువు గురించి అడిగి తెలు సుకున్నారు. తర్వాత అక్కడి వాతావరణం గురించి, వర్షాల గురించి, తన పని గురించి కూడా చెప్పారు అలా చెప్తూనే, "నేను నిద్ర పోతాను, మూడు గంటలకు లేపు. బసంతి ఇంటికి వెళ్ళి ఉంటుంది. నీకు టీ చేయడం వచ్చా? " నా సమాధానం కోసం ఎదురు చూడకుండానే.

"ఒకవేళ ఆ టైముకి బసంతి రాకపోతే నువ్వే టీ చెయ్యి" అంటూ అటు తిరిగి పడు కున్నారు. ఒక క్షణం ఆగి ఇటు తిరిగి మళ్ళీ "నేను ఆఫీసు నుంచి వచ్చేసరికి అరు గంట లు దాటుతుంది. ఇవాళ్టికి ఎలాగోలా కాల క్షేపం చెయ్యి. రేపు గౌహతి వెళ్ళేవాళ్ళతో ఎవరితోనైనా తెలుగు పుస్తకాలు, క్యాసెట్స్ దొరుకుతాయేమో తెప్పిస్తాను" అన్నారు

"బసంతి ఎక్కడికి వెళ్ళింది? "

"వాళ్ళ అమ్మ, అన్నయ్యలు మన ప్లాంటే షన్‌లోనే పనిచేస్తారు. ఇక్కడికి దగ్గర్లోనే ఉంది వాళ్ళిల్లు కూడా. అందుకని ఎప్పుడైనా తీరిక దొరికితే అక్కడికి వెళ్తుంటుంది" అన్నారు. మళ్ళీ అటు తిరిగి పడుకుంటూ మరో ఐదు నిమిషాల్లో ఆయన గురక చిన్నగా వినిపించింది. నాకేం చేయాలో తోచలేదు. ఆయనకి దూరంగా ఆ మంచం మీదే ఒక పక్కగా ముడుచుకుని పడుకు న్నాను. సరిగా పరిచయమైనా లేని మగవా రితో అలా పడుకోవడం సిగ్గుగా, ఇబ్బందిగా అనిపించింది. నిద్ర పట్టలేదు. ఆయనకేసి చూస్తూ పడుకున్నాను.

"ఇదేమిటీ, ఆయన నన్ను ముట్టుకోవడమే లేదు. ఇదేం పెళ్ళో!" అలా ఆలోచిస్తుండ గానే మూడు గంటలయింది.

ఆయన లేచేలోగా టీ తయారుచేసి రెడీగా ఉంచి అప్పుడు లేపుదామని గబగబా కిందికి వచ్చాను. కానీ నాకు టీ ఎలా చేయాలో అసలు తెలీదు. మా ఊళ్ళో అందరం కాఫీయే తాగేవాళ్ళం. ఊహించి చేద్దామని, రాదంటే ఆయనకి కోపం వస్తుం దని అనుకున్నాను.

అయితే అప్పటికే ఎప్పుడొచ్చిందో బసంతి టీ తయారుచేసి కప్పుల్లో పోస్తోంది.

టీ తీసుకుని నేను పైకి వెళ్లేసరికి ఆయన లేచి డ్రస్ వేసుకుంటున్నారు. నేను టీ అందించాను. ఒక గుక్క తాగి, "బసంతి వచ్చేసిందా? " అడిగారు. ఏదో ఆలోచిస్తూ తలూపాను నేను. ఆ అమ్మాయి అప్పుడే రావడం నాకెందుకో నచ్చలేదు. "మాధవీ! నా ఆఫీసు టైము ఇలాగే ఉంటుంది. ఖచ్చి తంగా ఉదయం పదినించి సాయంత్రం ఐదు వరకు అని ఉండదు. మధ్యలో కూడా వెళ్తుంటాను. ఒక్కోసారి రాత్రి పొద్దు పోతుంది. వీటన్నింటికి నువ్వు అలవాటు పడాలి" అన్నారు జుట్టు దువ్వుకుంటూ. తర్వాత ఆయన వెళ్ళిపోయారు.

మళ్లీ నేను నా ఒంటరితనం మిగిలాము.

కిందికి వెళ్లాను. డైనింగ్ హాలులో బసంతి బ్రౌన్ కలర్ ఊలుతో స్వెట్టర్ అల్లు తోంది.

నన్ను చూసి లేచి నిలబడింది. నేను వెళ్ళి తన పక్కనే కూర్చుంటూ నాకు కూడా నేర్పమని సైగలతోనే అడిగాను.

అల్లిక వేసి చూపించి, ప్రయత్నించమని నా చేతికి ఇచ్చింది.

నాకు చిన్నప్పటి నుంచి కుట్లు, అల్లికలు

## దిగ్దంతులు అంటే...



విశ్వనాథ సత్యనారాయణ, గిడుగురామ్మూర్తి పంతులు తదితరులను కృష్ణశాస్త్రి అవకాశం దొరికినప్పుడల్లా 'వారికేం? దిగ్దంతులు..' అనేవారు. దీనికి అర్థం దిగ్గజాలు అని పైకి కన్పించినా అసలు రహస్యం వేరే ఉంది. ఆ పదానికి దిక్కులే దంతాలుగా కలవారు అన్న అర్థంలో వాడేవారు.

అంటే పళ్లూడిన ముసలివారిగా ఆయన వారిని ఆటపట్టించే వారన్నమాట.

చాలా ఇష్టం. అందుకేనేమో త్వరగానే నేర్చుకున్నాను.

ఆమె మొదటిసారిగా నన్ను అభినందిస్తున్నట్టు నవ్వింది.

"అమ్మయ్య! ఫ్రెండ్ అయిందిరా బాబూ!" అనుకున్నాను.

ఈ సైగల భాష సరదాగానే ఉంది. ఇంటికి మళ్లీ నేను వెళ్తే ఈ సైగలతోనే అందరితో మాట్లాడతానేమోనని నాకు నవ్వొచ్చింది. అప్పటికప్పుడే నేను కూడా వూలు, అల్లిక సూదులు తెప్పించుకుని స్వెట్టరు అల్లి ఆయనకి ప్రెజెంట్ చెయ్యాలని నిర్ణయించుకున్నాను. సాయంత్రం స్నానం చేసి తయారయి ఆయన కోసం ఎదురు చూస్తున్నాను.

రాత్రి ఏడు గంటలకు వచ్చారు. స్నానం చేసి హాల్లో టి.వి. చూస్తూ కూర్చున్నారు. నేను వెళ్ళి ఆయన పక్కనే కూర్చుంటూ

"నాకు కాస్త ఊలు, అల్లిక సూదులు తెప్పించి పెట్టండి" అన్నాను.

"నీకు అల్లడం వచ్చా? " ఆశ్చర్యంగా అడిగారు.

"ఆ బసంతి దగ్గర నేర్చుకున్నాను. తను పనిలో ఉన్నప్పుడు కొంచెం నేనే అల్లాను" అన్నాను.

"అంత త్వరగా నేర్చేసుకున్నావా? వెరీ గుడ్, ఏ కలర్స్ కావాలో చెప్పు. అలాగే తెప్పిస్తాను" అన్నారు మెచ్చుకోలుగా.

నాకు ఏనుగెక్కినంత సంబరం కలిగింది.

ఉన్నట్టుండి బయట వర్షం మొదలైంది. చలిగా కూడా ఉంది.

"ఇక్కడ వెదర్ ఇలాగే ఉంటుంది. వర్షం ఎప్పుడు వస్తుందో చెప్పలేం!" అన్నారు. కిటికీ బయట ముత్యాల సరాల్లాగా ధారగా పడుతున్న వర్షంకేసి చూస్తూ, లేచి హీటర్ ఆన్ చేశారు. గదిలోకి వెచ్చదనం వచ్చింది.

రాత్రి ఎనిమిదిన్నరకి భోజనం చేశాం. రాత్రి తొమ్మిది గంటలకు టి.వి.లో ఇంగ్లీష్ న్యూస్ చూసి ఆయన పైకి వెళ్లారు. వంటిల్లు శుభ్రం చేయడం అయిందేమో. బసంతి పడుకున్నట్టుంది. అలికిడి లేదు. నేను కూడా మేడ మీదికి వెళ్లాను. ఆయన నైట్ గౌన్ వేసుకుని పడుకున్నారు.

నేను కొంచెం తటపటాయిస్తూ గుమ్మం దగ్గరే నిల్చున్నాను. లోపలికి వెళ్ళాలంటే బెరుగ్గా అనిపించింది.

"రా! అక్కడే నిలబడ్డావేం? " అన్నారు. నేను వెళ్ళి కూర్చున్నాను.

"నీకీ చీర చాలా బావుంది. నాన్నగారూ వాళ్లతో రేపు మాట్లాడతావా? పొద్దున్నే నేను కాల్ బుక్ చేస్తాను. మనం దిగగానే క్షేమంగా చేరినట్టు నేను ఫోన్ చేశాన్లే.

ఇప్పుడు మీ నాయనమ్మగారికి కాస్త నయంగానే ఉందట" అన్నారు నా వంక చూడకుండా దిండు సరి చేసుకుంటూ.

నేను తల దించుకుని కూర్చున్నాను. ఎక్కడో ఏదో అపసవ్యంగా ఉన్నట్టనిపించింది.

"నిద్రొస్తోందా! పడుకో" అన్నారు దిండు నాకేసి జరుపుతూ.

"సారీ! హీటర్ ఆన్ చెయ్యడం మర్చిపోయాను. చలేస్తోందా?" అంటూ లేచి హీటర్ ఆన్ చేసి మంచం దగ్గరకు రాకుండా సిగరెట్ వెలిగించి, కిటికీ దగ్గర నిలబడి బయటికి చూస్తున్నారు.

నేను ఆయన్నే చూస్తున్నాను. ఈయన నాతో మామయ్యలాగానో, బాబాయిలాగానో ప్రవర్తిస్తున్నారేంటి? అందరూ ఇలాగే ఉంటారా?

నాకేం అర్థం కాలేదు.

అలా చూస్తుండగానే నాకు నిద్ర పట్టేసింది. ఆయన ఎప్పుడు వచ్చి పడుకున్నారో తెలీదు.

హఠాత్తుగా మెలుకువ వచ్చింది. ఒక్క క్షణం ఎక్కడున్నానో అర్థం కాలేదు. టైమ్ ఒంటి గంట అవుతోంది. పక్కన చూశాను.

ఆయన లేరు. బయట వర్షం ఎక్కువైంది. ఆయన బాత్‌రూంలో ఉన్నారేమోనని కాసేపు ఎదురుచూశాను. వర్షం చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది.

నాకు భయం వేసింది. లేచి ఆయన స్టడీ రూం దగ్గరికి వచ్చి నెమ్మదిగా తలుపు నెట్టాను. చీకటిగా ఉంది. ఆయన లేరు. నెమ్మదిగా కిందికి దిగి వచ్చాను. హాల్లోనూ లేరు. డైనింగ్ హాలు, వంటిల్లు ఖాళీగా ఉన్నాయి. నా గుండె చప్పుడు నాకే వినిపిస్తోంది.

చీకటిగా ఉంది. ఆయన లేరు. నెమ్మదిగా కిందికి దిగి వచ్చాను. హాల్లోనూ లేరు. డైనింగ్ హాలు. వంటిల్లు ఖాళీగా ఖాళీగా ఉన్నాయి. నా గుండె చప్పుడు నాకే వినిపిస్తోంది

ఇంతలో సన్నగా ఎవరో ఏడుస్తున్నట్టు వినిపించింది. బసంతి గుర్తొచ్చింది. పాపం! తనకి కూడా భయమేస్తోందేమో. ఆయన వచ్చేవరకు నేను కూడా తన గదిలోనే కూర్చుందామని అనుకుంటూ వేసివున్న బసంతి గది తలుపులు చిన్నగా నెట్టాను. నైట్ బల్బు వెలుగుతోంది.

బసంతి ఆయన ఒకరికొకరు అతి దగ్గరగా హత్తుకుని పడుకున్నారు. బసంతి చుట్టూ ఆయన చేతులు, ఆమె ఏడుస్తోంది. ఆయన ఏదో చిన్నగా అంటున్నారు.

ఒక్కక్షణం నా కళ్ళని నేను నమ్మలేకపోయాను. ఏం చేయాలో తోచలేదు. గుండె గబగబా కొట్టుకుంటోంది. మెదడు మొద్దుబారిపోయినట్టుంది. అక్కడి నుంచి కదిలి బయటికి వెళ్ళాలని యత్నించాను. కానీ కాళ్ళు సహకరించలేదు. సపోర్టు కోసం తలుపు పట్టుకున్నాను. తలుపు గోడకి తగిలి చిన్నగా చప్పుడయింది.

ఆయన చటుక్కున తలతిప్పి చూశారు.

"ఆంటీ! అప్పటి నా ఫీలింగ్స్ ఇప్పటికీ పచ్చిగానే ఉన్నాయి. ఏదో భయం, నేను తప్పుచేసిన ఫీలింగ్, అవమానం, నిస్సహాయత" మాధవి మరి మాట్లాడలేనట్టు ఆగిపోయింది.

ఆమె మొహంలో నీలినీడలు అలాంటి భావాలు ఆమె మొహంలో ఎప్పుడూ చూడలేదు. ఏం మాట్లాడకుండా ఆమె చేతిని నా చేతిలోకి తీసుకుని చిన్నగా నొక్కాను. మాణిక్యమ్మగారు చీర కొంగుతో కళ్ళు తుడుచుకుంటున్నారు.

తనను తను సంబాళించుకుని మాధవి మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

"ఆయన వెంటనే లేచి కూర్చున్నారు. బసంతి కంటి నీరు తుడుచుకుంటూ ఆయ

నకి దూరంగా జరిగి తల వంచుకుని కూర్చుంది. అప్పటివరకు కాళ్ళు నేలకంటుకు పోయినట్టు అక్కడే నిలబడ్డ నేను గిరుక్కున వెనక్కి తిరిగాను. ఎలా బెడ్‌రూంలోకి వచ్చానో నాకే తెలీదు.

అప్పుడు అంతవరకు బిగపట్టుకున్న దుఃఖం అలలాగా పొంగి నన్ను ముంచె త్తింది. అలా ఎంతసేపు ఏడుస్తూ ఉండిపో యానో! ఆయన మెల్లగా గదిలోకి వచ్చారు. మాట్లాడకుండా నా పక్కనే కూర్చున్నారు.

నాకు చాలా ఉక్రోషంగా, అవమానంగా వుంది. "మాధవీ!" అంటూ నా భుజం మీద చెయ్యి వెయ్యబోయారు. నాకు కంపరంగా అనిపించి చటుక్కున వెనక్కి జరిగాను. అలా ఎందుకు చేశారని సంజాయిషీ అడగా లని నాకప్పుడు అనిపించలేదు.

"నేను మా ఊరు వెళ్ళిపోతాను" అన్నాను ఇంకా వెక్కుతూ. ఆయనేం మాట్లాడలేదు.

"మా అమ్మవాళ్ళ దగ్గరికి పంపించె య్యండి" అన్నాను. అమ్మా వాళ్ళు గుర్తుకు రావడంతో మళ్ళీ ఏడుపు వచ్చింది.

"ఇప్పుడేం జరిగిందని ఇలా ఏడవడం, వెళ్ళిపోవడమూను" అన్నారు చిన్నగా.

"ఏం జరగలేదూ? నాకు చాలా అస హ్యంగా ఉంది. నన్ను రేపే దుగ్గిరాల పంపెయ్యండి" అన్నాను ఉక్రోషంగా.

"ఆ సంగతి తర్వాత చూద్దాం, ముందు నేను చెప్పేది విను" అన్నారు చాలా శాంతంగా.

నాకు శోభన్‌బాబు, ఇద్దరు భార్యల సిని మాలు గుర్తొచ్చాయి. "ఏం చెప్తారు? ఏదో సినిమా కథ చెప్తారు. అంతేగా! నాకేం చెప్పొద్దు. నేనేం వినను. నేను మా ఊరు వెళ్ళిపోతాను అంతే!" అన్నాను మొండిగా.

అంతవరకు ఆయన అంటే వున్న భయం, బెరుకు ఆ క్షణంలో ఏమయి పోయాయో నాకే తెలీదు.

"ముందు నువ్వు నిద్రపో! ఇప్పుడు నేనేం చెప్పినా అర్థం చేసుకునే స్థితిలో లేవు. రేపు స్థిమితంగా మాట్లాడుకుందాం! పడుకో!" అన్నారు అనునయంగా.

నాకు ఒళ్లు మండింది. తప్పు తను చేసి ఎంత చక్కగా మాట్టాడుతున్నాడో!

"నిద్రపోవడమేమిటి? అసలు నేనిక్కడ ఉండనంటుంటే!" అన్నాను కోపంగా.

ఆయన నా మాటలు వినిపించనట్టు తాపీగా మంచం మీద పడుకున్నారు. నేను చటుక్కున లేచి వెళ్ళి సోఫాలో కూర్చు న్నాను. ఆయన నిద్రపోయారో లేదో నాకు తెలీదు కానీ నేను మాత్రం అలా సోఫాలోనే రాత్రంతా జాగారం చేశాను.

మనసంతా నిండిన బెంగ, ఒంటరితనం, నిస్సహాయత ఆ రాత్రి నాకు కంటిమీదకు కునుకు రానియ్యలేదు.

తెల్లవారుఝామున ఎప్పటికో కాస్త కునుకు పట్టింది. ఒక అరగంట పడుకున్నా నేమో! లేచేసరికి ఆయన వెళ్ళిపోయినట్టు న్నారు. నాకు కిందకి వెళ్ళాలనిపించలేదు. అలా చాలాసేపు ఉండిపోయాను. తర్వాత ఎప్పటికో లేచి స్నానం చేసి మళ్ళీ అలాగే కూర్చున్నాను. ఆ దుఃఖపు ఉధృతం తగ్గింది కాని రాత్రి జరిగింది గుర్తొచ్చినప్పుడల్లా ఉక్రోషం, కసి, కోపం కలిగాయి.

విచిత్రం ఏమిటంటే నాకు బసంతి మీద ఏం కోపం రావడం లేదు. నమ్మించి, మోసం చేసిన ఆయనే నా ఫీలింగ్స్‌కి టార్గెట్.

కాసేపటికి బసంతి మేడ మీదకు టిఫిన్, కాఫీ ట్రేతో వచ్చింది. నేను మొహం తిప్పు కున్నాను. ట్రే టేబుల్ మీద పెట్టి నా దగ్గ రగా వచ్చి నా చేయి పట్టుకుని టిఫిన్ తిన మని సైగ చేసింది. ఆమె మొహం చాలా దైన్యంగా ఉంది. రాత్రి బాగా ఏడ్చినట్టుంది. అసలే చిన్నకళ్ళు మూసుకుపోయినట్టు న్నాయి. ఆ అమ్మాయిని చూస్తే జాలేసింది.

అయినా ఏం తినాలనిపించలేదు. వెళ్ళ మని సైగ చేశాను. అలాగే నిలబడింది. ఉన్నట్టుండి ఒంగి నా పాదాలను తాకి

అక్కడే కూలబడింది. ఆమె కళ్ళనుండి నీళ్ళు ధారాపాతంగా బుగ్గల మీదకి జారిపో తున్నాయి.

నేనేం మాట్లాడకుండా ఏదో తిన్నాననిపిం చాను. మౌనంగా ట్రే తీసుకుని కిందకి వెళ్ళి పోయింది.

## 12



ఆ రోజు ఆయన ఇంటికి త్వరగా వచ్చే శారు. ఏం జరగనట్టే ఉన్నారు. ఇంట్లో నిశ్శబ్దం తాండవించింది. భోజనాలైన తర్వాత నేను పైకి వెళ్ళకుండా హాల్లోనే కూర్చున్నాను. కాసేపటికి ఆయన నా దగ్గర కొచ్చి

"ఇంకాసేపట్లో జీప్ వస్తుంది. నువ్వు తయారైతే గౌహతి వెళ్దాం" అన్నారు.

"నేను రాను. వెళ్ళిపోతాను" ఆయన వంక చూడకుండా పాత పాటే పాడాను.

"మీ ఊరు వెళ్ళడం ఇప్పటికిప్పుడెలా కుదురుతుంది? రిజర్వేషన్ దొరకాలి కదా! ఈ ఒక్కసారి నా మాట విను" అన్నారు.

ఆయన మాటల్లో రీజన్ కనిపించింది. కానీ తల వంచుకుని, "ఇప్పుడు నాకెక్కడికీ రావాలని లేదు" అన్నాను. నేను మెత్తబ డటం చూసి "ప్లీజ్! ఈ ఒక్కసారీ నా మాట వినాలి నువ్వు" అన్నారు బతిమా లుతూ. నాకేం చేయాలో అర్థం కాలేదు.

ఈ రెండు రోజులుగా ఈయన, బసంతి తప్పించి బయటి ప్రపంచంతో సంబంధం తెగిపోయినట్టుంది.

మనుషుల మధ్యకు వెళ్ళాలని నా మనసు ఆరాటపడుతోంది. మాట్లాడకుండా లేచి చీర మార్చుకుని వచ్చాను. ఇద్దరం మౌనంగా జీపు కోసం ఎదురు చూస్తూ ముందున్న సిటౌట్‌లో కూర్చున్నాం. కాసేపటికి జీపు వచ్చింది. బసంతి లోపలే ఉంది బయటికి రాలేదు. మేం వెళ్ళిపోయాం. అక్కడ ఆయన రెండు మూడు గుళ్ళకి తీసుకె ళ్ళారు. తర్వాత కజిరంగా నేషనల్ పార్క్‌కి వెళ్ళాం. అక్కడేవేవో జంతువుల్ని చూశాం. వాటిలో ఒక్కటే కొమ్ము ఉన్న రైనోసెరాస్ ఉంది. అది అచ్చు మా ఆయనలాగే ఉంది అనుకున్నాను కసిగా.

తర్వాత బజార్లో తిప్పి ఏదో ఫారిన్ పెర్ఫ్యూంలు, అస్సాం సిల్కు చీర, ఊలు, అల్లిక సూదులు ఇంకా ఏవో కొన్నారు. వేటి లోనూ నా ప్రమేయం లేదు. అలిగిన పిల్ల లకి మరిపించి, మురిపించేందుకు పెద్ద వాళ్ళు కొని పెట్టినట్టుగా ఉంది. హోటల్‌కి వెళ్ళి ఏదో తిన్నాం. అంతవరకు పొడిపొడి మాటలు తప్ప మా మధ్య పెద్దగా సంభా షణ జరగలేదు.

చివరగా బొటానికల్ గార్డెన్స్‌కి తీసికె ళ్లారు. అలసిన మనసు, శరీరం అక్కడ కాస్త సేద తీరాయి. ఇద్దరం పచ్చిక మీద కూర్చున్నాం. రకరకాల పూలు కనువిందు చేస్తున్నాయి. ఇద్దరం మౌనంగా కూర్చు న్నాం. హఠాత్తుగా ఆయన నా చేతులు పట్టుకుని, "సారీ! ఇక్కడికి వచ్చీ రావ డంతోటే నీకు ఇది షాక్ లాగా ఉండి ఉంటుంది కదూ! కాస్త ఓపికగా నేను చెప్పే దంతా విను" అన్నారు నెమ్మదిగా.

నేనేం మాట్లాడలేదు. ఆయనే చాలాసేపు మాట్లాడారు. దాని సారాంశం ఏమి టంటే...

ఆయన ఇక్కడికి వచ్చిన కొత్తలో, అంటే మూడేళ్ళ క్రితం ప్లాంటేషన్ దగ్గర్లో హోటల్స్ లేకపోవడం, తనకి వంట రాకపో వడం వల్ల భోజనానికి చాలా ఇబ్బంది పడే వారట. మొదట్లో పది రోజులపాటు

ఆయన కింద పనిచేసే వాళ్ళ ఇంటి నుంచి కారియర్ తెచ్చే వాళ్లట. ఈయనకి మొహమాటమనిపించి, వద్దని చెప్పి, చేతకాని వంట ప్రయత్నం చేసి చేతులు కాల్చుకున్నారట. అది చూసి సూపర్‌వైజరొకతను బసంతిని వంటకు కుదిర్చాడట.

బసంతికి తండ్రి చిన్నప్పుడే పోయాడు. తల్లి, ఇద్దరు అన్నలు ఉన్నారుట. వాళ్లకి పెళ్లిళ్లైనాయి కాని అంతా కలిసే ఉంటారుట. కానీ వదినలు బసంతికి, తల్లికి సరిగా తిండి పెట్టకపోగా ఎప్పుడూ సూటి పోటి మాటలనేవారుట. డబ్బు ఖర్చు అవుతుందని బసంతి పెళ్ళి సంగతి కూడా పట్టించుకునేవాళ్ళు కాదట.

ఈ ఏర్పాటు వల్ల బసంతికి కడుపు నిండా తిండి దొరకడమే కాక జీతం కూడా వస్తుందని తల్లి, అన్నలు అభ్యంతర పెట్టలేదట. రోజూ వచ్చి వంట చేసి ఇల్లు శుభ్రం చేయడం, ఆయన బట్టలు ఇస్త్రీ చేయడం లాంటి పై పనులు కూడా చేసేదట. రాత్రిళ్లు మాత్రం ఇంటికి వెళ్లిపోయేదట. కానీ ఒక రాత్రి వర్షం బాగా ఎక్కువగా రావడంతో ఈయన ఇంటికి ఆలస్యంగా వచ్చారట. అందుకని ఆయనకి భోజనం పెట్టి, ఇంటికి వెళ్ళలేక ఉండిపోయిందట. అప్పుడే అనుకోకుండా వాళ్ళు కలవడం జరిగిపోయిందట. తర్వాత ఆ అమ్మాయి కూడా అభ్యంతరం చెప్పకపోవడంతో ఈయనకి ఇబ్బందేం లేకుండాపోయింది. బసంతి నెల తప్పడంతో వీళ్ళ సంబంధం అందరికీ తెలిసిపోయిందిట. బసంతి అన్నలు మరి నలుగురిని వెంటేసుకొచ్చి గొడవ చేశారట. తప్పనిసరి పరిస్థితులలో ఒక్క వాళ్ళ కుటుంబంతో కలిసి గుడికి వెళ్ళి అక్కడ బసంతిని పెళ్ళి చేసుకున్నారుట.

బసంతికి ఇప్పుడు రెండేళ్ళ కొడుకట.

బహుశా తర్వాత జాగ్రత్త పడ్డారేమో, మళ్ళీ నెల తప్పడం లాంటి ప్రమాదం జరగలేదు.

"మరి నన్నెందుకు మళ్ళీ పెళ్ళి చేసుకున్నారు? " నేను సూటిగా అడిగాను.

వాళ్ల నాన్నగారు వాళ్ళకి ఈ గొడవేమీ

## నూరడం మానండోయ్...!

"బ్రూక్సిజం ఏంటండీ మార్క్సిజంలా..!" అనుకుంటున్నారా? ఇది వేరే లెండి. కోపం వస్తే పళ్ళు కొరికే అలవాటుంటుంది కొందరికి. మరికొందరు రాత్రిళ్ళు నిద్రపోతున్నప్పుడు తమకి తెలియకుండానే బఠాణీల్లాంటివి కరకరా నమిలేస్తున్నట్లు పళ్లు నూరుతుంటారు. ఇలా తమకు తెలియకుండానే పళ్ళు నూరడాన్ని బ్రూక్సిజం అంటారు. మీకు ఆ అలవాటుంటే.. రాత్రిళ్ళు పడుకోబోయే ముందు యాపిల్ గాని, పచ్చి క్యారట్ దుంప గాని, కాలిఫ్లవర్ గాని తినండి. ఇది తింటే ఓవర్ యాక్టివ్‌గా ఉండే నోరు కాస్తా కామ్ అయిపోతుంది. అసలు ఈ బ్రూక్సిజం సమస్యకు కారణం అధిక వత్తిడి. అందుకని వత్తిడి తగ్గించుకుని ప్రశాతంగా ఉండేందుకు ప్రయత్నించాలి. వేడి నీటితో స్నానం చెయ్యటం, కార్బోహైడ్రేట్లు ఎక్కువగా ఉండే ఆహారాన్ని తక్కువగా తీసుకోవడం, కాఫీ వంటి పానీయాలు తగ్గించటం వల్ల వత్తిడిని తగ్గించుకోవచ్చంటున్నారు అమెరికన్ శాస్త్రవేత్తలు.

ఇంకేం, అలా పళ్ళు నూరకండా ఈ సూచనల్ని పాటించండి.



నీటి పుట్ట... పుట్టలోన ఓ చెట్టు... చెట్టుమీన ఓ గూడు...
గూటిలోన ఓ కుటుంబం... ఆ కుటుంబానికో పెద్ద...గద్ద!
తండ్రిగా ఆ గద్దకో బాధ్యత...భార్యా పిల్లల పోషణ...
అందుకే నీటిపై ఎగురుతూ, వాడి చూపులు గుచ్చుతూ,
బుడుంగున వాలి... నీటిలోకి దూరి... చటుక్కున
ఓ చేపను పట్టేసి అందరికీ విందు చేయడానికి
రివ్వురివ్వున వచ్చేస్తోంది.
ఎర్ర సముద్రానికి ఓ కొసన భూభాగానికి చేరువన
కనిపించిన దృశ్యమిది. సంతాన యోగం కలగడానికి
మూడు నెలల ముందు వచ్చి ఆ యోగం కలిగిన
కొన్ని నెలల వరకు గద్ద జంటలు ఇలా తాము ఎంచుకున్న
ఆవాసాల్లో కట్టుకున్న గూళ్లలోనే కాపురముంటాయి.



తెలీదుట. అందుకని పెళ్ళికి తొందర చేశా రట. అప్పుడే మా సంబంధం రావడంతో రోజూ ఫోన్‌చేసి పెళ్ళికి వత్తిడి చేశారట వాళ్ళ నాన్నగారు. ఇక్కడి విషయాలు చెప్తే బాధ పడ్తారని తనలోనే దాచుకుని తప్పని సరిగా పెళ్ళికి ఒప్పుకున్నారట.

నాకు ఆయన చెంప పగలగొట్టా లనిపించింది.

"మరి నన్నేం చేయాలనుకుం టున్నారు? " కోపాన్ని ఆపు కుంటూ అడిగాను.

"నిన్నేం చేయడమేమిటి? నువ్వే కదా లీగల్‌గా నా భార్యవి" వాళ్ళు లేబర్ జాతి. వాళ్లనెందుకు రెచ్చ గొట్టడం. తగాదా పడడమ ని గుళ్ళో పెళ్ళి చేసుకు న్నాను. అంతే! చూడు మాధవీ! బసంతి నీకే రకంగానూ అడ్డు రాదు. నా ఆస్తిమీద హక్కు కూడా నీకూ, మనకి పుట్టే పిల్లలకే ఉంటుం ది. సంఘంలో కూడా నా భార్యగా చెలామణి అయ్యేది నువ్వే! మరి నీకింక అభ్యంతరమే మిటి? " నిర్లజ్జగా మాట్లా డుతున్నాడు.

అప్పటికి నాకున్న పరి జ్ఞానంతో నాకు ఇద్దరు భార్యలతో కాపురం చేయడం తప్పు అని తెలుసు. అందుకే సూటిగా ఆయన్ని "అంటే! ఇద్దరు భార్యలతోనూ కాపురం చేద్దామను కుంటున్నారా? " అని అడిగేశాను.

"అరే! మాధవీ! నువ్వసలు బసంతిని పట్టించుకోనక్కరలేదు. ఆఫ్టరాల్ షి ఈజ్ ఎ మెయిడ్ సర్వెంట్ అంతే! నీకిష్టం లేక పోతే ఆమెవేపు కన్నెత్తయినా చూడను సరేనా!" అన్నాడు తేలిగ్గా నవ్వుతూ. నాకు ఛాయిస్ ఇస్తున్నాడు మహానుభావుడు.



"అంటే ఇప్పుడు కాపురానికి నేనున్నాను కాబట్టి బసంతి లేకపోయినా ఫర్వాలేదన్న మాట. పైగా నాతో సంసారానికి చాటు మాటు, రహస్యం ఏమీ అక్కర్లేదుగా! రెండో పెళ్లి చేసుకుని నన్ను మోసం చేశారు. సరే!

బసంతిని కూడా తెలివిగా గుళ్లో పెళ్లి చేసుకుని ఆస్తిమీద అధికారం లేకుండా చేసి మోసగించారు. ఇప్పుడు ఆమెని వదిలించు



కోవడానికి కూడా ఆయనకేం అభ్యంతరం లేదు. ఎంత స్వార్థపరుడో! నాకు ఆయనంటే అసహ్యం కలిగింది. ఆయనలో పశ్చాత్తాపం కూడా లేదు.

ఇద్దరు భార్యల సినిమాల్లో కూడా మనం చూసేది అదే కదా, ఆంటీ! ఇద్దరు భార్యల్లో ఒకరి త్యాగం అంటే చచ్చిపోవడమో దూరంగా వెళ్లిపోవడమో జరిగితే అతగాడు మాత్రం హాయిగా మిగిలిన భార్యతో కాపురం చేస్తాడు. అంటే చివరికి అతను నష్టపోయేదేం లేదు. మనం కూడా అదే న్యాయమైన తీర్పు అన్నట్టు ఆమోదిం చేస్తాం."

మాధవి మాటలు సమంజసంగా అనిపించాయి నాకు.

మళ్ళీ మాధవి చెప్ప సాగింది.

"ఆంటీ! అప్పుడు నేను ఎట్టి పరిస్థితుల్లోనూ అతనితో కాపురం చేయకూడదని, అసలు అక్కడ ఇంక ఉండకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాను. ఆయనతో పోట్లాడటం, కోపంగా మాట్లాడడం చేయకుండా, మర్యాదగా వెళ్లిపోవాలని అనుకున్నాను.

నేను ఏం మాట్లాడకుండా ఆలోచనలో పడడం చూసి సమాధానపడ్డాననుకున్నట్టున్నారు, చేయి సాచి నా చేతిని పట్టుకున్నారు. నేను స్నున్నితంగా విడిపించుకుని 'ఇంక వెళ్దాం' అన్నాను లేచి నిలబడుతూ. 'ఆc! వెళ్లిపోదాం. నేనే పరిస్థితుల్లో అలా చేయాల్సి వచ్చిందో అర్థం చేసుకున్నావు కదా! మరి నామీద కోపం పోయినట్టేనా? " అన్నారు నా కళ్ళలోకి చూడాలని

ప్రయత్నిస్తూ. నేను చూపులు పక్కకి తిప్పుకున్నాను.

రాత్రికి ఇంటికి వచ్చేశాం. బసంతి వంట చేసి ఎదురు చూస్తోంది. భోజనాలు కాగానే బసంతి తన గదిలో తలుపేసుకుని పడుకుంది.

నాకు ఆయనతో బెడ్‌రూంలో పడుకోవాలంటే ఇష్టంగా లేదు. టి.వి.లో అర్థం కాని ప్రోగ్రాములు చూస్తూ అలాగే సోఫాలో పడుకుని నిద్రపోయాను.

తెల్లవారుఝామున ఆయన వచ్చి తగ్గు స్వరంతో "నువ్విక్కడ పడుకోవడం పనిమనిషి చూస్తే బావుండదు. వెళ్లి పైన పడుకో!' ' అన్నారు. నేను నిద్రమత్తులోనే వెళ్లి మేడ మీద పడుకున్నాను.

మర్నాడు పొద్దుటే ఇద్దరికీ టిఫిన్ పెట్టింది బసంతి. అన్ని పనులు అతి నిశ్శబ్దంగా చేస్తోంది. ఆమె కదలికలన్నీ ఒక మరబొమ్మలాగా ఉన్నాయి. 'మొహంలో కోపం, బాధలాంటి భావాలేం లేవు.

ఆమెని చూస్తే నాకు అసలు కోపం రావడం లేదు. కాఫీ తాగుతుండగా గుర్తొచ్చింది.

"దుగ్గిరాలకి ఫోన్ చేసి అమ్మావాళ్ళతో మాట్లాడాలి" అన్నాను ముభావంగా.

"అలాగే! కాని ఇక్కడ జరిగిందేమీ చెప్పకు. అంతా సర్దుకుంటుంది. అనవసరంగా వాళ్లని కంగారు పెట్టడం దేనికి? " అన్నారు నచ్చచెప్తున్నట్టు.

నేనేం మాట్లాడలేదు.

ఇంతలో ఫోన్ మోగింది... ఆయన వెళ్లి మాట్లాడుతూ నన్ను సంజ్ఞ చేసి పిలిచారు. మౌత్ పీస్ మూసి "దుగ్గిరాల నుంచి మీ నాన్నగారు ఫోన్ చేశారు. మీ నాయనమ్మగారు రాత్రి పోయారుట" అని ఫోను నాకందించారు.

"అమ్మా! మధూ! ఎలా ఉన్నావు? " అన్నారు నాన్నగారు ఫోన్‌లో. నాకు ఉప్పెనలాగా ఏడుపు ముంచుకొచ్చింది. ఫోన్ పట్టుకుని ఏడుస్తుండిపోయాను. నాయనమ్మ పోయినందుకో, నాన్నగారి గొంతు విన్న రిలీఫ్ వల్లనో నాకే అర్థం కాలేదు.

"అరే! వూరుకో తల్లీ! పెద్దదైపోయింది కదా నాయనమ్మ! పండిన పండు నేల రాలవలసిందేగా! ధైర్యంగా ఉండాలి" నాన్నగారి ఓదార్పు నా ఏడుపుని పెంచింది. నాకు మాటలు రావడంలేదు. అలా ఏడుస్తూనే ఉన్నాను. అమ్మ రిసీవర్ తీసుకున్నట్టుంది.

"అమ్మా! మధూ! ఏమైంది ఎందుకంతలాగా ఏడుస్తున్నావు. ఊరుకో! నాయనమ్మ బాధపడకుండా నిద్రలోనే పోయారు" అంది.

"అమ్మా! నేను అక్కడికి వచ్చేస్తాను" వెక్కిళ్ళ మధ్య అన్నాను.

"అంత దూరం నుంచి నువ్వు రావక్కర్లేదమ్మా! కొత్తగా పెళ్ళైంది కదా! అలాంటప్పుడు ఇక్కడికి మీరు రాకూడదు. నీకు తెలియాలి కాబట్టి ఫోన్ చేశాం. నువ్వొచ్చేదాకా నాయనమ్మను ఉంచడం కుదరదు కదా! తలస్నానం చెయ్యి చాలు" అంటోంది అమ్మ.

నేను ఏం మాట్లాడలేక 'అమ్మా'! అమ్మా!' అంటున్నాను.

"ఏం తల్లీ! అంతా కొత్తగా ఉందా అక్కడ? అల్లుడుగారు చాలా మంచివారమ్మా! నువ్వాయనని ఇబ్బంది పెట్టకు. మాకూ నిన్ను చూడాలని ఉంది. వీలు చూసుకుని నాన్నగారు, నేను వస్తాం. ఆరోగ్యం జాగ్రత్త" అమ్మ గబగబా చెప్తోంది.

నేను ఏడుపు బిగపట్టుకుని "ఊ"! అంటున్నాను.

ఫోన్ మళ్ళీ నాన్నగారు తీసుకుని ఆయనతో మాట్లాడారు. వాళ్ళకేం అర్థమైందో నాకు తెలీదు.

అలా చాలాసేపు ఏడుస్తూ ఉండిపోయాను. ఆయన కాసేపు ఓదార్చే ప్రయత్నం చేసి ఆఫీసుకి వెళ్ళిపోయారు.

బసంతికి ఏం అర్థమయిందో, నాకు దగ్గరగా నిలబడి జాలిగా చూస్తోంది. భాషతో పనిలేకుండా ఓదార్చేందుకు ప్రయత్నించింది. కాసేపటికి తేరుకుని లేచి మొహం కడుక్కున్నాను. అలా వెంటనే మా ఊరు వెళ్ళే అవకాశం లేకుండాపోయింది.

13



రోజులు భారంగా నడుస్తున్నాయి. ఆయన నాకు కాలక్షేపానికి కావలసినవన్నీ తెప్పించి ఇచ్చారు. రాత్రిళ్ళు కూడా నాకు ఇబ్బంది కలిగించకుండా స్టడీరూంలోనే దివాన్ మీద పడుకుంటున్నారు. బసంతి కూడా రాత్రిళ్ళు ఇంటికి వెళ్ళిపోయి పొద్దుటే వస్తోంది. ఆయనకి దూరంగా ఉండే ప్రయత్నమేమో!

ఇలాంటి విచిత్రమైన పరిస్థితుల్లో ఇంకా చిత్రంగా భాష రాకపోయినా బసంతి నాకు మంచి స్నేహితురాలైంది. ఇద్దరం ఒకేలాంటి బాధితులం కదా! నేను వాళ్ళ అస్సామిలో చిన్న చిన్న మాటలు మాత్రమే నేర్చుకున్నాను కాని ఆ అమ్మాయికి తెలుగు అర్థమయ్యేంత నేర్పగలిగాను.

తర్వాత నాకు ఒంటరితనం అంతగా బాధించలేదు. ఇది ఆయన గమనించారో లేదో నాకు తెలీదు. ఎందుకంటే ఆయన ఇంట్లో ఉన్నంతసేపూ బసంతి మరబొమ్మే! ఆయన అటు వెళ్ళగానే ఇద్దరం కలిసి స్వెట్టర్ అల్లడం, బట్టలమీద అద్దాలు కుట్టడం లాంటి పనులు కలిసి చేసేవాళ్ళం. వంటలో కూడా కాస్త నన్ను అప్పుడప్పుడు సాయం చేయనిచ్చేది.

అలా మూడు నెలలు గడిచాయి. నా దుగ్గిరాల ప్రయాణం వాయిదా పడుతూనే ఉంది. ఒకసారి, నాన్నగారికి మళ్ళీ ట్రాన్స్‌ఫర్ అయ్యేలా ఉందని, మరోసారి అన్నయ్యకి కాలు ఫ్రాక్చరైతే అమ్మ రూర్కెలా వెళ్ళిందని, తర్వాత నిదానంగా కాసిని రోజులు ఉండేలా రావచ్చని, తొందర పడొద్దని ఫోన్లు. నాకు ప్రతిసారీ నిరాశే!

"అంటీ! అక్కడ నాకు బసంతి ఒక్కతే పరిచయస్తురాలు. ఎప్పుడూ ఎవరూ ఇంటికి వచ్చేవారు కాదు. ఆయనా నన్ను ఎవరింటికీ తీసుకెళ్ళేవారు కాదు. ఆయనకి అసలు సోషల్ లైఫ్ లేకపోవడం నాకు చాలా ఆశ్చర్యంగా ఉండేది. ఒకటి రెండుసార్లు గౌహతి వెళ్ళాం. అంతే. ఆయన నేనేమడిగినా చేయడానికి, కొనడానికి తయారుగా ఉండేవారు. కానీ నాకు ఆయనంటే కనీసం స్నేహభావం కూడా కలిగేది కాదు.

ఒకరోజు రాత్రి పనంతా పూర్తిచేసుకుని బసంతి ఇంటికి వెళ్ళిపోయింది. స్టడీరూంలో లైటు వెలుగుతోంది. ఆయన ఏదో చదువుకుంటున్నారన్నమాట. సాయంత్రం నుంచి ముసురుగా ఉంది. రాత్రి పన్నెండు గంటలు దాటింది. వర్షం కుండపోతగా పడుతోంది. చలి బాగా ఎక్కువైంది. హీటర్ ఆన్‌చేసి రగ్గు కప్పుకుని పడుకున్నాను. అప్పుడే నిద్ర పడుతోంది. ఇంతలో కరెంటు పోయింది.

కాటుకలాంటి చిక్కటి చీకటి. ఇంట్లో కొవ్వొత్తి లాంటివి ఎక్కడున్నాయో నాకు తెలీదు. చిన్నప్పటినుంచీ నాకు చీకటి అంటే చాలా భయం. బయట వర్షం హోరుగా జోరుగా పడుతోంది.

పక్కనే అలికిడి. ఏదో పాకుతున్నట్టుంది. బిగుసుకుపోయాను. పక్కకి తిరగాలన్నా భయమే! ఇక్కడ పాములు తిరుగుతుంటాయని ఆయన ఒకసారి అన్నారు. అది గుర్తొచ్చింది. మీద ఏదో బరువుపడ్డట్టు భావన. భయంగా లేవబోయాను. దగ్గరగా,

అతి దగ్గరగా సిగరెట్ వాసన. కడుపులో తిప్పింది. అరుద్దామని నోరు తెరవబో యాను. రెండు పెదవులు నా నోటిని మూసేశాయి. నాకు వాంతి వచ్చేటట్టుంది. బలంగా రెండు చేతుల్తో నన్ను చుట్టేసి మంచానికి అదిమిపెడుతున్నారెవరో.

"ఏవండీ!" కీచుగా అరిచాను.

"ష్! భయం లేదులే! నేనే!" గుసగుసగా అన్నారు ఆయన. నా గుండె ఆగినంత పనైంది.

"వదలండి. ఏమిటిది అసహ్యంగా!" పెనుగులాడుతూ విడిపించుకోబోయాను.

"నా దగ్గర భయమెందుకు? పరాయి వాణ్ణి కాదుగా" ఆయన కౌగిలి బిగిసింది.

నాకు ఊపిరి ఆడడంలేదు. అసహ్యంగా అనిపిస్తోంది. "వద్దు. నా కిష్టంలేదు. వదిలిపెట్టండి" ఏడుపు తన్నుకొస్తోంది. "కొత్త కదా! అలాగే ఉంటుంది. హీటర్ కూడా లేదు చలేస్తోంది. ఉండు గొడవ చెయ్యకు" అంటూ ఆయన నన్ను నొక్కిపట్టారు. నేను ఏడుస్తూ ఆయన్ని నెట్టేయాలని ప్రయత్నించాను. నా వల్ల కాలేదు. నాకు భయం. జుగుప్స అన్నీ కలగాపులగంగా కలిగాయి. ఆయన బలం ముందు నేను ఓడిపో యాను. పెనుగులాడే శక్తి లేక అలా ఉండి పోయాను. ఏం జరుగుతోందో అంతా అయోమయం. మనసు, శరీరం రెండు మొద్దుబారిపోయాయి. కాసేపటికి ఆయన పడుకున్నారు.

నేను నిస్త్రాణగా సైకప్పుకేసి చూస్తూ పడుకున్నాను. మెదడు, మనసు శూన్యంగా ఉన్నాయి.

కరెంట్ ఎప్పుడు వచ్చిందో తెలీదు. తెల్లవారకముందే ఆయన లేచి కిందికి వెళ్ళిపోయినట్టున్నారు. ముల్లు అరిటాకు మీద పడింది.

రాత్రి జరిగింది కలలాగా ఉంది. నా చెదిరిన బట్టలు, ఆయన పంటి గుర్తులు నిజమేనని చెప్తున్నాయి.

కదలకుండా అలాగే శవంలాగా పడుకుని ఉండిపోయాను. ఒళ్లంతా చీదరగా ఉంది. నా శరీరం మీద నాకే అసహ్యం. స్పేర్ పార్ట్సు వేసుకునే అవకాశం శరీరానికి కూడా ఉంటే ఎంతో బాగుంటుంది! చచ్చిపోవాలనిపించింది. కానీ ఎలా చచ్చిపోవాలో కూడా తెలీని అమాయకత్వం. ఎప్పటికో ఒంట్లో ఓపికనంతా కూడదీసుకుని, బట్టలు సరిచేసుకుని రజాయి కప్పుకుని పడుకున్నాను.

పదిగంటలవుతుండగా బసంతి వచ్చి చూసింది. వడలిన ముఖం చూసి 'జ్వరమొచ్చింది' అనుకుంటూ లేచి నేను నా పనులు చేసుకోవడానికి సాయం చేసింది. వేడిగా కాఫీ తెచ్చి బలవంతాన తాగించింది.

కొద్దిగా శరీరం కోలుకుంది. కానీ మనసు మొద్దుబారిపోయింది. ఆ పగలు ఆయన నన్ను తప్పించుకుని తిరిగారు. నేను కిందికి రాలేదు. బసంతి తెచ్చిందేదో తిని రోజంతా మంచం మీద అలాగే పడుకున్నాను. బసంతితో కూడా ఒక్కమాట మాట్లాడాలనిపించలేదు. నాలో ఏదో తగులబడిపోయినట్టుంది.

రాత్రి అవుతుంటే నాలో భయం మొదలైంది. కానీ ఆయన అలికిడి ఎక్కడా వినిపించలేదు. మేలుకునే ఉండాలనుకున్నాను. కానీ నాకు తెలీకుండానే ఎప్పుడో కాస్త కునుకు పట్టింది.

హఠాత్తుగా మెలుకువ వచ్చింది. నా పక్కనే అతిదగ్గరగా ఆయన. కెవ్వున అరిచాను.

"వెళ్ళిపొండి" లేవబోయాను. రక్తం మరిగిన పులి గుర్తొచ్చింది. ఆయన నన్ను దగ్గరకు లాక్కుని, "నేనేగా! ఎందుకు, జరగరానిది ఏదో జరిగినట్టు ఎందుకంత గొడవ చేస్తావు? ఇందులో అంత భయపడేదేముందీ? భార్యాభర్తల మధ్య ఇది సహజమే" అంటూ ముఖమంతా ముద్దులు పెట్టుకోవడం మొదలుపెట్టారు.

"ఒద్దు. నాకిష్టం లేదంటే వినిపించుకోరే! మీకు సిగ్గులేదూ? " ఆయన జుట్టు పట్టు

## గోదావరి టాగూరు.. పిఠాపురం కీట్సు!



'ఆంధ్రాషెల్లీ'గా పేరుపడిన కృష్ణశాస్త్రికి సన్మానాలు.. బిరుదులపై అంత గౌరవం ఉండేది కాదు.. ఓ సన్మానసభలో ఆయన, 'ఆంధ్రాషెల్లీ ఏమిటి? ఆంధ్రాషెల్లీ.. గోదావరి టాగూరు.. పిఠాపురం కీట్సు... అంటూ ఎందుకీ బిరుదులు. నా తండ్రి పెదతండ్రులు పెట్టిన పేరు వెంకట కృష్ణశాస్త్రి. ఆ పేరుకే నేనింకా సరైన గౌరవం తేలేదనుకుంటున్నాను..' అని నిర్మొహమాటంగా చెప్పారు.

కుని గుంజుతూ కోపంగా అరిచాను. "అనవసరంగా గొడవ చెయ్యకు. ఎవరన్నా వింటే బావుండదు" అంటూ నా నోరు మూశారు.

నేను గింజుకున్నాను. ఆయనని గిల్లాను. రక్కాను మళ్ళీ ఆయనే గెలిచారు. పని పూర్తి చేసుకుని ఆయన వెళ్ళిపోయారు.

రాత్రంతా ఏడుస్తూ పడుకున్నాను. ప్రతి రాత్రీ ఇలాగే జరుగుతుందేమోనన్న ఆలోచన వచ్చి వణికిపోయాను.

పొద్దున వచ్చి చూసిన బసంతికి నా పరిస్థితి అర్థమైంది. ఆమె సాయంతో నేను బట్టలు మాత్రం మార్చుకోగలిగాను. కాఫీ ఇచ్చి తర్వాత భోజనం కూడా పైకే తెచ్చింది. నా భోజనమైన తర్వాత కిందికి వెళ్ళి మళ్ళీ పైకి వచ్చింది. కొంగుచాటు నుంచి పళ్ళుకోసే కత్తి బయటికి తీసి నాకిచ్చింది. అయోమయంగా చూశాను. 'నీ దగ్గరుంచు మళ్ళీ ఆయన వస్తే వాడుకో!' అని సగం వచ్చీరాని తెలుగులో, సగం సైగలతో చెప్పింది.

నాలో కసి, తెగువ, మొండితనం ప్రవేశించాయి. నిన్నటిలాగే పగలంతా నా దరిదాపులకు రాలేదు. రాత్రి అయింది. అయినా ఆయన కనిపించలేదు. కానీ నాకు తెలుసు. రాత్రివేళ ఏదో సమయంలో నా దగ్గరికి వస్తారని మేలుకునే ఉన్నాను. నేను అనుకున్నట్టే రాత్రి పదకొండు గంటలు దాటిన తర్వాత గదిలోకి వచ్చారు, మంచం వైపు రాబోతున్నారు.

నాకు పిచ్చికోపం, మొండి ధైర్యం వచ్చింది. చటుక్కున లేచి కత్తి చూపిస్తూ దగ్గరికి వస్తే దానితో పొడుచుకుని చస్తానని చెప్పాను. ఆయన ఊహించని ఈ పరిణామానికి బిత్తరపోయారు. విభ్రాంతిగా నాకేసి చూస్తున్నారు. నేనూ కత్తి అలాగే పట్టుకుని, అప్రమత్తంగా ఆయనకేసి కన్నార్పకుండా చూస్తున్నాను. ఆయన రెండు క్షణాలు నాకేసి చూస్తూండిపోయారు. మరి నా మొహంలో ఏం కనిపించిందో, ఏమనుకున్నారో గాని గిరుక్కున తిరిగి బయటికి వెళ్ళిపోయారు. నేను లేచి తలుపు గడియ వేసుకుని పడుకున్నాను.

ఆ తర్వాత ఆయన నా జోలికి రాలేదు. అసలు ఆయన నేను ఎదురుపడేవాళ్ళమే కాదు. ఆయన కింద గదుల్లో ఉంటే నేను పైన, ఆయన మేడ మీద ఉంటే నేను కింది గదుల్లో ఉండేవాళ్ళం.

అమ్మా వాళ్ళకి ఫోన్ చేసి నేను ఎలాగైనా దుగ్గిరాల వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాను. అయితే అప్పుడే నేనూహించని సంఘటన జరిగింది.

నాకు ఇంట్లో బాగా నీరసంగా ఉండేది. ఏమీ తినాలనిపించేది కాదు. తింటే వెంటనే

వాంతి అయ్యేది. ఎక్కువసేపు పడుకునే ఉండేదాన్ని. బసంతి చెప్పినట్టుంది.

ఒకరోజు ఆయన ఇంటికి వస్తూనే డైనింగ్ టేబుల్ దగ్గరున్న నా దగ్గరకు వచ్చారు. "నీకు ఒంట్లో బాగోలేదట కదా! ఎలా ఉంది ఇప్పుడు? ఇక్కడ డిస్పెన్సరీలో లేడీ డాక్టరు ఉంటుంది. వెళ్దాం పద. చాలా చిక్కిపోయావు"

ఆప్యాయంగా అసలు ఏమీ జరగనట్టే మాట్లాడారు.

నేను ఏం మాట్లాడకుండా తల వంచుకుని కూర్చున్నాను. "ఆరోగ్యం పాడవుతే కష్టం. పద వెళ్దాం!" అన్నారు. నేను కదలకపోవడం చూసి, "నువ్వు అక్కడికి రాకపోతే, డాక్టర్‌ని ఇక్కడికి పిలిపిస్తాను" అన్నారు.

ఆయన గొంతులో స్థిరత్వం ధ్వనించింది. చేసేది లేక నేను ఆయన వెంట వెళ్ళాను.

డాక్టరు పరీక్షించి మూడవ నెల గర్భిణి అని చెప్పింది.

నాకు మతిపోయింది. కాళ్ళ కింద భూమి కదిలినట్టనిపించింది. ఆయన ముఖంలో సంతోషం. ఆమెకి కృతజ్ఞతలు చెప్పి, నన్ను ఇంటి దగ్గర దింపారు.

దారిలో, "థాంక్యూ! మీ వాళ్ళకి, మా వాళ్ళకి ఈ సంగతి తెలిస్తే చాలా సంతోషిస్తారు. రాత్రికి ఇంట్లో నుంచి ఫోను చేద్దాం. నువ్వు కూడా మాట్లాడొచ్చు" అన్నారు.

నేను జవాబు చెప్పలేదు.

ఆయన వరస చూస్తుంటే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఈ మనిషికి సిగ్గు, అవమానం లాంటివేమీ ఉండవా! అనిపించింది. ఆయన నా మౌనాన్ని పెద్దగా పట్టించుకోలేదు.

రాత్రి అమ్మావాళ్ళకి, వాళ్ళ నాన్నగారికి ఫోన్ చేసి చెప్పారు. వాళ్ళ సంతోషం ఫోన్లోంచి ప్రవహించింది.

అమ్మా, నాన్నా మంచి రోజు చూసి ఇక్కడికి వచ్చి, ఏకంగా పురిటికి తీసుకెళ్తామని చెప్పారు.

చాలా రోజుల తర్వాత నేను పాత మాధవిని కాగలిగాను. అమ్మా వాళ్ళు వస్తారన్న సంతోషంలో ఆయనతో మామూలుగా ఉన్నాను. ఆయన్ని క్షమించేయడానికి కూడా తయారుగా ఉన్నాను. బసంతి నన్ను సొంత తోబుట్టువుకన్నా ఎక్కువగా కనిపెట్టుకుని ఉంది. కావాల్సినవి అడక్కుండానే అమరిపోతున్నాయి. జీవితంలో రాజీపడిపో



తున్నాను. నాకు చాలా నీరసంగా ఉండేది. ఏంతిన్నా ఇమిడేది కాదు. వాంతులు, వికారం, విసుగనిపించేది. అమ్మా వాళ్ళ రాకకోసం ఎదురుచూస్తున్నాను.

## 14

ఆరోజు ఆయన ఆఫీసు నుంచి మధ్యాహ్నం త్వరగా ఇంటికి వచ్చేశారు. ఆఫీసు పనిమీద గౌహతి జీపులో వెళ్తున్నానని రాత్రి వచ్చేసరికి పొద్దుపోవచ్చుని చెప్పి హడావుడిగా వెళ్ళిపోయారు.

రాత్రి బసంతి ఇంటికి వెళ్ళకుండా నాకు తోడుగా ఉండిపోయింది. రాత్రి పదకొండు గంటలు దాటినా ఆయన రాలేదు. ఇద్దరం హాల్లో కూర్చుని ఎదురుచూస్తున్నాం. ఇంతలో జీపు వచ్చింది. కానీ ఆయన లోపలికి రాలేదు. ఆయనతో కలిసి వెళ్ళిన అసిస్టెంట్ మానేజరు ఒక్కడే వచ్చాడు. "సాబ్ ఏరీ" అని బసంతి అడిగిన దానికి అతనేదో చెప్పాడు. బసంతి నిశ్చేష్టగా నిలబడి వింటోంది. నాకు కొంచెం అర్థం అయింది. తర్వాత బసంతి చెప్పింది. జీపును కలప



లారీ గుద్దేసిందిట. ఆయన్ని హాస్పిటల్‌లో చేర్చారట. ఇతను వెనక కూర్చోవడంవల్ల చిన్నదెబ్బలు తగిలాయట. డ్రైవరు అక్కడిక క్కడే పోయాడుట. మాకు కాళ్ళూ చేతులు ఆడలేదు. ధైర్యం చెప్పేవాళ్ళూ లేరు. మరో డ్రైవర్‌ని అప్పటికప్పుడు అతనే తెచ్చాడు. ఆ జీపులోనే బసంతి, నేను, బసంతి అన్న య్యలు అందరం హాస్పిటల్‌కి వెళ్ళాం. అక్కడికి వెళ్ళేసరికి రాత్రి ఒంటిగంట దాటింది. ఆయన్ని ఇంటెన్సివ్ కేర్‌లో పెట్టారు. వేరే ఆలోచనలేవీ లేవు. అమ్మకి, మామయ్యగారికి ఫోన్లు చేయించాను. డాక్ట ర్లేమీ చెప్పడంలేదు. మర్నాడు పగలంతా అక్కడే ఉన్నాం. తిండీ తిప్పలు లేవు. భయం, బెంగా తప్ప. ఆయనని చూడడా నికి మమ్మల్ని వెళ్ళనివ్వలేదు. మర్నాడు సాయంత్రానికి ఆయనకి స్పృహ వచ్చిం దట. పొడారిన కళ్ళతో అలాగే కూర్చు న్నాం. అమ్మ, నాన్నగారు, మామయ్యగారూ ఫ్లైట్‌లో వచ్చారు.

అందరికీ టెన్షన్. అమ్మ నన్ను పట్టుకుని ఏడవడం మొదలుపెట్టింది. నాన్నగారు, మామయ్యగారూ డాక్టర్లతో మాట్లాడుతు న్నారు. దెబ్బలు బాగా తగిలాయి. ఊపిరి తిత్తులకి బాగా దెబ్బ తగిలిందిట. తెలివి లోనే ఉన్నారు. కానీ ఇప్పుడే ఏం చెప్పలేమ న్నారు. అయినా వాళ్ళ ప్రయత్నాలు వాళ్ళు చేస్తూనే ఉన్నారు. అమ్మా, నాన్న, మామ య్యగారూ దగ్గర్లో ఉన్న హోటల్లో గదులు తీసుకున్నారు. ఆ తర్వాతి రోజు ఆయన దగ్గరికి నన్ను తీసికెళ్ళారు. ఒంటినిండా కట్లు. ఆయన పరిస్థితి చాలా దయనీ యంగా ఉంది. నాకు ఏడవడానికి కూడా భయం వేసింది. నన్ను తన పక్కనే కూర్చో మని సైగ చేశారు. ఆయన ఏడుస్తున్నారు.

"మాధవీ, నా వల్ల నీకు అన్యాయం జరి గింది. క్షమిస్తావా!"

మాట ముద్దగా ఉంది. అంతే ఆయన నాతో మాట్లాడింది. నన్ను బయటికి పంపించారు. బసంతి దూరంగా నిలబడి చూస్తోంది. నేను దగ్గరగా వెళ్లాను. ఆమె రెండు చేతుల్లో మొహం దాచుకుని ఏడు స్తోంది. అమెకి ఆ ఆఖరి చూపులు కూడా దక్కలేదు. అమ్మ నన్ను కూచోపెట్టింది. ఆరోజు సాయంత్రం ఆయన పోయారు. ఆ నిజాన్ని ఎవరం జీర్ణించుకోలేకపోయాం. రూర్కెలా నించి అన్నయ్య కూడా వచ్చాడు. బాడీని కైకలూరు తీసుకెళ్లాలా వద్దా అని తర్జన భర్జన జరిగింది. చివరికి గౌహ తిలోనే మట్టిలో కలిపేశారు ఆయన్ని. అందరం తిరిగి ప్లాంటేషన్‌లోని క్వార్టర్స్‌కి వచ్చేశాం. అమ్మా వాళ్లు బసంతిని నాకు తోడుగా ఉన్న పనిమనిషి అనుకుంటు న్నారు. మూడు రోజుల తర్వాత నన్ను దగ్గిరాలకు శాశ్వతంగా తీసుకొచ్చే ఏర్పాట్లు చేస్తున్నారు.

ఆఫీసులో ఆయనకి రావలసిన డబ్బు అంతా నాన్న, మామయ్యగారు రాబట్టేశారు. అమ్మ వచ్చిన తర్వాత బసంతి వంటగది లోకి రాలేదు. మర్నాడు మా ప్రయాణమ నగా బసంతి అన్నయ్యలు వచ్చి ఆస్తిలో వాటాకోసం ఆయనకి వచ్చిన డబ్బుకోసం గొడవ చేశారు. అప్పుడే నాన్న వాళ్లందరికి బసంతి సంగతి తెలిసింది. మామయ్యగారు ఉగ్ర నరసింహమూర్తిలాగా అయ్యారు. నాన్నగారు ఆయన్ని శాంతపరచి, వాళ్లకి డబ్బు మాత్రం ఇచ్చి, గుళ్లో పెళ్లికి సాక్ష్యాలు లేవని, అది లీగల్ పెళ్లికాదని అందుకని ఆస్తిలో వాటా రాదని, ఇంకా గొడవ చేస్తే పోలీస్ రిపోర్టు ఇస్తామని బెదిరించారు. దాంతో వాళ్లూ తగ్గి వెళ్లిపోయారు. ఈ సంగతి తెలిసినప్పటి నుంచి అమ్మ ఏడు స్తూనే ఉంది.

నేను వచ్చేసే ముందు బసంతిని గదిలోకి పిల్చాను. లోపలికి అడుగుపెడ్తూనే నా కాళ్లకి చుట్టుకుని ఏడ్చేసింది. నేనే పెద్ద ఆరిందలాగా ఆమెని ఓదార్చి, నా పెళ్లికి మామయ్యగారు, అమ్మవాళ్లు పెట్టిన నగలన్నీ బలవంతంగా

ఇచ్చాను. అమ్మవాళ్లు కూడా దీనికి ఎందుకో అభ్యంతర పెట్టలేదు.

అమెకి అంతకంటే నేనేం చెయ్యలేకపోయాను. కానీ వాళ్లన్నయ్యలు ఆ డబ్బు ఆమెకి దక్కనిస్తారన్న నమ్మకంలేదు. నేను రహస్యంగా ఇచ్చిన ఆ నగలన్నా ఆమెని, ఆమె కొడుకుని ఆదుకుంటాయేమోనని నా ఆశ. అప్పుడప్పుడు ఇక్కడ అతి గారాబంగా పెరుగుతున్న అతుల్‌ని చూస్తే బసంతి కొడుకు, నేనెప్పుడు చూడలేదు కాని గుర్తొస్తాడు. ఆంటీ! అలా నా ఆరునెలల వివాహ జీవితం కడతేరింది. నా జీవితంలోకి హఠాత్తుగా ప్రవేశించి అలాగే మాయమయ్యారు ఆయన" అంది మాధవి నిర్వేదంగా. నాకూ మనసు బరువెక్కింది. మాటలు పెగల్లేదు. బాగా చీకటి పడింది. మాణిక్యమ్మగారు లేచి లైటు వేశారు. మళ్లీ మాధవే మాట్లాడింది.

> ఒకరికొకరు నిజంగా తోడూ నీడగా ఉంటున్నారా? అంతా లాటరీ ఆంటీ! అలాంటప్పుడు బయటికి రాలేని ఆ బోనులోకి వెళ్లడం ఎందుకూ? సుఖాన ఉన్న ప్రాణాన్ని కష్టపెట్టుకోవడం ఎందుకూ?

"తర్వాత నాన్నగారు హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నారు. నేను నా చదువు కంటిన్యూ చెయ్యాలని నిర్ణయించుకున్నాను. ఎం.ఎ. ఎకనామిక్స్ చేసిన తర్వాత ఎల్.ఐ.సి.లో ఉద్యోగం వచ్చింది. అతుల్ బాధ్యత అంతా అమ్మే తీసుకుంది. ఈలోగా అన్నయ్య పెళ్లి అయింది. నాన్నగారు రిటైరయ్యారు. ఇక్కడే నా కోసం ఈ ఇల్లు కొని సెటిల్ అయిపోయారు.

ఇప్పుడు నాకసలు మగవాళ్ల మీద నమ్మకం పోయింది. పెళ్లి చేసుకోవాలనీ లేదు. అయినా పెళ్లి అంత అవసరమా! జీవితంలో పెళ్లి ఒక భాగమే కానీ అదే జీవితం కాదుగా! పోనీ తోడుకోసం అనుకున్నా, పెళ్లిళ్లైన వాళ్లంతా ఒకరికొకరు నిజంగా తోడూ నీడగా ఉంటున్నారా? అంతా లాటరీ ఆంటీ! అలాంటప్పుడు బయటికి రాలేని ఆ బోనులోకి వెళ్లడం ఎందుకూ? సుఖాన ఉన్న ప్రాణాన్ని కష్టపెట్టుకోవడం ఎందుకూ? అన్నట్టు పాపం ప్రకాశం నేను ఇక్కడికి వచ్చేసిన తర్వాత అప్పుడప్పుడు వచ్చి చిన్నప్పటి స్నేహం పురస్కరించుకుని నన్ను ఓదార్చేవాడు. మంచి పుస్తకాలు కూడా తెచ్చిచ్చేవాడు. అఫ్‌కోర్స్! అదంతా వాళ్ల అత్తయ్యకు తెలియకుండానే అనుకోండీ" అంది ఎప్పటిలాగా మామూలుగా నవ్వుతూ.

నాకు మాటలు కరువయ్యాయి. ఇంక అక్కడ ఎక్కువసేపు ఉండలేకపోయాను.

ఇంటికొచ్చేముందు గేటుదాకా నాతో వచ్చిన మాధవితో, "మధూ! రాజశేఖరానికి వాళ్ళ చెల్లెల్ని బెదిరించి పెళ్లి చేసిన బసంతి వాళ్ళ అన్నయ్యలు, నిన్ను అతను పెళ్ళి చేసుకున్నాడని తెలిసీ ఊరుకున్నారా?" నెమ్మదిగా అడిగాను.

"మేం అక్కడ దిగిన రోజే ఆఫీసు పని అని ఆయన హడావుడిగా వెళ్ళింది వాళ్ళని కన్విన్స్ చేయడానికే. మేం వస్తున్నామని తెలిసి వాళ్ళు ఈయనతో దెబ్బలాడడానికి వద్దామనుకుంటున్నారని స్టేషన్‌లోనే ఆయనకు తెలిసింది. నాన్న వాళ్ళకి ఆయన ఆఫీసులో వాళ్లు చెప్పారట. నన్ను పెళ్ళి చేసుకోవడం పెద్దవాళ్లకోసం తప్పనిసరైందని వాళ్ళ చెల్లెలికి ఏం అన్యాయం జరగదని, ఆస్తిలో కూడా భాగం ఇస్తానని వాళ్లకి నచ్చచెప్పి మాట కూడా ఇచ్చి వచ్చారట చూశారా ఆంటీ! మగవారి మాయలు!" అంది నిర్వికారంగా నవ్వుతూ.

నేనేం చెప్పగలను? ఇంటి దారి పట్టాను. మీనా తలుపు తీసింది. ఆమె ముఖంలో

ఆదుర్దా. "ఏమిటత్తయ్యగారూ! ఇంతసేపున్నారు? అలా ఉన్నా రేమిటి? " అంది నా ముఖంలోకి పరిశీలనగా చూస్తూ.

"ఏం లేదులే! నువ్వు ఒక్కదానివే ఉన్నావేమిటి? రవి ఏడీ? " అన్నాను లోపలికి నడుస్తూ.

"పనుందని వెళ్ళారు" ముభావంగా ఉంది జవాబు.

నేను డల్‌గా సోఫాలో కూర్చున్నాను.

"మీరు భోజనం చేసేయండి. ఆయన ఎప్పుడొస్తారో? పొద్దుపోతే మీకు అరగదు" అంది.

"ఇప్పుడు తినాలని లేదు వాణ్ణి కూడా రానీ" అన్నాను కళ్ళు మూసుకుని వెనక్కి వాలుతూ.

"ఎందుకంత నీరసంగా ఉన్నారు? మళ్ళీ జ్వరం వచ్చిందా? " అంటూ నా దగ్గరికి వచ్చి నుదుటి మీద చెయ్యివేసి చూసింది. చెయ్యి చల్లగా హాయిగా అనిపించింది.

ఆ చెయ్యి పట్టుకుని, "ఇలా రా కూర్చో ఏమైంది? అలా ఉన్నావు? " అన్నాను అనునయంగా

జవాబు చెప్పకుండా కళ్ళు వాల్చుకుంది మీనా.

గుచ్చి గుచ్చి అడగ్గా అప్పుడు చెప్పింది.

"మీరు లేనప్పుడు సుందరమ్మగారు వచ్చేది. వచ్చినప్పుడల్లా మాధవి వల్ల మా కాపురానికి ఎంత ప్రమాదమో నైసనైసలుగా చెప్పి భయపెట్టేది. మాధవి కొంపలు కాల్చే కొరివి అనీ, మొగుడూ మొద్దులూ లేకుండా అలా వూరి మీద పడి తిరిగే వాళ్ల వలన కాపురాలు ఎలా కూలిపోతాయని ఏవేవో వివరించేది. ఆ విషయం మీదే మా మధ్య గొడవ జరిగింది అత్తయ్యగారూ".

నాకు నవ్వొచ్చింది. ఆమె అమాయకత్వానికి.

"మీనా! ఆ సుందరమ్మ ఎలాంటిదో మనం చూస్తూనే ఉన్నాం. అయినా ఆమె మాటలు ఎలా నమ్మావు? పైగా ఇది రవి దాకా తీసుకెళ్ళడమే కాకుండా గొడవ కూడానా! ఏమిటమ్మా ఇది? " అన్నాను మందలింపుగా.

"ఆమె మాటలు వింటుంటే భయమేసింది అత్తయ్యగారూ! మాధవి వచ్చినప్పుడల్లా వాళ్ళిద్దరూ మాట్లాడే ప్రతి మాటకి గూఢార్థం ఉన్నట్టే అనిపించేది. మీరు కూడా లేరు కదా!" అంది సంజాయిషీగా.

"నేను ఎప్పుడూ ఉంటానా? భార్యాభర్తల మధ్య ఉండవలసింది ప్రేమకంటే నమ్మకం. అసలు ఏ సంబంధానికైనా ప్రాతిపదిక నమ్మకమే కదా! అది లేనప్పుడు అవతలివాళ్ళు ఏం చేసినా, ఏం చెప్పినా మన అనుమానాన్ని బలపరుస్తున్నట్టే ఉంటుంది. అందుకే, 'అనుమానం పెనుభూతం' అంటారు. చదువుకున్నదానికి కదా, నువ్వు కూడా ఇలా ఆలోచించవచ్చా? "

భార్యాభర్తల మధ్య ఉండవలసింది ప్రేమకంటే నమ్మకం. అసలు ఏ సంబంధానికైనా ప్రాతిపదిక నమ్మకమే కదా! అది లేనప్పుడు అవతలివాళ్ళు ఏం చేసినా, ఏం చెప్పినా మన అనుమానాన్ని బలపరుస్తున్నట్టే ఉంటుంది



మీనా తల వంచుకుని కూర్చుంది. ఆమెకి మాధవి గతం క్లుప్తంగా చెప్పాను. అది అప్పుడు అవసరమే! మీనా వింటూ ఏడ్చేసింది. నేనే ఓదార్చాల్సి వచ్చింది. "మాధవి పేరెంట్స్ ఆ అమ్మాయికి పెళ్ళి చేయాలని చూస్తున్నారు. కానీ తనే ఒప్పుకోవడం లేదు. అందరితో కలివిడిగా ఉండటం ఆమె స్వభావం" అన్నాను ఆలోచిస్తూ.

మీనా కన్విన్స్ అయింది. ఈ సుందరమ్మ విషయంలో ఏదో చేయాలి లాభంలేదు అనుకున్నాను.

ఎక్కువ రోజులు ఎదురుచూడకుండానే అలాంటి అవకాశం నాకు వచ్చింది.

## 15



ఇది జరిగిన వారం రోజులకి ఆరోజు ఇంకా తెల్లవారలేదు. హఠాత్తుగా సుందరమ్మగారింట్లో నుంచి పెద్దగా ఏడుపులు వినిపించాయి. నిద్రమంచాల మీద నుంచి అందరం ఉలిక్కిపడి లేచాం. రవి, మీనా, వాళ్ళింటికేసి పరిగెత్తారు. నేను బాల్కనీలోంచి వచ్చి ఆ ఇంటివైపు చూశాను. ఏం జరిగిందో అర్థం కావడంలేదు. వెళ్ళిన వాళ్ళూ రాలేదు. పది నిముషాల తర్వాత రవి వచ్చాడు.

"ఏమైంది? " ఆతృతగా ఎదురు వెళ్ళి అడిగాను. మాట్లాడకుండా బెడ్‌రూంలోకి వెళ్లి హడావుడిగా నైట్ డ్రెస్ మార్చి పాంటు షర్ట్ వేసుకుంటున్నాడు. "ఏమైందిరా? " నాకు కంగారుగా ఉంది.

"అమ్మా! ప్రకాశం స్లీపింగ్ పిల్స్ మింగాడు. అతన్ని వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి" అంటూ పర్స్‌లో డబ్బులు పెట్టుకుని వచ్చినంత వేగంగా వెళ్ళిపోయాడు.

నాకు మతిపోయినంత పనైంది. కాసేపటికి మీనా వచ్చింది.

"ఏం జరిగింది మీనా? ప్రకాశం స్లీపింగ్ పిల్స్ మింగడమేంటి? ఇప్పుడెలా ఉన్నాడు? ప్రమాదమేం లేదు కదా? "

"స్పృహలో లేదు. మీ అబ్బాయి, మన ఎదురింటి సాంబశివంగారు కలిసి హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. వనజకి ఎవర్తోనో అక్రమ సంబంధం ఉందని రాత్రి సుందరమ్మ వనజని సతాయించడం మొదలుపెట్టిందట. ప్రకాశం విసుక్కున్నాడుట. ఆమె ఇద్దర్నీ కలిపి తిట్టిపోసి, వాళ్ళిద్దరూ కలిసి తనని చంపడానికి ప్లాన్ వేస్తున్నారని ఏదేదో మాట్లాడిందట. రాత్రి పన్నెండింటివరకూ అలా గొడవ చేస్తూనే వుందట. తెల్లవారుఝామున వనజ లేచి బాత్‌రూంకి వెళ్ళి వచ్చేసరికి కదలకుండా పడుకుని ఉన్నాట్ట. నిద్రేమోలే అని కాసేపు చూసిందట. కానీ అతను మామూలుగా ఉన్నట్టనిపించక కదిపిందట. అప్పుడే సుందరమ్మ పాలపాకెట్టు తెచ్చి, బెడ్‌రూం తలుపు తీసి వుంటే లోపలికెళ్ళి చూసిందట. దిండుకింద టాబ్లెట్ల సీసా ఖాళీది కనిపించిందిట. ఇద్దరూ ఒకటే ఏడుపు. పాపం! వనజ కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది" అంది జాలిగా.

నేను గబగబా నా పనులు ముగించుకుని కాఫీ చేసి, ఫ్లాస్క్‌లో పోసి "మీనా, కాఫీ వాళ్ళకి ఇచ్చి నేను అక్కడ ఉంటాను. నువ్వు నీ పని చూసుకుని రా!" అన్నాను మెట్లు దిగుతూ.

గేటు తీసుకుని లోపలికి వెళ్ళాను.

మధ్య హాలులో సుందరమ్మ పిచ్చిదానిలాగా తనలో తనే ఏదో గొణుక్కుంటోంది. నన్ను చూస్తూనే పరుగులాంటి నడకతో నా

దగ్గరకి వచ్చి

"చూశారా! లలితమ్మగారూ! మా ప్రకాశం ఎంతపని చేశాడో?" అంది ఏడుస్తూ.

నేను ఆమెని కుర్చీలో కూర్చోబెట్టి "సమయానికి ఆస్పత్రికి తీసుకెళ్ళారు కాబట్టి ప్రమాదం ఉండదు. ముందు మీరు కాస్త కాఫీ తాగండి" అన్నాను ఫ్లాస్క్ మూత తీస్తూ.

"అబ్బే! ఇప్పుడు నాకేం వద్దు. నా గుండె మండిపోతోంది. వీడికోసం నేను నా జీవితమంతా ధారపోశాను. పనిదానికంటే హీనంగా చాకిరీ చేస్తుంటే వాడు నాకు చేసిన ఉపకారం ఇదీ! ఇప్పుడు మా అన్నయ్యా వాళ్ళకి నేనేం జవాబు చెప్పాలి?" అంది మళ్ళీ ఏడుస్తూ. వనజ పక్క గదిలో నుండి వచ్చింది. రేగిన జుట్టు. ఎర్రబడ్డ కళ్ళు. దైన్యానికి ప్రతిరూపంలా ఉంది.

"వనజా! ప్రకాశానికి ఏంకాదు. నువ్వు ధైర్యంగా ఉండాలి. ముందు కాస్త కాఫీ తాగు" చొరవగా వంటింట్లోకి వెళ్ళి కప్పులు తెచ్చాను. ఆమె మాట్లాడకుండా ఏడుస్తూ నిలబడింది.

"మీరెందుకు శ్రమపడి తెచ్చారు? వాడి కట్లా ఉంటే కాఫీ గొంతు దిగుతుందా!" అంది వనజకేసి చూస్తూ నన్నుద్దేశించి.

"పెద్దవారు. ఆ అమ్మాయికి ధైర్యం చెప్పదంపోయి మీరే ఇలా మాట్లాడొచ్చా?" అంటూ ఇద్దరికీ బలవంతంగా కాఫీ ఇచ్చాను.

సుందరమ్మగారు జరిగిందేమిటో చెప్పబోయింది. నేను వారించాను.

"ముందు మీరు స్థిమితంగా కూర్చోండి. తర్వాత మాట్లాడుకుందాం. వనజా! రా! ఇలా కూర్చో" అన్నాను.

రవి దగ్గర్నుంచి ఫోన్ వచ్చింది. ప్రకాశానికి. స్టమక్ వాష్ చేస్తున్నారట. ప్రమాదం లేదని, దగ్గర్లో ఉన్న ప్రైవేట్ హాస్పిటల్‌లో సాంబశివంగారికి తెలిసిన డాక్టరు ఉన్నాడని అభ్యంతరపెట్టకుండా చేర్చుకున్నారని చెప్పాడు. నేను వనజకి, సుందరమ్మగారికీ ఈ విషయం చెప్పాను. ఆమె లేచి కనిపించని దేవుడికి దండం పెడుతోంది.

వనజ సన్నగా "లలితమ్మగారూ! కాస్త ఈ నంబర్‌కి ఫోన్‌చేసి మా అత్తయ్యగార్ని, మామయ్యగార్ని రమ్మని చెప్పండి" అంటూ చిన్న పేపరు నా చేతికిచ్చింది.

సుందరమ్మ ఆమె మాటలు వింది.

"ఇప్పుడు వాళ్ళెందుకూ! అనవసరంగా కంగారుపడడానికా? ప్రమాదం తప్పిందిగా! ఏం వద్దులెండి" అంది.

"పోనీ, రానీండీ, మీకు కాస్త తోడుగా ఉంటారు. వాళ్ళేం పరాయివాళ్ళు కాదుగా! పైగా ఇంత జరిగినా చెప్పలేదని తర్వాత మిమ్మల్నీ అంటారు" అన్నాను చనువుగా.

ఏమనుకుందో మరేం మాట్లాడకుండా వనజకేసి మిర్రి మిర్రి చూసింది. వాళ్ళకి నేనే ఫోన్‌చేసి విషయం వివరించి, కంగారు పడొద్దని నెమ్మదిగానే రమ్మని చెప్పాను. కాసేపుండి నేను ఇంటికి వచ్చేశాను.

రవి పదిగంటలకి ఇంటికొచ్చాడు. ప్రకాశానికి స్పృహ వచ్చిందట. సుందరమ్మ ఆస్పత్రికి వచ్చి రవిని ఇంటికి వెళ్ళమందట. ఆదరా బాదరాగా ఆఫీసుకి తయారవుతూ.

"చూశావా అమ్మా! ఇలాంటప్పుడు కూడా పాపం అతని భార్యని రానీకుండా తనే వచ్చింది ప్రకాశం దగ్గరికి" అన్నాడు రవి. మీనా వనజకి తోడుగా ఉంటానని వెళ్ళింది. వెళ్లిన పది నిమిషాలకే వచ్చేసింది. సుందరమ్మ వచ్చేసిందట.

"అత్తయ్యగారు! ఆవిడ వస్తూనే నన్నూ, వనజని అనుమానంగా చూసి నేను వచ్చి ఎంతసేపయిందని ఆరాలు అడిగింది. వనజ నాకేమైనా చెప్పుందని భయం కాబోలు"

"అదే! తప్పుచేస్తే అలాగే ఉంటుంది" అన్నాను.

"ఇలా వేధిస్తుంటే వాళ్ళెట్లా బతుకుతారు పాపం!" మీనా జాలిపడింది.

## ఎత్తు నుంచి దిగడు!



మెరక వచ్చినా దిగి తొయ్యకుండా రిక్షా నడిపే అహ్మదుకు దేవులపల్లి కృష్ణశాస్త్రి సరస ప్రశంస ఇదీ..

'అహ్మద్‌ది ఎత్తునుంచి దిగే గుణం కాదు' అంటూ ఉభయ అర్థాలూ పండించారు. మెరక వచ్చినప్పుడు బండి దిగకుండానే నడపగల నేర్పరి అని ఒక అర్థంకాగా ఉన్నత స్థాయి నుంచి దిగజారడనేది మరో శ్లేషార్థం. తమాషాగా లేదూ?

"రోజులెప్పుడూ ఒకేలాగా వుండవు. మీనా! ఆ అమ్మాయికీ మంచిరోజులు వస్తాయి" అన్నాను నమ్మకంతో.

ఆరోజు సాయంత్రం ప్రకాశాన్ని ఇంటికి పంపించారు. నేను, మీనా వెళ్లి అతన్ని పలకరించి, పది నిముషాలుండి వచ్చేశాము. మేమున్నంతసేపూ సుందరమ్మ అతని మంచం దగ్గర్నించి కదలలేదు. రాత్రి భోజనాలు అయిన తర్వాత రవి తీరుబడిగా ప్రకాశం దగ్గరికి వెళ్లాడు. ప్రకాశం తల్లి, తండ్రి, పెద్దన్నా వచ్చారుట. ఆ తల్లి ప్రకాశాన్ని పట్టుకుని ఒకటే ఏడుపుట. ఏంజరిగిందని వాళ్లు అడిగితే, వనజ వల్లే వాడు ఆపని చేశాడని, ఆమె వలన అతనికేం సుఖంలేదని, రోజూ ఎక్కడో తిరిగి పొద్దుపోయి వస్తుందని ఏదో పొంతన లేకుండా మాట్లాడిందిట సుందరమ్మ.

సాంబశివంగారూ, ఆయన భార్యా వచ్చారుట అక్కడికి. వాళ్లు అలాంటిదేం లేదని రోజంతా ఏదో కారణం చూపించి సుందరమ్మ పెద్దగా అరుస్తుంటుందని, వనజా వాళ్ల సంసారంలో ఆవిడ జోక్యం అవసరాన్ని మించి వుంటుందని, రోజుకోరకం గొడవ అనీ, భరించడం కష్టంగా వుందని ఆమె ముందే నిర్మొహమాటంగా చెప్పారుట. సుందరమ్మ వాళ్ల మీద కూడా తాడెత్తున లేచిందట. ప్రకాశం తండ్రి ఆవిడకు బాగా చివాట్లు పెట్టాడట. ప్రకాశం అన్నయ్య ఆవిణ్ణి కొట్టినంత పనిచేసి వాళ్లని వేధిస్తే ఊరుకునేది లేదని గట్టిగా వార్నింగ్ ఇచ్చాడుట.

రవి ఇదంతా తర్వాత మాకు చెప్తూ,

"అమ్మా! అప్పుడా సుందరమ్మని చూడాలమ్మా! కుడితిలోపడ్డ ఎలుకలాగా కొట్టుకుంది. అవతలి పక్షం బలంగా ఉండడం వలన బుసలు కొడుతూ కోపంగా చూస్తూ ఊరుకుంది" అన్నాడు నవ్వుతూ.

"ఈ కాస్తకే ఆవిడ మారిపోతుందనుకుంటున్నారా. ఎక్కడి వాళ్లు అక్కడికి వెళ్లిపోతే రేపట్నించి ఆమె ధోరణి మామూలుగానే ఉంటుంది" అంది మీనా.

"అంత త్వరగా మారడానికి ఇదేం సినిమానా? కాని ఆవిడ కాస్త మానసికంగా బలహీన పడిందేమోనని నా అనుమానం" అన్నాడు రవి.

ప్రకాశం కోలుకున్నాడు. వాళ్ల వాళ్లు రెండు రోజులుండి వెళ్లిపోయారు. వాళ్లున్న రెండు రోజులు మేం ప్రశాంతత అనుభవించాం. వాళ్ల అన్న, వదినె ఊరు వెళ్లిన తర్వాత సుందరమ్మ మా ఇంటికి వచ్చింది. మనిషి నిజంగానే కాస్త డీలా పడింది.

తను ప్రకాశాన్ని ప్రేమగా పెంచితే, అందరూ ఏకమై తనని అన్యాయంగా ఏడిపిస్తున్నారని చెప్పుకొని ఏడ్చింది. 'ఇనుము

బాగా కాలింది ఇప్పుడే వంచాలి' అనుకున్నాను. "ఎంత కాలం ఇలా మీ శక్తిని వాళ్లకి ధారపోస్తారు? మీరు కూడా ఇహం పరం చూసుకోవద్దూ? అన్నీ మీరే చేసి పెడుతుంటే ఆ వనజకేం వస్తుంది. చాకిరి చేస్తూ మాటలు పడుతున్నారు" అవిడ ధోరణిలోనే మాట్లాడటం ప్రారంభించాను.

వస్తుంది" అన్నాను.

"ఆఁ! నా బతుక్కి అంత అదృష్టం కూడానా! నేను ఒక్క క్షణం ఇంట్లో లేకపోతే కొంప కొల్లేరయిపోదూ!" అంది సాగదీస్తూ.

"ఏం అవదూ. మీలో ఈ బలహీనత చూసే మిమ్మల్ని జీతం లేని పనిమనిషిలా



వాడుకుంటున్నారు వాళ్లు" అన్నాను. గరళాన్ని మందుగా కూడా వాడొచ్చు అదే నేను చేస్తున్నాను. ఆమె ఏం మాట్లాడలేదు. అదే నాకు బలమిచ్చింది.

"ఆ ఇల్లే మీకు లోకం కాదని మీకంటూ వ్యాపకాలు మీకున్నాయని వాళ్లకి తెలియాలండీ! లేకపోతే ఎక్కడికీ పోలేదు. ఇక్కడే

ఆమె బిత్తరపోయింది.

"అదేనండీ! నేననేది ఏమిటంటే, కాస్త ఆ అమ్మాయి మీద కూడా ఇల్లు వదిలిపెట్టండి సాయంత్రం రోజూ మేం అలా వెంకటేశ్వర స్వామి గుడికి వెళ్తుంటాం. మీరూ మాతో రండి కాస్త ప్రశాంతంగా ఉంటుంది మీక్కూడా! పైగా మీ విలువ వాళ్లకీ తెలిసి

గతిలేనట్లు చాకిరీ చేస్తూ పడుంటారని వాళ్ల నుకుంటారు" అన్నాను రెచ్చగొడ్తూ.

"నాకు గతి లేకపోవడమేమిటి. మనోవర్తి కింద నాకు పొలం ఉంది. ఎవరి దయా దాక్షిణ్యాల మీదా నేను బతకక్కర్లేదు. మీరెమనుకుంటున్నారో" అంది అతిశయంగా.

మీనాకి మా సంభాషణ ఎక్కడికి దారి తీస్తుందో అర్థం కాలేదు. అయోమయంగా నాకేసి చూసింది. నేను చిరునవ్వు నవ్వాను.



"అదీ! అలా ధైర్యంగా మీ బతుకు మీదని వాళ్లకి తెలియచెయ్యండి. మీ కెంత తెలివి, సమర్థత ఉన్నాయో నేను చూస్తూనే ఉన్నాను కదా! ఇల్లంతా అద్దంలాగా ఉంచుతారు. చక్కటి ముగ్గులేస్తారు" ఆమెను ఉబ్బేయసాగాను.

ఆమె నాకేసి అనుమానంగా చూసింది.

"అహా! మన వయసు వాళ్ల విలువ వాళ్లకి అంత తేలిగ్గా తెలీదండీ! అందుకే చెప్తున్నాను" అన్నాను, పొగడ్త డోసు మరీ ఎక్కువైందేమోనని జాగ్రత్త పడుతూ.

"నిజమే! అంతా తనే సమర్థించుకోవడం ఆ పిల్ల వల్లేం అవుతుందీ! టింగురంగా అంటూ అలంకరించుకుని. ఊరిమీద తిరగడం తప్పితే ఇటు పుల్ల తీసి అటూ పెట్టడం రాదు" అంది అక్కసుగా.

"అదే మరి. అందుకే సాయంత్రాలు మాతో గుడికి వస్తుండండి రోజూ" అన్నాను ముక్తాయింపుగా.

ఆమె మాట్లాడలేదు.

నా కంఠశోష వృథా అవలేదు.

మర్నాడు సాయంత్రం ఐదున్నర గంటలకే "లలితమ్మగారూ! బయల్దేరదామా!' అంటూ మేడ మీదకి వచ్చింది.

"రండి. అత్తయ్యగారు తయారవుతున్నారు కూర్చోండి" అని మీనా లోపలికొచ్చింది.

"అత్తయ్యగారు! మీ మందు బాగానే పని చేసినట్టుంది" అంది నవ్వుతూ గుసగుసగా.

అలా ఆమెను గుడికి తరలించడం జగన్నాథ రథాన్ని కదిలించినంత పనైంది.

రోజూ గుళ్లో ఆరు గంటల నుంచి ఏడు న్నర వరకూ లలితా సహస్ర నామాలు, విష్ణు సహస్ర నామాలు సామూహికంగా చదువుతారు.

తర్వాత కాస్త సంగీత జ్ఞానం ఉండి, కంఠ స్వరం బాగున్న భక్తులు భక్తిపాటలు పాడ తారు. ఇంతలో దేవుడికి పూజా, నివేదన పూర్తి అవుతుంది. తీర్థ ప్రసాదాలు తీసు కుని ఎనిమిది గంటలలోపే ఇళ్లు చేరుతాం.

మాణిక్యమ్మగారు, నేను అందరితో కూర్చుని సహస్రనామాలు చదువుతుంటే సుందరమ్మగారు దిక్కులు చూస్తూ కూర్చుంది. ఎవరో పుస్తకం అందించబో యారు. వద్దంది. చదవడం రాదేమోనని అనుమానమొచ్చింది. కాని గమనించనట్టే ఉన్నాం. తర్వాత ఎవరో కృష్ణాష్టకం చది వారు. సుందరమ్మ కూడా చిన్నగా కూని రాగం తీసింది.

"మీకు కృష్ణాష్టకం వచ్చా? బాగా పాడు తున్నారు" అన్నాను మెచ్చుకోలుగా. నిజం గానే ఆమె గొంతు బాగుంది.

"ఆc! నా మొహం. పనిచేసుకుంటూ మా అమ్మ పాడుతుండేది. అదే కొంచెం గుర్తుంది" అంది కొంచెం సిగ్గుపడుతూ.

"మీ గొంతు కూడా బావుంది. సంగీతం నేర్చుకున్నారా?" అన్నాను కాస్త చనువు తీసుకుంటూ.

"చిన్నప్పుడు సుందరం బాగా పాడేది!" అంది మాణిక్యమ్మగారు.

"ఏదో వచ్చీరాని పాటలు... బోగం వాళ్ల లాగా పాటలు, డ్యాన్సులు నాకిష్టముండవు" ఆ సాయంత్రం ఆమె తన మామూలు పరి భాషలో మాట్లాడటం అదే మొదటిసారి. నాకు నవ్వొచ్చింది. పాత అలవాట్లు అంత త్వరగా మారవు.

"బోగం వాళ్ల పాటలు నాక్కూడా తెలీవు కానీ, ఇక్కడంతా భక్తి పాటలేగా పాడుతు న్నారు. మీకొచ్చినవి మీరు పాడచ్చుగా!" అన్నాను. ఇంతలో నివేదన అయింది. అందరం లేచి నిల్చున్నాం.

అప్పటి నుండి రోజూ కాకపోయినా చాలా తరుచుగానే మాతో ఆమె గుడికి రావడం మొదలుపెట్టింది. వారం పదిరోజుల తర్వాత రోజూ రావడం మొదలైంది. అలా ప్రతిరోజూ రెండు రెండున్నర గంటలపాటు వనజకి, ప్రకాశానికి ఏకాంతం దొరికేది.

స్వతహాగా తెలివిగలది అవడంవల్ల తొంద రగానే సహస్రనామాలు తప్పులున్నా పలకడం నేర్చుకుంది. ఇదంతా చూసి, "మొత్తానికి సాధించారు విజయాన్ని" అంది మీనా నవ్వుతూ. 'గొప్పదానివమ్మా, మహిళా!' కూని రాగంతో కాంప్లిమెంటు ఇచ్చాడు రవి.

నాకు కాలేజీ తెరవడంతో నేను గుంటూరు వెళ్లిపోయాను. నా సర్వీసు ఇంకా ఆరు నెలలుంది. నేను గుంటూరు వెళ్లేముందు రోజు సాయంత్రం మాధవి వచ్చింది. శని, ఆదివారాలు ఆ అమ్మాయి మా ఇంటికి రావడం అలవాటైపోయింది. ఆమె ఉన్నంతసేపూ ఇల్లు నవ్వుల పూల తోటే! ఇప్పుడు మీనా కూడా నిష్కల్మషంగా మాట్లాడగలుగుతోంది మాధవితో.

"రిటైరైన తర్వాత ఏంచేస్తారు ఆంటీ! ఇక్కడికొచ్చేస్తారా?" అని అడిగింది.

"రిటైరైన తర్వాత కూడా గుంటూరులో మా ఇల్లుందిగా! అక్కడే ఉంటాను. దాంట్లో నాకున్న రిసోర్సెస్‌తో ఒక చిన్న ఓల్డ్‌ఏజ్ హోం నడపాలనుకుంటున్నాను. దిక్కులేని పెద్దవాళ్లకు సాయం చేసినట్టుంటుంది. నాకూ నా వయసువాళ్ల స్నేహం దొరుకు తుంది" అన్నాను. మొదటిసారిగా నా ఆలో చనలు బయటపెట్టాను.

రవి, మీనా ముందు ఈ ఆలోచనని ప్రతి ఘటించినా, నా ఆసక్తి చూసి మెత్తబడి, నాకు సపోర్టు ఇచ్చారు.

"రిటైరైనాక కూడా ఇంకా కష్టపడాలా?" అని రవి కోపంగా అడిగాడు.

"ఇష్టంగా చేసేపని కష్టంగా ఉండదురా. అయినా అదేమంత కష్టమైన పనేమీ కాదు.

ఆయా, పనిమనిషి అందరూ ఉంటారు" అన్నాను.

ఒక్క క్షణం వాడు మాట్లాడలేదు.

"అమ్మా!" అన్నాడు చిన్నగా.

"ఏమిట్రా? "

"రిటైరయి ఇక్కడికి వచ్చేస్తే మేం నిన్ను పట్టించుకోమని, నీకు విలువ, గౌరవం ఉండవని అనుమానమా? " అడగలేక అడిగాడు.

"అదేంటి నాన్నా! నాకలాంటి అనుమానాలేం లేవురా! నేను నాటిన మొక్క గురించి నాకు తెలియదా? " అన్నాను ప్రేమగా.

"నేను కానీ, మీనా కానీ నీకు నచ్చని పని, కష్టం కలిగించే పనేమయినా చేస్తామా? " అన్నాడు డగ్గుత్తికతో. నాకు నవ్వొచ్చింది. చిన్నప్పటి నుంచి రవి చాలా సెన్సిటివ్. ప్రతి విషయాన్ని అవసరానికి మించి లోతుగా ఆలోచిస్తాడు.

"ప్రతి మనిషిలో ఏదో ఒక వ్యాపకం ఉండాలికదా? ఆ వ్యాపకం మనకి కాలక్షేపమే కాక, ఇతర్లకి అంటే పదిమందికీ ఓదార్పు ఆలంబన అవడం బావుండదూ? " అన్నాను.

నాకు మావారు గుర్తొచ్చారు. నా కళ్లు కొద్దిగా చెమర్చాయి. "రవీ! మీ నాన్నగారు ఎప్పుడూ గుడికి వచ్చేవారు కాదు. ఆయన చేత నేను ఒక్కసారైనా దేవుడికి దణ్ణం పెట్టించలేకపోయాను. 'దేవుడు నాలుగు గోడల మధ్య బందీ కాదు. మన పనిలో, మన చుట్టూ ఉన్నవారిలోనే ఉన్నాడు' అనేవారు. అలాగే ఆయన పనిలో చాలా 'నిజాయితీపరుడు' అని పేరేకాక 'ఆపద్బాంధవుడు' అని చుట్టాలు, తెలిసిన వాళ్లూ అనేవారు. నీకు గుర్తుందా? ఎక్కడ ఎవరికి, ఎలాంటి కష్టం వచ్చినా ఆదుకోవడానికి అది వీలుకానిదైతే కనీసం పంచుకోవడానికీ ముందుండేవారు. మరి ఆయన భార్యగా నేనీ మాత్రమైనా చేయొద్దా? " అన్నాను.

వాడు కళ్లజోడు తీసి కళ్లు తుడుచుకున్నాడు.

"నీ ఇష్టం అమ్మా!" అంటూ నా పక్కకి వచ్చి కూర్చున్నాడు. వాడు నామీద ప్రేమ ప్రకటించే పద్ధతి ఇదే!

మాణిక్యమ్మగారు నేను గుంటూరు వెళ్తున్నానని తెలిసి కాస్త దిగులుపడ్డారు. సుందరమ్మగారు కూడా. "మీరు వెళ్లిపోతే మాకేం తోచదు. ఒంటరి వాళ్లమైనట్టుంటుంది" అంది. ఆవిడ మాటల్లో నిజాయితీ ఉంది.




నేను గుంటూరు వచ్చినప్పటి నుంచీ కాలేజీ, నేను పెట్టబోయే ఆశ్రమానికి ఏర్పాట్లతో తీరిక లేకుండా ఉంది.

రవి, మీనా యథాప్రకారం మూడురోజులకొకసారి ఫోన్‌చేసి క్షేమసమాచారాలు తెలుసుకుని ఆరోగ్యం గురించి హెచ్చరించేవారు. ఈసారి కొత్తగా మాధవి నుంచి క్రమం తప్పకుండా పదిహేను రోజులకొకసారి ఉత్తరాలు అందుకోవడం అదనపు అలవాటుగా మారింది.

రోజులు దొర్లిపోయి నెలలుగా మారుతున్నాయి. మాధవి రాసిన ఒక ఉత్తరం నాకు ఆనందాన్ని మోసుకొచ్చింది. "ఆంటీ! ఏం మంత్రం వేశారో మరి. సుందరం పిన్నీ అమ్మతో కలిసి రోజూ క్రమం తప్పకుండా గుడికి వెళ్తోంది. ఏ రోజన్నా అమ్మ కొంచెం బద్ధకిస్తే ఇంట్లో ఏంచేస్తావు మాణిక్యం అక్కయ్యా! అలా గుడికి వెళ్తే కాస్త పుణ్యమైనా వస్తుంది కదా!" అంటూ కసిరి మరీ అమ్మని కదిలిస్తోంది. మీరు ఆమె కంఠస్వరం బావుం

టుందని పొగిడారుట కదా! అమ్మ చెప్పింది లెండి. అది టానిక్‌లాగా పనిచేసినట్టుంది. అప్పుడప్పుడు మైక్ దగ్గర ఒకటీ అరా పాటలు కూడా పాడుతోందట."

ఆమె జీవితం ఇంక పట్టాలమీద రైలులా సాగిపోతుందని నాకు తెలుసు.

మరో లెటర్‌లో, "వనజ, ప్రకాశం ఇప్పుడు తరచూ సాయంత్రాలు కలిసి రోడ్డుమీద కని పిస్తున్నారు. సాంబశివంగారు ఈ మధ్య నాన్నగారికి ఒంట్లో బాగా లేకపోతే చూడ్డానికి వచ్చారు. ఆమె అరుపులు, గొడవలు కాస్త తగ్గాయి. కాస్త ప్రశాంతంగా ఉంటున్నాం అన్నారట. ఎప్పుడో సాయంత్రం గుడికి వెళ్తే దీని ప్రభావం రోజంతా ఎలా ఉంటుందని ఆశ్చర్యం కలిగింది. దేవుడి కోసం గుడికి రోజూ పూలమాలలు, తులసి మాలలు స్వయంగా తయారుచేసి తీసుకెళుతోందట. అంటే సాయంత్రం గుడికి వెళ్లడానికి పొద్దుటి నుండీ ప్రయత్నాలు మొదలుపెడుతోంది. పాపం! ఇక సుందరం పిన్నికి ప్రకాశాన్ని, వన జని చక్కదిద్దే టైం ఎక్కడుంది? అని పైగా కొసమెరుపులాగా.

"కోతికి కొబ్బరికాయ దొరికినట్టు, సుందరం పిన్నికి బలే కాలక్షేపం ఏర్పాటు చేశారు ఆంటీ!" అని రాసింది.

ఆ లెటర్ చదివి నేను నవ్వుకున్నాను. ఎక్కడో మనసు మారుమూల రవ్వంత తృప్తిగా కూడా అనిపించకపోలేదు.

ప్రతి ఉత్తరంలోనూ రవి, మీనాల ప్రసక్తి తప్పని సరిగా ఉండేది. ఒక దాంట్లో మా

## ఇన్సులిన్ ఇంజక్షన్లకి... గుడ్‌బై...

మధుమేహ వ్యాధితో బాధపడే వాళ్ళని చూశారా..! ఇన్సు లిన్ ఇంజక్షన్‌లను వాళ్ళే స్వయంగా చేసుకుం టారు. అలాంటి వాళ్ళని కదిలిస్తే చాలు "ఏం ఇంజక్షన్లో ఏమిటో, ఒళ్ళంతా తూట్లు పడిపోతోందని" వాపోతుంటారు.

అయితే వాళ్లకి ఇహ ఆ బాధ అవసరం లేదంటున్నారు అమెరికన్ డయాబె టిస్ అసోసియేషన్‌కి చెందిన రాబర్ట్ రిజా. ఇన్సులిన్ ఇంజక్షన్ల బాధ తప్పించే, నెప్పిలేని సదుపాయాన్ని ఆయన కనుగొన్నారు. అదే ఇన్‌హేల్డ్ ఇన్సులిన్ విధానం. దీనికి త్వరలోనే అమెరికా ప్రభుత్వం ఆమోద ముద్ర లభించనుంది. మధుమేహ రోగులు ముఖ్యంగా ఇన్సులిన్ తీసుకునేవాళ్ళు పౌడర్ రూపంలోని ఇన్సులిన్‌ని, ప్రత్యే కంగా తయారు చేసిన ఇన్‌హేలర్ ద్వారా పీల్చుకోవచ్చు ఇలా పీల్చుకున్న వెంటనే భోజనం చెయ్యాలి.

పీల్చిన ఇన్సులిన్ పౌడర్ ఊపిరితిత్తులకు చేరగానే ద్రవంగా మారి పీల్చుకోబడి, రక్తంలో కలిసిపోతుంది.

ఓరల్-లిన్స్ అనే ఈ మౌత్‌స్ప్రే ఉబ్బసంతో బాధపడే వారు వాడే ఇన్‌హేలర్‌లాగా ఉంటుంది. ఈ ఇన్‌హే లర్ వాడటం వల్ల ఇన్సులిన్ వేగంగా పనిచెయ్యటం ప్రారంభిస్తుంది. భోజనానికి ముందే ఇన్సులిన్ పీల్లడం వల్ల ఆహారం తీసుకోగానే రక్తంలో పెరిగే షుగర్‌ను అది వెంటనే నియంత్రి స్తుంది. ఈ ఓరల్ లిన్ భారతీయ మార్కెట్లోకి త్వరగా వచ్చె య్యాలని కోరుకుందాం.



మీనాకి నెల తప్పిందనీ, తనే మీనాని డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళానని, నాకు నాయనమ్మగా ప్రమోషన్ రాబోతోందని రాసింది. నేను సంతోషం ఆపుకోలేక వాళ్ళకి ఫోన్ చేస్తే ఇద్దరూ సిగ్గుపడ్డారు. మాధవికి రాసే ప్రతి ఉత్తరంలోనూ నేను ఆమె పెళ్ళి ప్రసక్తి తెచ్చే దాన్ని.

నా ఆరోగ్యం ఇప్పుడు బాగా మెరుగుపడింది. నాకు ఉద్యోగం నుండి విశ్రాంతి తీసుకోవడానికి ఇంకా రెండు నెలలు గడువుంది. అప్పటికి ఆశ్రమం తయారవ్వాలని నా తపన. రవికి విశాఖలో ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో మంచి ఆఫర్ వచ్చింది. మీనాని పుట్టింటికి పంపించి సామానుతోసహా విశాఖపట్నం వెళ్ళిపోయాడు రవి. అందువల్ల నాకు హైదరాబాద్ వెళ్ళే అవసరం లేకుండా పోయింది. గుంటూరులోని మా ఇల్లు ఆశ్రమానికి అనుకూలంగా ఉండేలా మార్పులు చేయిస్తున్నాను. దీనికోసం మున్సిపాలిటీ పర్మిట్లకి, కావల్సిన మెటీరియల్ తెప్పించుకోవడానికి నేనే తిరగాల్సి వచ్చింది. అనవసరంగా రవిని ఇబ్బంది పెట్టాలనుకోలేదు. పైగా ఇప్పుడే కొత్త ఉద్యోగంలో చేరాడు. సెలవులు దొరకడమూ కష్టమే.

ఆరోజు ఆదివారం ఏదో పండుగ కూడా కలిసి వచ్చింది. పనివాళ్ళు రామన్నారు. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. నేను వేడిగా కాఫీ తాగుతూ వరండాలోని నా వాలు కుర్చీలో కూర్చున్నాను. గేటు తీసిన చప్పుడు వినిపించి తల తిప్పి చూశాను. నా కళ్ళని నేనే నమ్మలేకపోయాను. భుజానికి ఎయిర్ బాగ్ తగిలించుకుని నా ఎదురుగా నవ్వుతూ మాధవి నిల్చుంది.

"ఇదేమిటి ఇలా ఉరుములేని పిడుగులాగా వచ్చావు? ఇల్లు కనుక్కోవడానికి ఇబ్బందేమీ పడలేదు కదా? " అన్నాను. లేచి ఆమె నుండి బాగ్ అందుకుని లోపలికి నడుస్తూ.

"మీరే మీ ఇంటి అడ్రస్ ఇదివరకు లెటర్‌లో రాశారు. అది చాలా క్లియర్‌గా ఉంది కాబట్టి నేను ఇబ్బంది పడలేదు. నాకు మిమ్మల్ని చూడాలనిపించింది వచ్చేశాను. ఏం, ఆంటీ! అన్ ప్లెజంట్ సర్‌ప్రైజా? " అంది నవ్వుతూనే.

"అబ్బే కాదులే! ప్లెజంట్ సర్‌ప్రైజేలే! రా!" అన్నాను.

నిజంగా ఆమె రాక నాకు వేసవి కాలంలో తెల్లవారుఝామున చల్లగా పలకరించే పిల్ల తెమ్మెరలాగా హాయినే కలిగించింది. అందరి క్షేమ సమాచారాలు విచారించాను. అందరూ బాగున్నారని చెప్పింది. కాని ఈ మధ్య శ్రీనివాసరావుగారికి బి.పి, షుగర్ బాగా ఎక్కువయ్యాయట. ఆయన సంగతి చెప్తున్నప్పుడు మాధవి బాగా దిగులుగా కనిపించింది.

భోజనాలు చేశాక తీరుబడిగా కూర్చున్నాం.

"ఇప్పుడు చెప్పు నీ విషయమేమిటి? " నేను కదిలించాను.

"విషయం ఏం లేదు ఆంటీ" అంది తల వంచుకుని. ఆమె తీరు ఏదో ఉందని చెప్పకనే చెప్తోంది. ఆమెకి చెప్పడానికి టైం ఇస్తూ ఎదురు చూస్తున్నాను.

ఏదో చెప్పాలని చెప్పలేక ఇబ్బంది పడ్తోంది.

"ఇవాళ కొత్త మాధవిని చూస్తున్నాను. ఏం చెప్పాలన్నా కుండబద్దలుకొట్టి మరీ చెప్పేసే మా పాత మాధవి ఏమయిందీ? " అన్నాను నవ్వుతూ.

ఆమె నావంక కాస్త ఇబ్బందిగా చూసింది.

"చల్లకొచ్చి ముంత దాచడం అంటే ఇదే మరి" అన్నాను. తను నవ్వేసింది. మళ్ళీ వెంటనే సీరియస్‌గా అయింది.

"చాలాసార్లు మీకు చెప్పాలని కూడా చెప్పలేకపోయాను. నాలుగేళ్ళ క్రితమే మా కొలీగ్ ఒకతను నాకు ప్రపోజ్ చేశాడు. నేను సీరియస్‌గా తీసుకోలేదు. పైగా బాగా డిస్కరేజ్ చేశాను. మళ్ళీ ఈ మధ్య తరుచు ఆ ప్రసక్తి తెస్తున్నాడు" సందిగ్ధంగా ఆగిపోయింది.

"ఎవరు? " అన్నాను కుతూహలంగా.

"సురేష్ అని నాకు యూనివర్సిటీలో సీని

యర్. అప్పుడు పరిచయం మాత్రమే ఉండేది. రెండేళ్ళ క్రితం మా బ్రాంచికి వచ్చాడు. అప్పటి నుంచీ తరుచూ పెళ్ళి ప్రస్తావన తెస్తూనే ఉన్నాడు. అతను కనిపిస్తేనే భయం వేసేది. తప్పించుకుని తిరిగే దాన్ని. ఒకరోజు అతను నన్ను ఒంటరిగా పట్టుకుని నిలదీశాడు. నేను నిర్మొహమాటంగా నాకసలు పెళ్ళి చేసుకునే ఉద్దేశమే లేదని చెప్పాను. అప్పటినుంచి నన్ను మళ్ళీ అడిగేవాడు కాదు. కానీ అతనికి నాపట్ల అదే అభిప్రాయం ఉందని, నేను ఒప్పుకునేదాకా ఆగుతానని తను ఎవర్నీ పెళ్ళి చేసుకోనని చెప్పాడు. కానీ మళ్ళీ నెలరోజుల క్రితం విషయం కదిలించాడు. నేను అంత కుండబద్దలు కొట్టినట్టు కాదని చెప్పలేకపోయాను. ఎందుకంటే అమ్మకి, నాన్నగారికి నా గురించి బెంగ ఎక్కువయిపోయింది. నేను జీవితంలో సెటిల్ అయితే గాని నాన్నగారికి మనశ్శాంతి ఉండదనిపిస్తోంది. నా గురించిన దిగులుతోనే ఆయన ఆరోగ్యం కూడా పాడైంది. నేను పెళ్ళి చేసుకుంటే గాని ఆయన కోలుకోరేమోననిపిస్తోంది. మీరు కూడా తరుచు పెళ్ళి గురించి ఆలోచించమనే రాస్తున్నారు కదా! ఇవన్నీ ఆలోచించే అతనికి నా గురించి పూర్తిగా చెప్పాను" అంది నెమ్మదిగా.

"అతుల్ సంగతో!" అన్నాను.

"అదీ చెప్పాను. తనకేం అభ్యంతరం లేదన్నాడు. అభ్యంతరం పెట్టే వాళ్ళెవరూ అతనికి లేరు. వాళ్ళ మదర్ కూడా ఈ మధ్యనే పోయారు. ఇంక బాదరబందీలేమీ లేవు. నాకు తెలిసినంతవరకూ మంచివాడే!"

"మరి ఇంక నీ అభ్యంతరమేమిటీ? "

"నేను ఎటూ తేల్చుకోలేకపోతున్నాను. అసలు ఇప్పుడు నేను పెళ్ళి చేసుకోవడం మంచిదంటారా? " సందిగ్ధంగా అడిగింది.

"నువ్వెందుకింతలా ఆలోచిస్తున్నావో నాకర్థం కావడంలేదు. రాజశేఖరాన్ని మర్చిపోలేకపోతున్నావా? " సూటిగా అడిగాను.

"అబ్బే! అదేం కాదు. అయినా అతనితో పరిచయం కొన్ని నెలలేగా ఆంటీ! అదీగాక అతన్ని జ్ఞాపకం చేసే మధుర స్మృతులేం లేవుగా! అసలు మగవాళ్ళంటే భయం వేస్తోంది" అంది.

"అందరూ ఒకేలాగా ఉండరమ్మా! రాజశేఖరంతో నీ అనుభవం నీకు అలాంటి అభిప్రాయాన్ని మిగిల్చింది. అలా అయితే ఇంతమంది పెళ్ళిళ్ళు ఎందుకు చేసుకుంటారు చెప్పు" అన్నాను అనునయంగా.

"అదే ఆంటీ! నాకూ అర్థంకాని విషయం. ఇంత అసహ్యమైన అనుభవానికి అందరూ అంత ఇంపార్టెన్స్ ఎందుకిస్తారో!" అంది సాలోచనగా

"అదే ఆంటీ! నాకూ అర్థంకాని విషయం. ఇంత అసహ్యమైన అనుభవానికి అందరూ అంత ఇంపార్టెన్స్ ఎందుకిస్తారో? " అంది సాలోచనగా.

"మధూ! జంతువుల్లో సెక్స్ పూర్తిగా శారీరకమే కానీ మనిషికి శరీరంతో పాటు, మేధస్సు కూడా ఉంది కదా! అందుకని మనిషికి సెక్స్ ఎక్కువగా మానసికమే! మనసు ప్రేరేపిస్తేనే శరీరం ఒక పరికరంలాగా పనిచేసి సహకరిస్తుంది. మరి రేప్‌లు ఎలా జరుగుతున్నాయి అంటే మగవాడిలో జంతు ప్రవృత్తి విజృంభించినప్పుడు శారీరక అవసరమే బలంగా ఉండి అలాంటివి అరుదుగా జరుగుతాయి. భార్యాభర్తల మధ్య పరస్పరం నమ్మకం, ప్రేమ, గౌరవం ఉన్నప్పుడు, అవతలి వ్యక్తి ఇష్టమైనప్పుడు ఆ కలయిక చాలా ఉదాత్తమైనది. సృష్టి కార్యమేకాక మనిషి జీవితానికి పరిపూర్ణతని ఇస్తుంది"

మాధవి శ్రద్ధగా వింటోంది.

"ఒక్క మాటలో చెప్పాలంటే మధూ! సెక్స్ భార్యాభర్తల మధ్య సన్నిహితంగా ప్రేమని

ప్రకటించే విధానం మాత్రమే! అయినా పెళ్ళి అంటే ఒక్క సెక్సే కాదుగా! సురేష్ నిన్ను ఇష్టపడుతున్నప్పుడు అనవసర ఆలోచనలతో మనసు ఎందుకు పాడు చేసుకుంటావు. అవకాశాలు కావల్సినప్పుడల్లా రావు. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చెయ్యడంలోనే మనిషి విజ్ఞత ఉంది. ఆలస్యం అమృతం విషం అంటారు కదా! ఈ విషయాలన్నీ నీకు తెలీనివి కాదు. కాకపోతే మగవాళ్ళపట్ల నీకున్న కాంప్లెక్స్ నిన్ను క్లియర్‌గా ఆలోచించనియ్యడంలేదు. అంతే! నువ్వు చదువుకున్నదానివి. మంచి చెడు విశ్లేషించగల తెలివీ ఉంది. నీ ప్రెజుడీస్ పక్కనపెట్టి అన్‌బయాస్ట్‌గా ఆలోచించు. నా మాటల్లో నిజం నీకు తెలుస్తుంది" అన్నాను.

రెండు క్షణాలు మౌనంగా ఉంది మాధవి. నేను మాట్లాడకుండా ఆమెని చూస్తున్నాను.

"అతుల్ దీనికి ఎలా రియాక్ట్ అవుతాడోనని భయంగా ఉంది. నాకు నా పెళ్ళికంటే వాడి భవిష్యత్ ముఖ్యం కదా!" అంది నెమ్మదిగా. నాకు ఆమెని చూస్తే జాలేసింది. ఎన్నో భయాలు! మరెన్నో సందేహాలు!

"ఇది అంత ఆలోచించాల్సిందేం కాదమ్మా! వీలు చూసుకుని అతుల్‌కి సురేష్‌ని పరిచయం చేయి. తర్వాత వాళ్ళిద్దరూ తరుచూ కలుసుకునే ఏర్పాటు చేయి. వాళ్ళ మధ్య కాస్త అనుబంధం ఏర్పడితే నీ సమస్య తీరిపోతుంది" అన్నాను తేలిగ్గా.

మాధవి మౌనంగా ఉంది. తర్వాత ఒక నిర్ణయానికి వచ్చినట్టు. "సరే! ఆంటీ! మీరన్నట్టు సురేష్ పెళ్ళి తర్వాత నాకు గతంలో జరిగిన చేదు అనుభవాలు మరిపిస్తాడేమో! ఏమైనా పెళ్ళి అమ్మకి, నాన్నగారికి రిలీఫ్‌ని, ఆనందాన్ని కలిగిస్తే నాకంతకంటే కావల్సింది ఏముంటుంది. దానికి ముందు మీరు చెప్పినట్టే అతుల్‌ని సురేష్‌కి పరిచయం చేస్తాను. వాళ్ళిద్దరికీ మధ్య 'రాపో' ఏర్పడితే నా సమస్య తీరినట్టే" అంది.

ఆరోజు సాయంత్రమే ఆమె హైదరాబాద్ వెళ్ళిపోయింది. నా ఆశ్రమం పనులు కూడా దాదాపు పూర్తయ్యాయి. ఇక ఇన్‌మేట్స్ రావడమే తరువాయి. అప్లికేషన్లు దాదాపు పదిహేను దాకా వచ్చాయి.




నేను ఉద్యోగ విరమణ చేసేరోజు వచ్చేసింది. నా సర్వీసులో ఒంగోలు, చీరాల, నెల్లూరు లాంటి ఊళ్ళలో కొద్దికాలం పనిచేసినా ఎక్కువగా గుంటూరులోనే గడిచింది. ఆ కాలేజికి నాకు గాఢమైన అనుబంధం ఉంది. సభ ఏర్పాటుచేసి సాదరంగా వీడ్కోలు పలికారు. బరువెక్కిన గుండెతో ఇల్లు చేరాను. ముందునుంచీ తెలిసిందే అయినా ఆ క్షణంలో నాలోని భాగం ఏదో అక్కడే విడిచి వెళ్తున్నానన్న భావం మా కాలేజి వదిలేటప్పుడు నా మనసులో కదలాడింది.

ఇక్కడి నుంచి నా జీవితంలో మరో ప్రకరణం ప్రారంభం కాబోతోంది. మూడు నెలలు గడిచాయి. కొత్త జీవితానికి అలవాటుపడ్డాను.

మాధవి ఉత్తరం రాసింది. అతుల్ పుట్టిన రోజునాడు సురేష్‌ని ఇంటికి పిల్చి అందరికి పరిచయం చేశానని, అప్పట్నించి అతను తరచు ఇంటికి వస్తున్నాడని, అతుల్‌కి బాగా దగ్గరయ్యాడని, రెండు మూడు సార్లు అతనితో కలిసి షికార్లకి, సినిమాకి కూడా వెళ్ళాడని, శ్రీనివాసరావుగారు, మాణిక్యమ్మగారు కూడా అతనిపట్ల ఆదరంగానే ఉన్నారని రాసింది. అతని కులం వేరని

మాటల సందర్భంలో చెప్పానని వాళ్ళ స్పందన పాజిటివ్‌గానే ఉందని, ఇవాళో రేపో వాళ్ళకి పెళ్ళి విషయంలో తన నిర్ణ యాన్ని చెప్తాననీ రాసింది. వాళ్ళ పెళ్ళికి ఇంకేం అభ్యంతరాలు పెద్దవాళ్ళ నుండి ఎదురుకావని నాకనిపించింది. ఆ ఉత్తరం నాకు చాలా రిలీఫ్‌నిచ్చింది.

అన్నీ అనుకున్నట్టే జరుగుతున్నాయి. ఏప్రిల్ ఇరవైన మా ఆశ్రమం ప్రారంభానికి ముహూర్తం నిశ్చయించాం. జిల్లా విమెన్ వెల్ ఫేర్ ఆఫీసర్‌ని, కలెక్టర్‌ని ఆరోజు ఫంక్ష న్‌కి ఆహ్వానించాలని నిర్ణయించాం. వంటకి మనిషి, ఒక ఆయా, పనిమనిషిని కూడా ఏర్పాటు చేశాము.

అప్పుడే మీనాకి డెలివరీ అయింది. నాకు మనవడు పుట్టాడు. వెళ్ళి చూసి, బాలసార జరిపించి వచ్చాను. రవి వీడికి 'మాధవ్' అని వాళ్ళనాన్నగారి పేరే పెట్టు కున్నాడు.

ఆశ్రమం ప్రారంభోత్సవం నెలరోజుల్లో ఉందనగా అన్ని పనులు పూర్తి అయ్యాయి. అన్నీ నేనే చూసుకుంటున్నానంటే, నా వల్లనే అయ్యాయనుకుంటే అహంకారమే అవుతుంది. నా కల సాకారం కావడానికి దూరంగా ఉండి కూడా మా రవి, మీనా, మాధవి లాంటివారు సహ



కారం, ప్రోత్సాహం అందిస్తూ నాకు నైతిక బలంగా నిలబడితే ఇక్కడ నా ఫ్రెండ్స్, ముఖ్యంగా స్టూడెంట్స్ శక్తివంచన లేకుండా కార్యరంగంలోకి దిగి నాకు కావాల్సిన సహాయాన్ని, సహకారాన్ని అందించారు. మా ప్రిన్సిపల్‌గారు నాకు అవసరమైన సలహాలు సూచనలు ఇస్తూ తనవంతు సహకారం అందించారు. ఇందరి అండతో నా కోరిక రూపుదాల్చబోతోంది. ఆశ్రమంలో చేరేవారి దగ్గర్నుండి డబ్బు కూడా ఇంత అని తీసుకోవాలనుకోలేదు. ఇవ్వగలిగిన వాళ్ళు ఇచ్చినంత. అదీ లేని వాళ్ళకి ఉచితంగానే వసతి కల్పించాలని నా అభిమతం. ప్రస్తుతానికి నా పి.ఎఫ్, సేవింగ్స్ ఉండనే ఉన్నాయి. పొలంమీది



అయివేజు ఉంది. నాకు పెన్షన్ రానేవస్తుంది. అన్నిటినీ రవి నా ఇష్టానికే వదిలేశాడు. ఇంకా అవసరమైతే అందరూ ఆర్థికంగా నా వెనక నిలబడడానికి సిద్ధంగానే ఉన్నారు.

ఒకరోజు రాత్రి మాధవి ఫోన్ చేసింది. పిడుగులాంటి వార్త. శ్రీనివాసరావుగారు గుండెపోటుతో సాయంత్రం పోయాడట. నేను హుటాహుటిన హైదరాబాద్ వెళ్ళాను. "సాయంత్రం టీ తాగి పేపర్ తిరగేస్తున్నారు. పక్కనే అమ్మ చిక్కుడుకాయలు చీలుస్తూ కూర్చున్నారు. ఆయన చేతిలోని పేపరు జారిపోతే, నిద్ర పట్టిందేమోనని అనుకుంది. ఈమధ్య పగలు అలా మాగన్నుగా పడుకుంటూనే వున్నారు. కాసేపయిన తర్వాత లేపబోతే అప్పటికే అంతా అయిపోయింద"ని చెప్పింది మాధవి.

మాణిక్యమ్మగారు బాధని గుండెల్లో దాచుకున్నారు. కానీ మాధవి బాగా కుంగిపోయింది. ఏవో ఓదార్పు మాటలు చెప్పాం కానీ అలాంటి గాయాలు కాలమే మాన్పాలి. అక్కడికి ప్రకాశం, వనజ, సుందరమ్మగారు వచ్చారు. వనజ ముఖంలో ఇదివరకటి బెరుకుతనం కనిపించలేదు. సుందరమ్మగారు మాధవి వాళ్ళకి సాయంగా ఆ పది రోజులూ ఇక్కడే ఉందట. ఆమెలో మార్పు వచ్చిందనడానికి వేరే సాక్ష్యమేం కావాలి?

నేను మర్నాడే వచ్చేశాను. ఇరవై రోజుల తర్వాత మాధవి దగ్గర నుండి పెద్ద ఉత్తరమే వచ్చింది.

"ఆంటీ! అమ్మని అన్నయ్య రూర్కెలా తీసుకుని వెళ్తానన్నాడు. నాకు అమ్మ నా దగ్గరే ఉండాలని ఉంది. కాని అమ్మ ఏమందో తెలుసా! మీ దగ్గర ఆశ్రమంలో ఉంటుందట. మీకు అభ్యంతరం లేకపోతే అమ్మే మీ ఆశ్రమానికి మొదటి మెంబరు అవుతుంది. నన్నొక్కదాన్ని వదిలి ఎలా వస్తుందని ఆశ్చర్యపోతున్నారా? సురేష్‌తో నా పెళ్ళికి

నాకంటే అమ్మే తొందరపడుతోంది. నా జీవితం అతనితో సుఖంగానే గడచిపోతుం దని ఆమెకి కూడా నమ్మకం ఏర్పడింది. సురేష్‌కి అతుల్‌కి బాగానే పొత్తు కుది రింది. అందుకే నేను సాధ్యమైనంత త్వరలో మీ ఆశీర్వాదాలతో పెళ్ళి చేసుకోవా లనే నిర్ణయించుకున్నాను- అమ్మ మీ దగ్గరు న్నదంటే నాకూ నిశ్చింతగా ఉంటుంది. మరో మాట మీ ఆశ్రమ ప్రారంభోత్సవానికి సురేష్‌ని నాతోపాటు అక్కడికి రమ్మం టాను, మీకు పరిచయం చేస్తాను. ముహూర్తం కూడా మీరే నిర్ణయించాలి" అని రాసింది.

నేను మాధవి నిర్ణయాన్ని అభినందిస్తూ, మాణిక్యమ్మగారిని ఇక్కడ ఆశ్రమంలో ఉంచుకోవడం నాకు చాలా సంతోషమని చెప్పాను. మాధవి ఆమెని తీసుకొచ్చింది.

ఆ తర్వాత వారం రోజులకే తిరుపతిలో మాధవి పెళ్ళి జరిగింది. వైజాగ్ నుండి రవి కూడా వచ్చాడు.

18



మా ఆశ్రమానికి 'సంధ్య వెలుగు' అని పేరు పెట్టాం. ప్రారంభోత్సవానికి మాధవి, సురేష్, మీనా, నా మనుమడితో సహా అందరూ వచ్చారు. ఏ లోటూ లేకుండా అంతా బాగా జరిగింది. ఆశ్రమంలో మాణి క్యమ్మగారి తర్వాత ఒకరొకరిగా పది మంది దాకా చేరారు. నేను మొదటే అనుకున్నట్టు ఎవర్నీ డబ్బు కోసం వత్తిడి చేయలేదు. కానీ వాళ్ళలో చాలామంది నెలకి సరిపడా డబ్బులు ఇవ్వడానికి సిద్ధపడ్డారు. ఒకరిద్దరు ఏ ఆధారం లేనివాళ్ళూ ఉన్నారు. మెంబర్లు పెరుగుతుండడంతో అన్నీ నేను చూసుకోవా లంటే కొంచెం కష్టమయింది.

ముకుందరావుగారు ఇన్‌కం టాక్స్ డిపార్టు మెంట్‌లో పనిచేసి రిటైరయ్యారు. భార్య వున్నంతకాలం పిల్లలు లేకపోయినా బాగానే గడిచింది. ఆమె ఈమధ్యనే పోయిందిట. ఒంటరితనం బాధించింది. మళ్ళీ పెళ్ళికి వయసూ కాదు. కోరికా లేదుట. మా ఆశ్రమం ప్రకటన చూసి వచ్చి ఇక్కడి పరిస్థి తులు పరిసరాలు నచ్చి వెంటనే చేరిపో యారు. ఆయన నాకు బాగా ఆసరా అయ్యారు. నిజాయితీపరుడని మంచి పేరుంది ఆయనకి. దానికితోడు కమిట్ మెంటూ ఉంది. ఎక్కువగా మాట్లాడేవారు కాదు. ఒత్తుగా, వెండిగీతలతో చేశారేమో ననిపించే క్రాపుతో, ఎప్పుడూ మడత నలగని తెల్లటి బట్టల్లో, కళ్ళజోడులోంచి అందర్నీ నిశితంగా పరిశీలిస్తున్నట్టుంటారు. ఎప్పుడూ ఏదో పుస్తకమో- పేపరో చదువుతుంటారు.

ఆశ్రమ ఆర్థిక భారం మోయడం ముందు ముందు చాలా అసాధ్యమని ఆశ్రమాని కంటూ ఆర్థికంగా స్వయం ప్రతిపత్తి ఏర్పడా లని దానికి వనరులు ఏర్పాటు చేస్తే ఆశ్రమ నిర్వహణ అంత భారంగా ఉండదని ఆయన సూచించారు. అందరం కలిసి కూర్చుని చర్చించాం. ఆశ్రమంలోని వారు చేయగలిగిన పని చేసి అంటే కూరలు, పళ్ల పెంపకం, ఊర గాయలు పెట్టడం లాంటివి ప్రస్తుతానికి చేయాలని నిర్ణయించాం.

వరదాచారిగారు చామన ఛాయగా సన్నగా పొడుగ్గా అరవై ఏళ్ళు దాటినా దృఢంగా ఉంటారు. భార్య ఆండాళ్లమ్మగారితో సహా ఆశ్రమానికి వచ్చేశారు. ఉన్న ఒక్కగానొక్క కొడుకు బస్ యాక్సిడెంట్‌లో పోయాడట. సంబంధాలు చూస్తున్నారట, పెళ్లి చేయాలని. ఆయన గుండె దిటవు చేసుకున్నా, ఆమె చాలా కృంగిపోయారట. ఆస్తి ఉంది కాబట్టి

తమ పిల్లలని పెంపుడిచ్చి ఆస్తి దక్కించుకోవాలనే కోరికే అంద రికీ. ఇవన్నీ తట్టుకోలేక ఇక్కడికి వచ్చేశారు. ఆయన యోగాస నాలు వేస్తారు. ఆశ్రమంలో అందరి చేత ఆసనాలు వేయించా లని ప్రయత్నించినా ఆయన భార్యే ఆయనకి దొరక్కుండా తప్పించుకుని తిరిగేది. ఆండాళ్లమ్మగారు బాగా లావుగా ఉంటారు. కానీ చాలా చక్కటి గాత్రం. చాలా శ్రావ్యంగా పాడు తుంది. ఆశ్రమానికి వచ్చినప్పుడు ఆమె బాగా డిప్రెషన్‌లో ఉండేవారు. ఇప్పుడు బాగా కోలుకున్నారు. ఆమె పాట లేకుండా మాకు తెల్లవారదు, పొద్దుకుంకదు. మాణిక్యమ్మగారికి ఆమెకి మంచి స్నేహం కలిసింది. మా ఆశ్రమానికి కావల్సిన పాలు పెరుగు నెయ్యిలాంటి వాటి కోసం రెండు గేదెలు కూడా ఉన్నాయి. వాటి పని వరదాచారిగారే చూసుకునేవారు.

చదువబ్బక
చిన్నతనంలోనే
ఇంట్లోంచి
పారిపోయి
మిలటరీలో చేరారు.
యుద్ధకాలంలో
బర్మా వెళ్లారు.
తర్వాత ఇంటికి
తిరిగి వచ్చేసరికే
తల్లి ఆయన
మీద దిగులుతో
పోయింది

నారాయణగారికి ఎనభై ఏళ్ళకి పైనే ఉంటాయి. మా ఆశ్ర మంలో అందరికంటే ఆయనే వయసులో పెద్దవారు. చదువబ్బక చిన్నతనంలోనే ఇంట్లోంచి పారిపోయి మిలటరీలో చేరారు. యుద్ధ కాలంలో బర్మా వెళ్లారు. తర్వాత ఇంటికి తిరిగి వచ్చేసరికే తల్లి ఆయన మీద దిగులుతో పోయింది. అన్న ఉన్నా ఆయన సంసార జంఝాటంలో ఈయన సంగతి పట్టించుకోలేదుట. చదువు లేదు కాబట్టి మంచి ఉద్యోగం కూడా రాలేదు. ఆస్తి లేనే లేదు. అందు కని పిల్లనివ్వలేదు ఎవరూ. అలా ఆయన బలవంతపు బ్రహ్మచా రిగానే మిగిలిపోయారు. కొట్లల్లో పద్దులు రాసి చుట్టాలు, తెలిసిన వాళ్ల ఇళ్లలో సహాయంగా ఉంటూ జీవితాన్ని గడిపేశాడు. వయ సులో ఉన్నన్నాళ్లూ బాగానే గడిచినా ముదిమి మీద పడేసరికి తిండికే ఇబ్బంది అయింది. అన్న పిల్లల పంచన కొంత కాల మున్నా వాళ్లవీ అంతంత మాత్రపు సంపాదనలే కావడం వలన భారంగా ఉండలేక ఎవరో ఈ ఆశ్రమం గురించి చెప్తే ఇక్కడికి వచ్చేశారు. ఆర్థిక ఇబ్బందుల వలన ఒంటిపూట భోజనం అల వాటు చేసుకున్నారు. ఇప్పటికీ నడుము కొద్దిగా వంగినా ఆయన ఊరికే కూర్చోరు. రెండేళ్ల క్రితం ఆశ్రమానికి దగ్గర్లో చిన్న స్థలం కొన్నాం. అక్కడ రకరకాల కూరగాయలు పెంపకం ఆయనే స్వయంగా చూసుకుంటారు. రోజులో ఎక్కువ భాగం అక్కడే గడు పుతుంటారు. చాలా ఆత్మాభిమానం ఉన్న మనిషి. ఎవరైనా తన పట్ల జాలి, సానుభూతి చూపిస్తే సహించేవారు కాదు. ఆశ్రమంలో అతి తక్కువగా మాట్లాడేది ఆయనే!



వామనమూర్తిగారు పేరుకు తగ్గట్టు పొట్టిగా పీలగా ఉంటారు. డ్రాయింగ్ మాస్టరుగా పనిచేసి రిటైరయ్యారు. భార్య చనిపోతే, కూతుళ్లు ఇద్దరినీ కంటికి రెప్పలాగా పెంచారు. పెళ్లిళ్లు చేశారు. అయితే అల్లుళ్లకి ఆయన వాళ్ల దగ్గర ఉండడం ఇష్టం లేదుట. కూతుళ్లు చేసేదేం లేక తండ్రిని ఇక్కడ ఉంచి రహస్యంగా డబ్బు

పంపిస్తుంటారు. ముందు ఆడపిల్లల సొమ్ము తినడానికి అభిమానపడినా తప్పని సరైంది. కాగితం రంగులు ఇస్తే అద్భుతాలు సృష్టించగల నేర్పరి.

భారతమ్మగారిది వీళ్లకి పూర్తిగా భిన్నమైన కథ. బాగా ఆస్తి ఉంది. భర్త బతికి ఉన్న రోజుల్లో, ఆయన మీద పిల్లల మీదా కూడా పెత్తనం చెలాయిస్తూ మహారాణిలాగా ఉండేది. కొడుకులు ముగ్గురూ చాలా చదువుకుని విదేశాల్లో పెద్ద ఉద్యోగాల్లోనే స్థిరపడ్డారు. ఇద్దరు అమెరికాలో, ఒకడు ఆస్ట్రేలియాలో ఉంటారు. కోడళ్ళూ మంచివాళ్లే, అందరికీ భారతమ్మగారంటే ప్రేమ, గౌరవం.

అయితే వచ్చిన చిక్కేమిటంటే వాళ్లు ఇక్కడికి రావడానికి ఇష్టపడరు. ఆవిడ మాటల్లోనే చెప్పాలంటే, "డర్టీ ఇండియా అంటారు. ఏముంది ఇక్కడ మట్టి, మురికి, ఆకలి తప్ప అంటూ ఈసడిస్తారు. నా పోరు పడలేక వచ్చినా వారం రోజులు ముళ్ల మీద ఉన్నట్టుగా ఉండి ఎగిరిపోతారు. ఏం పిల్లల్లో మాయదారి పిల్లలు. కన్నతల్లి, ఉన్న ఊరు చేదైనాయి. "పోనీ మీరు అక్కడికి వెళ్లకపోయారా" అంటే "అదీ అయింది. ఇక్కడ నాకేం తోస్తుంది. రెండు నెలలు ఉండేసరికే నరకం అంటే ఇలాగే ఉంటుందేమోననిపించింది. ఆ రుచి పచి లేని చప్పటి తిళ్లు, వాళ్ల అవతారాలు చూస్తేనే నాకు కడుపులో తిప్పేది. మన ఊరగాయాలూ, పచ్చళ్లూ దొరుకుతాయా చస్తాయా! అక్కడున్నన్నాళ్లూ నాలుక పీకేసిందనుకోండి" అంటుంది. "అక్కడా అన్నీ దొరుకుతాయిట గదా!" అంటే, "ఆ ఏం దొరకడం, మన ఆవకాయల మొహం తెలీని వాళ్లు తినాల్సిందే! మన తెల్ల గులాబీ, మామిడి కాయతో గుంటూరు, వరంగల్ మిరపకాయ కారం కలిపి అంబట్టి సుబ్బన్న పప్పునూనెతో వేసిన ఆవకాయ రుచి వాటికెక్కడిదీ!' అంటుంది. ఆ మాటలు చెప్పంటేనే ఆమె మొహం చాటంత అవుతుంది. తినడమే కాదు. వంటలు కూడా ఆమె చాలా బాగా చేయగలదు. ఆ విషయంలో ఆశ్రమంలో అందరిదీ ఏకాభిప్రాయమే!

రెండు నెలలు ఉండేసరికే నరకం అంటే ఇలాగే ఉంటుందేమోననిపించింది. ఆ రుచి పచి లేని చప్పటి తిళ్లు, వాళ్ల అవతారాలు చూస్తేనే నాకు కడుపులో తిప్పేది

అన్నపూర్ణమ్మగారిది అదో తరహా! అందరిని, అన్నిటిని అతి జాగ్రత్తగా కాపలా కాస్తుంది. ఎప్పుడూ ఎవరైనా వచ్చి ఆశ్రమంలోని వస్తువులో తన సామానో తీసుకెళ్లిపోతారని భయంతో ఉండేది. ఎంత పని ఉన్నా టి.వి. ప్రోగ్రాములు విధిగా చూసేది. రాత్రిళ్లు నిద్రలో తరచూ 'అదిగో, పట్టుకుపోతున్నాడు', 'పట్టుకోండి', 'దొంగ దొంగ' లాంటి కలవరింతలు కలవరిస్తుందని అందరూ అంటుంటే ఆమె కూడా సరదాగా నవ్వుతుంది. నిజంగానే ఒకసారి వంటవాడు ఆశ్రమం నుండి పప్పులు, బియ్యం, నూనె లాంటివి బయటికి తరలిస్తుంటే రెడ్ హాండెడ్‌గా పట్టుకుంది. ఎవరి వస్తువైనా కనబడకుండా పోతే అది వెతికి దాన్ని దాని తాలూకు యజమానికి చేర్చేదాకా నిద్రపోదు. ఆమె తన గతం గురించి ఎప్పుడూ చెప్పేది కాదు. కొంత డబ్బు బ్యాంక్‌లో ఉందిట. నెలనెలా ఆశ్రమానికి ఇవ్వగలిగింది ఇస్తూనే ఉంటుంది. ఇక్కడ ఎవరికీ ఇతర్ల వ్యవహారాలు, వ్యక్తిగత వివరాలు తెలుసుకునే ఆసక్తి లేకపోవడం వల్ల ఆమె గతం ఎవరికీ తెలీదు.

అందరికంటే దయనీయమైన పరిస్థితిలో రంగమ్మగారు ఆశ్రమానికి వచ్చారు. ఉండడానికి ఇల్లు లేక డెబ్బై ఏళ్లు దాటినా

అక్కడా ఇక్కడా వంటలూ చేస్తూ వంట్లో ఓపిక తగ్గిన తర్వాత, పని లేక ఎవరింటి అరుగు మీదో అనారోగ్యంతో పడి వుంటే ముకుందరావుగారు చూసి ఆశ్రమానికి తీసు కొచ్చారు. మందులతో కోలుకున్నారు. వంటవాడికి సూచనలు ఇస్తూ, పప్పులు, బియ్యంలాంటివి బాగుచేస్తూనో ఎక్కువగా ఆమె వంట ఇంటి దగ్గరే ఉంటుంది.

ఇలా ఆశ్రమ వాసుల చరిత్రలు చెప్పు కుంటూ పోతే మరో భారతం అవుతుంది.

ఒక్కొక్కరిది ఒక్కొక్క కథ. దాని వెనకే దాగిన వ్యథ. అప్పుడప్పుడూ నన్ను వెంటాడి బాధించే అసంతృప్తి, ఏం కావాలో తెలియని పరిస్థితి ఇప్పుడు నాకు లేవు. 'Man is the maker of his own destiny' అని ఏ మహానుభావుడు అన్నాడో కానీ అక్షరాలా నిజమనిపిస్తుంది. మన కష్టం, సుఖం అన్ని మన మనసు చేసే గారడీలే!

ఇన్ని రకాల మనస్తత్వాలున్నా అప్పుడ ప్పుడు చిన్న చిన్న భేదాభిప్రాయాలే తప్ప గొడవలు, తగాదాలు ఎప్పుడూ రాలేదు. అందరూ ఒకే కుటుంబంలాగా ఉంటారు. ముకుందంగారి సూచన ప్రకారం ఆశ్రమానికి రాబడి పెరిగే మార్గాలు అందరినీ సమావేశ పరిచి అభిప్రాయాలు సేకరించారు. భారత మ్మగారి ఆధ్వర్యంలో ఆడవాళ్లంతా ఊరగా యలు, పచ్చళ్లు, పొడులు చేయడానికి ఉత్సాహం చూపారు. నిజంగా ఆమె చేతిలో ఏముందో కానీ మా ఊరగాయలకు సాంబా రు, రసం, మసాలా లాంటి పొడులకు మంచి గిరాకీ రావడం మొదలుపెట్టింది.

మాణిక్యమ్మగారు, సుందరలక్ష్మిగారు, వైరుతో, నారతో అందమైన సంచులు, పర్సులు అల్లడం మొదలుపెట్టారు. వామనరా వుగారు పెన్సిల్ స్కెచ్చెకం పెయింటింగ్స్ వేయడమే కాక, రకరకాల గ్రీటింగ్ కార్డులు కూడా తయారు చేసేవారు. వీటన్నిటి మార్కెటింగు బాధ్యత ముకుందరావుగారు, వరదాచారిగారు చూసుకునేవారు. ఆశ్రమానికి సంబంధించిన అకౌంట్స్ అన్నీ ముకుందరా వుగారే చూసేవారు.

ఆశ్రమ వారోత్సవాలకి వీటన్నిటితో ఎగ్జిబి షన్ కం సేల్ మూడు రోజుల పాటు నిర్వ హిస్తాం. దాంతో మంచి స్పందనే వచ్చేది. విడి రోజుల్లో సేల్స్ బాగా పెరిగేవి. ఆశ్రమా నికి టి.వి. రేడియో లాంటి సదుపాయాలు ఏర్పడ్డాయి. ఒక గూడు రిక్షా కూడా ఉంది. దీన్ని ఆశ్రమానికి కావల్సిన సరుకులు, మా చిన్న చిన్న గృహ పరిశ్రమలకి కావలసిన ముడి పదార్థాలు తేవడానికి కాక, తయారైన వస్తువులు షాపులకి, ఆర్డరిచ్చిన వారికీ అంద జేయడానికి కూడా ఉపయోగిస్తాం.

ఆ గ్రామంలో అందరూ వంతుల వారీగా విధులు నిర్వహించేవారు. వారం వారం అని మార్చుకునేవారు. భారతమ్మగారికి కిచెన్ డ్యూటీ ఉంటే ఆ వారమంతా అంద రికీ రుచికరమైన భోజనం దొరికేది.

వామనరావుగారు పచ్చి కూరలు తినడం మంచిది అనేవారు. ఆయనకి కిచెన్ డ్యూటీ పడితే అందరూ నీరసంగా 'ఈ వారం పచ్చి కూరట్లు గడ్డీ గాదమే మనకి' అనే ఆయన్ని టీజ్ చేసేవాళ్లు. చిన్న చిన్న అనారోగ్యాలకి ఆయన మందులతో చిట్కాలతో రెడీగా ఉండేవారు. ఆయనకి హోమియోపతి, ఆయు ర్వేదం, ప్రకృతి వైద్యంలో ప్రవేశం ఉంది. అన్నపూర్ణమ్మ గారు మాత్రం "నీ చేతి మాత్రా..." అంటూ ఆయన మందులెప్పుడూ వాడేది కాదు.

వీలున్నప్పుడు ఎవరైనా పెద్దలు, విజ్ఞులు తటస్థపడినప్పుడు ఆధ్యాత్మిక ప్రసంగాలు కూడా జరిగేవి.

అయితే ఆశ్రమ జీవితం ఎప్పుడూ ప్రశాం తంగా, సరదాగా ఉంటుందనుకోవడం పొర పాటే! మొదట్లో ఎన్నో బాలారిష్టాలు దాటాల్సి వచ్చింది.

ఆశ్రమం ప్రారంభించిన రెండో ఏడు సంగయ్యా అనే ఆయన చేరారు. అయితే అప్పటికే ఆయనకి తీవ్రమైన అనారోగ్యంతో



ఉన్నారు.

చేరిన వారం రోజులకే సీరియస్ అయి డాక్టరు వచ్చే లోపలే ప్రాణం పోయింది. ఆశ్రమ నిర్వహణ లోపం వల్లనే ప్రాణ నష్టం జరిగిందని ప్రచారం జరిగింది. పోలీస్ ఎంక్వయిరీ, పోలీసు స్టేషన్ చుట్టూ తిరగడం... నిజం చివరికి అందరికీ తెలిసినా ఈ లోపల ఆశ్రమంలో ఎవరికీ కంటిమీద కునుకు లేదు.

మరోసారి ఎప్పుడూ పచారి సామాన్లు తెచ్చే షాపు మూసి ఉండడం వలన మరో కొట్లో తెచ్చారుట. అవి కల్తీవి అవడం వల్ల అందరికీ వాంతులు, విరోచనాలతో వారం పది రోజులు ఆశ్రమం అతలాకుతలమైంది.

ఇలాంటివే ఎన్నో ఒడిదుడుకులు. అలాంటి సమయాల్లో ఆశ్రమంలో ప్రతి ఒక్కరూ నా వెనక నిలబడి నాకు నైతిక బలాన్నిచ్చేవారు. అదే నన్ను ముందుకు నడిపించింది.

## 19

మాణిక్యమ్మగారు అందరికీ తలలో నాలుక లాగా ఉండే వారు. షెళ్ళైన కొద్ది కాలానికే సురేష్‌కి అమెరికాలో మంచి ఉద్యోగం రావడంతో ఇక్కడ ఎల్ ఐ సిలో ఉద్యోగం మానేసి అక్కడికి వెళ్ళిపోయాడు. తర్వాత మాధవిని, అతుల్‌ని కూడా తీసుకెళ్ళిపోయాడు. మాధవి దగ్గర్నించి ఉత్తరాలు అప్పుడప్పుడు, వారానికి ఒకసారి ఫోన్ తప్పకుండా వస్తాయి.

రవి, మీనా, మాధవ్‌లతో వచ్చి రెండు, మూడు రోజులుండి వెళ్తుంటాడు. కాని నేను వైజాగ్ రావడం లేదని, వచ్చినా ఒకటి, రెండు రోజుల కంటే ఎక్కువ ఉండనని వాడికి సనుపే. ఇక్కడికి వచ్చి ఆశ్రమాన్ని చూసినప్పుడల్లా "ముందొచ్చిన చెవుల కన్నా వెనకొచ్చిన కొమ్ములు వాడి" అనీ; నీకు ఇప్పుడు ఆశ్రమం నాకంటే ఎక్కువైంది అనీ దెప్పుతూనే ఉంటాడు. కాని నేను ఇక్కడ చాలా ఆనందంగా, తృప్తిగా ఉన్నానని వాడికి తెలుసు.

అమెరికా వెళ్ళిన రెండేళ్ళకి మాధవికి కూతురు పుట్టింది. డెలివరీ సమయానికి మాణిక్యమ్మగారు అమెరికా వెళ్ళి ఆరు నెలలు ఉండి వచ్చారు. కూతురు పుట్టిన వెంటనే మాధవి నాకు ఫోన్ చేసింది.

'ఆంటీ! అందరిలా నేనూ ఇంత సంతోషంగా ఉండగలనని ఉంటాననీ ఎప్పుడూ అనుకోలేదు. ఇదంతా మీ దయే! మీ ప్రోత్సాహమే లేకపోతే ఈ పెళ్ళి చేసుకుని ఉండేదాన్ని కాదు. అప్పుడు నేనేం పోగొట్టుకున్నానో నాకెప్పటికీ తెలిసేది కాదు. ఓ హెన్రీ కథలంటే నాకు చాలా ఇష్టం. ఎందుకంటే ఆయన తన కథలకి చక్కటి తుది మలుపు

ఇస్తాడు. కానీ ఆ భగవంతుడు మీ ద్వారా నా జీవితానికి అంతకంటే అందమైన మలుపు ఇచ్చాడు" అంది. ఆమె గొంతులోని నిజాయితీ ఉద్వేగం నన్ను చలింపజేసింది. అప్రయత్నంగా కళ్ళు తుడుచుకున్నాను. సురేష్ కూడా ఫోన్లో మాట్లాడాడు.

"ఆంటీ! మీకు చాలా చాలా కృతజ్ఞతలు. ఎందుకో తెలుసా! మాధవిని నాకు దక్కించినందుకు" అన్నాడు. అతని మాటల్లోని సంతోషం ఇన్ని వేల మైళ్ళదూరంలో ఉన్న నన్ను కూడా తాకింది. నేను నవ్వేశాను.

అమెరికా నుండి వచ్చిన తర్వాత మాణిక్యమ్మగారు కూతురి కాపురం గురించి సురేష్ అతుల్ని ఎంత ప్రేమగా చూసుకుంటాడో చెప్పేటప్పుడు ఆమె కళ్ళలో వెలుగు కనిపించేది. అలాంటి ఒక సందర్భంలో నా చేతులు పట్టుకుని "లలితమ్మగారూ! ఇదంతా మీ చలవే! మీరు నిజంగా మా పాలిటి ఆ లలితా పరమేశ్వరే!" అన్నారు ఏడ్చేస్తూ. ఆ క్షణంలో 'ఇలాంటి తృప్తి ఆనందం అందరికీ నేనివ్వగలిగితే ఎంత బాగుంటుంది' అనిపించింది.

ఒకసారి మాణిక్యమ్మగారి అబ్బాయి వచ్చాడు. రూర్కెలా నుండి హైదరాబాద్ ట్రాన్స్‌ఫరైందట. అతనికి తల్లి తమతో సొంత ఇంట్లో ఉండడానికి ఇష్టపడితే తీసుకుని వెళ్తానన్నాడు. అతనికి నచ్చచెప్పి సున్నితంగానే తిరస్కరించారు ఆమె. అప్పుడప్పుడు హైదరాబాద్ వెళ్ళి వారం పదిరోజులుండి వస్తుంది.

* * *

మీనా రెండోసారి నెలతప్పిందని తెలిసినపుడు పుట్టింటికి పంపకుండా నా దగ్గరే ఉంచుకుని పురుడు పోయాలనిపించింది. కానీ నాకిక్కడ విడిగా ఇల్లంటూ లేదు. ఆశ్రమంలోనే రెండు గదులు నాకు, నా సామాను కోసం నాకింద ఉంచుకున్నాను.

అందువల్ల చిన్న పిల్లల ఏడుపులు, వాళ్ళ ఆలనా పాలనా మిగతా వారికి చిరాకుగా ఉంటాయేమోనని నేను తటపటాయించాను.

"వృద్ధాప్యం రెండో బాల్యం లాంటిదే కదండీ! మీ కోడలిని, మనవడిని తీసుకురండి. పిల్లలతో మాకు కాలక్షేపం. మరుగున పడ్డ జ్ఞాపకాలు మేం కూడా నెమరేసుకుంటాం. ఈ సారి మీ మనవడితో, మనవరాలితో ఒక అమ్మమ్మ ముద్దు కాదు చాలా మంది తాతయ్యల, అమ్మమ్మల ముద్దులూ, ముచ్చట్లు జరుగుతాయి" అంటూ నన్ను ప్రోత్సహించారు.

అందుకే రవికి సెలవు లేదని నేనే వెళ్ళి వైజాగ్ నుంచి మీనాని, మాధవ్‌ని నా వెంట తీసుకువస్తున్నాను.

* * *

"ఏమిటి అత్తయ్యగారూ! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు? " మా మీనా మాటతో ఈ లోకంలోకి వచ్చాను. జ్ఞాపకాల తెరలో చిక్కుకున్న మనసు వాస్తవాన్ని గ్రహించడానికి కొన్ని క్షణాలు పట్టింది.

"సుందరమ్మగారి గురించేనా ఆలోచన? ఆవిడ చాలా మారింది. నాకే నమ్మశక్యం కావడం లేదు" అంది సుందరమ్మ గారి మాటల్ని ఆమెని తలుచుకున్నాను మళ్ళీ.

"ఆవిడ 'మా వనజ' అంటుంటే నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను" అంది.

"పరిస్థితులు మారితే మనుషుల్లోనూ మార్పు సహజం" అన్నాను.

"ఈ క్రెడిట్ అంతా మీదే అత్తయ్యగారూ!'' అంది నాకేసి అభిమానంగా చూస్తూ.

"నాదేముందమ్మా! రాతిలోని చలమని దాచిన ఘనత మనదా! అది ఆ పైవాడి లీల కదా! మనం చేయగలిగింది, చేయవలసింది రాతిని తొలుస్తూ లోపలి పొరల్లోకి వెళ్ళడమే!" అన్నాను.

"రాళ్ళలో ఉన్న నీళ్ళు కళ్ళకెలా తెలుసూ!"

పాత సినిమా పాట నా గొంతులో గురగురలాడింది.

చెమర్చిన నా కళ్ళు తుడుచుకున్నాను.✦

# వావ్



## సహజ మార్పిడి

మాకొద్దీ మగతనం... అబ్బబ్బ భరించ లేమీ ఆడతనం అనుకుని నిపుణుడైన వైద్యుణ్ణి పట్టుకుని, ఖరీదైన ఆపరేషన్లు చేయిం చేసుకుని పుంసత్వాన్ని స్త్రీత్వంగా, స్త్రీత్వాన్ని పుంసత్వంగా మార్చేసుకునే వాళ్లను మనం చూస్తూనే ఉన్నాం. ఉన్నదాన్ని వదిలించుకుని లేనిదాన్ని ఆవాహన చేసుకోవడానికి ఇంత తతంగమూ, ఇంత ఖర్చూ లేకపోతే బాగుండునని వాళ్లు అనుకుని ఉండవచ్చు కానీ అలాంటి వరం మనుషులకు దుర్లభమే అయినా ఆ కోడిగారికి మాత్రం కాదు. ఎందుకంటారా? ఒక్క రాత్రిలోనే ఓ పెట్టమ్మ పుంజయ్యగా మారిపోయింది మరి. నమ్మలేక ముక్కున వేలే

## ప్రేమోపహతుల కోసం

భగ్న ప్రేమికులారా ఏడవకండేడవకండి... మీ కోసం మేమున్నామంటూ వాళ్లు భరోసా ఇస్తున్నారు. అయితే ఈ భరోసా భగ్నమైన వారి ప్రేమల్ని సఫలీకృతం చేయించడానికో లేదా మళ్లీ కొత్త ప్రేమను వాళ్లలో చిగురింపచేయడానికో కాదు. హృదయభారాన్ని తగ్గించుకోవడానికి, తమ విఫలప్రేమ చిహ్నాల్ని చూసుకుంటూ ఉసూరుమంటూనే ఉపశమనం పొందడానికి. ఆ భరోసా ఇస్తున్న వ్యక్తులు క్రోషియాకు చెందిన డ్రాజెన్ గ్రుబిసిక్, ఒలింకా విస్టికా. వీళిద్దరూ భగ్న ప్రేమికుల కోసం జాగ్రెబ్‌లో ప్రత్యేకంగా ఓ మ్యూజియం ఏర్పాటు చేయాలని తలపెట్టారు. 'ఇంతవరకు ఇలాంటి మ్యూజియం ప్రపంచంలో ఎక్కడా లేదు. ప్రేమలు విఫలమైన వారి నుంచి మేము ఎన్నో మెమెంటోలు, లేఖలు, అనేక రకాల ఇతర వస్తువులు సేకరించాం. హృదయం బద్దలైపోయిన భగ్న ప్రేమికులకు ఈ మ్యూజియం ఉపశమన చికిత్సాలయంగా మారుతుందని ఆశిస్తున్నాం' అంటున్నారు వాళ్లిద్దరు. 'శృంగారపరమైన వాటితో హృదయాన్ని హత్తుకునే లేఖలు, ప్రేమికులు ప్రియురాళ్లకో, ప్రియులకో బహూకరించిన వస్తువులు, వారి ప్రేమను తెలిపే ఫొటోలు వగైరాలను మ్యూజియంలో ప్రదర్శిస్తాం. ప్రతి వస్తువుకు నేపథ్యమైన ప్రేమానుబంధాన్ని తెలిపే వివరాల్ని తెలియజేస్తాం. హృదయం బద్దలైనా ఆ శకలాల కింద నలిగిపోకుండా ఉపశమనం పొంది తేరుకోవడానికి ఇవన్నీ భగ్న ప్రేమికులకు ఉపకరిస్తాయంటూ ధీమా వ్యక్తం చేస్తున్నారు. వాళ్లు తమ స్నేహితుల్లో విఫల ప్రేమలతో విలవిల్లాడే వారిని ఓదార్చే తమకు చివరికీ బ్రహ్మాండమైన అయిడియా తట్టిందని చెప్పారు డ్రాజెన్, ఒలింకా.



సుకున్నా ఇది ముమ్మాటికీ నిజం. బ్రిటన్‌లోని బ్రిస్టల్ సమీపంలోని సాల్ట్‌ఫోర్డ్‌లో జోరిచర్డ్స్ (42) అనే అమ్మణ్ణి ఉంది. ఆవిడ గారింట్లో ఓ పెట్ట ఉంది. ఆ పెట్టమ్మ ఎనిమిది నెల్లపాటు ఎంచక్కానో గుడ్లు పెట్టింది. ఓ రాత్రి ఏ మాయ దాన్ని కమ్మిందో, ఏ అదృశ్య శక్తి మంత్రం వేసిందో కాని తెల్లారే పాటికి పుంజయ్యగా మారి కొక్కొరొకో అని అరవడం మొదలు పెట్టింది. దాని తలమీద కూడా జుట్టు మొలుచుకొచ్చేసింది. ఇప్పుడది ఇతర పుంజులతో కయ్యానికి కాలు దువ్వుతోంది. అంతేకాదు, ఇంతకు మునుపు తనతో పాటే గుడ్లు పెట్టిన పెట్టలతో జతకట్టడానికీ ప్రయత్నిస్తోంది. ప్రస్తుతం అది రోజూ తన గంభీర గాత్రంతో తూరుపు తెల్లారకముందే మేలుకొలుపు పాడుతోంది. పెట్ట పుంజుగా మారడం అత్యంత అరుదే, కానీ అసాధ్యమైంది మాత్రం కాదని టెస్టోస్టిరాన్ పాళ్లు ఉధృతంగా పెరగడమే ఈ సహజ లింగ మార్పిడికి కారణమని పౌల్ట్రీ నిపుణులు పేర్కొంటున్నారు.

## వేలకోట్ల 'వాయింపు'

**వే**లు, లక్షల్లో వచ్చే బిల్లుల్ని చూస్తే ఎవరైనా కళ్ళు తిరిగి ఢామ్మని పడిపోక తప్పదు. అలాంటిది ఏకంగా వందల కోట్లల్లో బిల్లొస్తే... అమ్మో, ఊహించుకుంటేనే గుండె ఆగిపోయేట్లుంది కదూ. కానీ నిజంగానే ఆ బిల్లు అందుకున్న అతగాడి పరిస్థితి గురించి వర్ణించడానికి మాట లెక్కడుంటాయి. పాపం అని జాలి పడడం తప్ప. బిల్లుల విషయంలో మన అధికారులకేం తీసిపోం అంటున్నారు మలేసియా అధికారులు. అక్కడి టెలికాం అధికారులు యహయా వాహిబ్ అనే వ్యక్తికి అక్షరాలా 125 వేల కోట్ల పౌండ్ల బిల్లు పంపారు. అదీ దేనికనుకున్నారు? డిస్‌కనెక్ట్ చేసిన ఫోనుకు. ఎంత కాలానికి అనే సందేహమా మీకు? ఈ మధ్య చేసిన కాల్స్‌కే అంత మొత్తం బిల్లట. అంతే కాదండోయ్... పది రోజుల్లోగా బిల్లు చెల్లించకపోతే కేసు కొరడాతో ఛమడాలు తీసేస్తాం అని వార్నింగ్ కూడా ఇచ్చారు.



ఇక వాహిబ్ సంగతి ఏం చెప్పమంటారు. వాహిబ్ తండ్రి గత జనవరిలో మరణించాడు. ఆయన చనిపోక ముందు వాడుకున్న ఫోను తాలూకు బిల్లు 13 పౌండ్లు (83 రింగిట్లు) చెల్లించి వాహిబ్ ఆ ఫోను డిస్‌కనెక్ట్ చేయించేశాడు. అయినా అధికారులు 806,400,000, 000, 000.01 రింగిట్లు (125 ట్రిలియన్ పౌండ్లు) కట్టమంటూ ఇప్పుడు బిల్లు పంపారు. అది చూసీ గుండె ఢాం అని పేలిపోకుండా ఎలాగో తమాయించుకుని నిబ్బరంగా నిలబడగలిగిన వాహిబ్, టెలికాం కంపెనీ న్యాయపరంగా చర్య తీసుకోదలచుకుంటే తీసుకోనివ్వండి. నిజం చెప్పాలంటే ఆ చర్య కోసం నేనే ఆత్రుతగా ఎదురు చూస్తున్నాను' అంటూ వ్యంగ్య బాణం విసురుతున్నాడు. అధికారులు మాత్రం కేసు పరిశీలిస్తాం అని తాపీగా జవాబిస్తున్నారు. అధికారులకు చెలగాటం వినియోగదారులకు హృదయ సంకటం అనే పరిస్థితి ఇక్కడే కాదు, అక్కడ కూడా ఉందన్న మాట.

# మిస్టర్ పరపరా

**కాజా ఇందిరా దేవి**

"కు... కూ..." అంటూ మధురంగా కోకిలలా కూసింది కాలింగ్ బెల్. ఎప్పుడెప్పుడు బెల్ మోగుతుందా ఎప్పుడెప్పుడు తలుపు తీద్దామా అని ఆత్రుతగా తలుపు వెనకాల నిలబడ్డ గాంధారి, ఒక్కసారి నగలన్నీ సరిచూసుకొని, తలలో పూలు, పమిట అంచులూ సరి చేసుకుంటూ నవ్వు ముఖంతో తలుపు తెరిచింది.

"నమస్కారమండీ మేము 'వావా' టీవీ ఛానల్ నుండి వచ్చాం. మా 'పరపరా' డిష్ వాషింగ్ సబ్బు ఎలా పని చేస్తుందో చూపించడానికి" అంటూ నలుగురు అమ్మాయిలు ఒకే డ్రస్సుతో జిడ్డు ముఖాలతో వెంట రాగా మైక్ చేత్తో పట్టుకుని మరో చేత్తో 'పరపరా' సబ్బు పట్టుకుని కళ్లమీద పడుతున్న జుట్టు సందుల్లోంచి చూస్తూ లోపలికి అడుగు పెట్టాడు ఒక బక్క చిక్కిన శాల్తీ.

చతుర కతలు

"ఆహా అలాగా రండి చాలా సంతోషం" అంటూ ఇంట్లోకి వచ్చిన వాళ్లని మళ్లీ ఆహ్వానించింది. గాంధారి, తల మూర్ఛ రోగిలా కదిలిస్తూ.

"ఇలా మేం మీ ఇంటికి రావడం ఆశ్చర్యంగా ఉందాండీ" అంటూ ఆశ్చర్యం అభినయించాడు ఆ వచ్చిన వ్యక్తి.

"అవునండీ బోల్డు ఆశ్చర్యంగా ఉంది" అంది గాంధారి, ఆశ్చర్యం ఎట్లా ప్రదర్శించాలో తెలియక నోట్లోని పళ్ళు బయట పెడుతూ.

"అరే మీ యిల్లంతా ఇంత సందడిగా ఉంది ఏమైనా ఫంక్షనా?" అని అడుగుతుండగానే అందుకుని "లేదండీ నాకు ఫ్రెండ్స్ ఎక్కువండీ. ఇదిగో ఈవిడ ఎదురింటి కామాక్షి, ఈవిడ పక్కింటి మీనాక్షి, ఈమె పంకజాక్షి వెనక యింట్లో ఉంటారు. వీళ్ళు మా చెల్లెళ్ళు, ఆడ పడుచులు, వాళ్ళ పిల్లలు అంటూ పట్టుచీరల గర, గరలతో, బంగారు నగల తళతళలతో నోటినిండా పళ్లతో గల గల తిరుగుతున్న వారిని పేరు పేరునా పరిచయం చేసింది గాంధారి.

ఏడుపు లాంటి నవ్వుతో "ఓ మీ హాబీ ఫ్రెండ్‌షిప్ అన్నమాట. మంచి హాబీ. మరి వంటింట్లోకి వెడదామా'' అంటూ కదిలాడు ఆ వచ్చిన శాల్తీ.

వెంట నలుగురు అమ్మాయిలు భావాల్లేని ముఖాలతో అనుసరించగా,

"రండి అదిగో ఆ సింకులో గిన్నెలున్నాయి" అంటూ చూపించింది గాంధారి చుట్టూరా బంధు వర్గం నిలబడగా.

పరపరా తోమసాగారు అమ్మాయిలు.

"ఆ కళాయి బాగా నల్లగా అయిపోయింది కొంచం బాగా తోమండమ్మా" అంది పంకజాక్షి నెక్లెస్ సవరించుకుంటూ.

పాపం ఆ పిల్లలు చెమటలు కారేట్లుగా పరపరా తోమి గిన్నెలు నిగనిగ మెరిసేలా

శాయశక్తులా ప్రయత్నించారు. వాళ్ళు ముఖం నల్లగా, చేతులు ఎర్రగా అయ్యాక గిన్నెలకు మెరుపొచ్చింది.

"చూడండి. యిప్పుడు చెప్పండి. మీ గిన్నెలు పూర్వం ఎలా ఉండేవో యిప్పుడు మా పౌడరు వాడాక ఎలా ఉన్నాయో?" అన్నాడు.

ఆనందం



విపరీతంగా నటిస్తూ, పేరు తెలియని ఆ శాల్తీ.

అందరూ ఆనందంగా తలో గిన్నె, చెంబు తీసుకొని "అబ్బ ఒక పాకెట్టు పౌడరు అయిపోయినా బలే మెరుస్తున్నాయి. మా ఇంట్లో ఇంకా నల్లబడ్డ గిన్నెలున్నాయి. మా యింటికి వస్తారేమిటి" అంటూ ఆహ్వానించారు హృదయపూర్వకంగా.

"అదేమిటి మీరేమి మాట్లాడరు" అన్నాడు ఆశ్చర్యంగా గాంధారితో.

"అవన్నీ వాళ్ళ గిన్నెలు కాబట్టి వాళ్ళు ఆనందిస్తారు. మా గిన్నెలన్నీ ఇవిగో చూడండి. ఎలా తళతళ లాడి పోతున్నాయో" అంటూ అలమారు తెరచి చూపించింది గాంధారి గర్వంగా.

"కొత్తవా అండీ', అంటూ నోరెళ్ళబెట్టాడు ఆ శాల్తీ కెమెరా సంగతి మరచిపోయి.

"లేదండీ రోజు ఇంట్లో వాడేవే" అంటూ మహా గర్వంగా చెప్పింది గాంధారి.

మేడమ్, మేడమ్ మీరేం పౌడరు వాడతారండీ అనడిగారు, చేతులు ఊదుకుంటూ నలుగురమ్మాయిలు ఆత్రుతగా.

"ఏ పౌడరో వాడవలసిన అవసరం నాకేమిటి? నేను మా వారినే వాడతాను" అంటూ తళతళలాడే పళ్ళు బయట పెట్టింది గాంధారి. ✦

# గృహాలుడు

సూరిపండు



కొత్తగా వచ్చే తెలుగు మాష్టారి కోసం ఎదురు చూస్తున్నారు తరగతి గదిలోని పిల్లలందరూ. "రాబోయే మాష్టారు పాఠాలు ఎలా చెప్తారో... ఏంటో అనుకుంటున్నారు వాళ్ళలో వాళ్ళే గుసగుసగా. బదిలీ అయి వెళ్ళిపోయిన తెలుగు మాష్టారంటే పిల్లలందరికీ ఎంతో అభిమానం. ఆయన పద్యాల్ని ఎంతో శ్రావ్యంగా విన్పించేవారు. ప్రతి పదమూ విడమరచి అర్థాన్ని బోధించేవారు. సినిమాల్లో తెలుగు మాష్టారంటే వెకిలి చేష్టలతో... వెర్రి మొర్రి మాటలతో చూపించడం ఆ పదవికే అవమానం. అందుకు పూర్తి విరుద్ధమయిన వ్యక్తిత్వంతో... ఎంతో గంభీరంగా వుండేవారాయన. ఆయన పాఠంచెప్తే మరొకసారి చదవాల్సిన అవసరం ఉండేది కాదు. అంతగా మనసుకు హత్తుకుపోయేది. అందుకే ఆయనంటే పిల్లలందరికీ గౌరవం, ప్రేమ. బదిలీ అయిన సందర్భంగా ఆయనకు సన్మాన కార్యక్రమం ఏర్పాటుచేసి సత్కరించారు.

కొందరు పిల్లలయితే ఏడ్చేశారు కూడా! ఆ చిన్నారుల ప్రేమాభిమానాలకి హర్షపులకాంకితులయి పోయారు ఆయన. చెమర్చిన కళ్ళతో వాళ్ళందరినీ ఆశీర్వదించారు. "కొత్తగా వచ్చే మాష్టారు నా కన్నా బాగా పాఠాలు చెప్తార్రా. అప్పుడు నన్ను మర్చిపోతారు మీరు" అంటూ నవ్వేశారు. పిల్లలు కూడా ఆయనతో శృతి కలిపారు.

ఆలోచనల్లో మునిగిపోయిన పిల్లలందరూ గుమ్మం దగ్గర అలికిడవడంతో ఉలికిపడి లేచి నిల్చుని కొత్తగా వచ్చిన తెలుగు మాష్టారికి శుభోదయం పలికారు ముక్తకరంతో "ఆ... శుభ శుభోదయం రా... పిల్లలూ!" అంటూ లోపలికి వచ్చారు బ్రహ్మానందశాస్త్రి. ఖద్దరు పంచె, ఖద్దరు లాల్చీ ధరించారు. భుజంమీద త్రివర్ణపుటంచు కండువా. అదీ ఖద్దరుదే. ఆజానుబాహుం... అరవింద దళాయతాక్షం... అన్నట్టున్నారు. నుదుటన తెల్లని విభూతి రేఖల మధ్య ఎర్రగా సూర్యగోళంలా కుంకుమబొట్టు. చెవులకు కుండలాలు. ముంజేతికి సింహతలాటం. పిల్లలందరూ తృప్తిగా ఒకరినొకరు చూసుకున్నారు. "మాష్టారు బాగు

న్నార్రా..." "ఆ బొట్టు బావుందిరా..." "అరేయ్... మాష్టారికి పిలక వుంది రోయ్..." రకరకాల వ్యాఖ్యానాల లోగొంతు కల సవ్వడి తరగతి గదిలో వ్యాపించింది. "ఏమిట్రా పిల్లలూ ఆ ధ్వని. ధ్వని చేయకుండా హాజరు పలకండి" అంటూ వరసగా పిలిచారు. నిశ్శబ్ద వాతావరణంలో పిల్లల గొంతుకలు మువ్వల సవ్వడిలా హాజరు పలుకుతున్నాయి. ఆ తర్వాత పరిచయ కార్యక్రమం మొదలు పెట్టారు.




ముందుగా తనని తాను పరిచయం చేసుకున్నారు. "పిల్లలూ! నా పేరు బ్రహ్మానందశాస్త్రి" అంటూ. ఆపై తమతమ పరిచయాన్ని చెప్పమన్నారు. "మాట్లాడే వాళ్ళు తప్ప మిగిలిన వాళ్ళు ధ్వని చేయకుండా ఉండండి. ఆc నువ్వు చెప్పమ్మా..." అంటూ అమ్మాయిలతో ప్రారంభించారు. చిరునవ్వులతో ఆలకిస్తున్న ఆయన ఒక్కసారిగా ఉలికిపడ్డారు, ఒక కుర్రాడు చెప్పిన మాటలకి. "ఏమిట్రా ఏమిటి మరొకసారి చెప్పు, మీ నాన్నగారు ఏం చేస్తుంటారు" అడిగారు బ్రహ్మానందశాస్త్రి. "అదేనండీ.. హౌస్ హజ్బెండ్" అన్నాడు ఆ కుర్రాడు మళ్ళీ. "హౌస్ హజ్బెండా..." అంటూ ఆశ్చర్యపోయాడు ఎప్పుడూ విన్నట్టు లేని ఆ పద ప్రయోగానికి. "అవునండీ. మీకర్థం కాలేదా? హౌస్ వైఫ్ అంటారే... అలాగే హౌస్ హజ్బెండ్. తెలుగులో గృహిణిలాగే గృహుడు! అంటారు" అన్నాడు ఆ పిల్లవాడు. "గృహుడేమిటిరా..." మరింతగా ఆశ్చర్యపోయారు బ్రహ్మానందశాస్త్రి. "అవును మాష్టారూ! మా అమ్మగారేమో ఉద్యోగం చేస్తారు" ఒకే యింటిలో భార్యా భర్తలిద్దరికీ ఉద్యోగాలా! అందుకే దేశంలో నిరుద్యోగం పెరిగిపోతుంది. నువ్వు ఉద్యోగం చేస్తున్నావు కాబట్టి నేను ఉద్యోగం చెయ్యను. ఇంటి పట్టునే వుండి ఇంటిపనీ... వంటపనీ చూస్తాను. ఆడపని... మగపని అంటూ వేర్వేరుగా ఏమీలేవు. ఎవరైనా ఏ పనైనా చెయ్యచ్చు" అని మా నాన్నగారు హౌస్ హజ్బెండ్‌గా ఉండిపోయారట" వివరించాడు ఆ కుర్రాడు.

"ఔరా! ఏమి ఆదర్శము. యువత ఆలోచించవలసిన, ఆచరించవలసిన అంశము!" సాలోచనగా అన్నారు బ్రహ్మానందశాస్త్రి. ✦

# పుల్లకూర

కోటమర్తి రాధా హిమబిందు



శ్రీనివాస్ కోమలి ఇచ్చిన విందు ఎంతో నచ్చింది సత్యాదేవికి, మురళికి. సంతోషంగా ఆ భార్యాభర్తలకు కృతజ్ఞతలు చెప్పారు.

"ఏంటి అప్పుడే వెళ్తారా... మరో గంట యినా ఉండాల్సిందే" అన్నాడు శ్రీనివాస్.

"ఇప్పుడే వెళ్తున్నామని ఎవరన్నారు? మేం మరో రెండు గంటలు ఉందామనుకుంటుంటే" అన్నాడు మురళి నవ్వుతూ.

మురళి మాటలకు గలగల నవ్వింది కోమలి. చిరునవ్వులు చిందించింది సత్యాదేవి. వెన్నెల్లో కుర్చీలు వేసుకుని మరో రెండు గంటలు మాట్లాడుకున్నారు. ఆ తర్వాత గుడ్‌నైట్ చెప్పి వెళ్లిపోయారు సత్యాదేవి మురళి.

శ్రీనివాస్, మురళి ఒకే ఊరివాళ్లు. చిన్నప్పటి క్లాస్‌మేట్స్. ఇంటర్, ఇంజనీరింగ్ వేరే ఊళ్లలో చదవటంతో ఇద్దరి మధ్య దూరం బాగానే పెరిగింది. ఇద్దరికీ ఉద్యోగాలు వచ్చాయి. ఇప్పుడు వాళ్ల పిల్లలూ ఇంజనీరింగ్ చదువుతున్నారు. ఈమధ్యే శ్రీనివాస్ ఉంటున్న ఊరికే ట్రాన్స్‌ఫర్ అయింది మురళికి. మురళికి మంచి ఇల్లు చూసి పెట్టాడు శ్రీనివాస్. చిన్నప్పటి ముచ్చట్లు, ఆనందాలు పంచుకున్నారు ఇద్దరూ. మొదటిసారిగా విందుకు ఆహ్వానించాడు వాళ్లని.

* * *

"ఇక ఆ అవతారం మార్చుగూడదూ" వంటిల్లు సర్దుతున్న కోమలి భర్తను కోపంగా చూసింది.

"గంగిరెద్దులా ఏంటా అలంకరణ. నిలువు దోపిడి ఇచ్చేలా నీదన్న బంగారాన్నంతా ఇలా దిగేసుకుని ఎగ్జిబిషన్ పెట్టాలా? ఇలాంటి సిల్కు శారీ ఎందుకు కట్టుకున్నావ్?"

కోపాన్ని ఆపుకుంటూ తనపని తాను చేసుకోసాగింది కోమలి. "ఎన్నిసార్లు చెప్పాను, అలా పెద్దగా మాట్లాడవద్దని, నవ్వవద్దని. వాళ్లు నిన్నే చూస్తున్నారు. అది గమనించి నాలుగైదుసార్లు సైగ కూడా చేశాను. గమనించుకుంటేగా? అన్నీ నీకే తెల్సునన్నట్లుగా మాట్లాడటం గొప్పనుకున్నావా?"

మౌనంగా విన్నది కోమలి.

"ఆవిడ చూడు ఎంత పద్ధతిగా ఉందో. ఇంజనీరుగా, నాలాగే వాడూ బాగా సంపాదించి ఉంటాడుగా... ఆవిడకూ ఈ మాత్రం బంగారం లేకుండా ఉంటుందా? కానీ ఎంత సింపుల్‌గా వచ్చింది. చక్కగా కాటన్ చీర కట్టుకుని ఏ మాత్రం ఓవర్ ఫ్యాషన్ లేకుండా డిగ్నిఫైడ్‌గా చూడచక్కగా లేదూ. మితంగా,

సున్నితంగా ఎంత బాగా మాట్లాడింది.

"అరె... సత్యాదేవిగారు పర్స్ మర్చిపోయారే" కోమలి స్వరంలో అయ్యో అన్న ధ్వని.

"ఏంటి? పర్స్ మర్చిపోయారా? "

"అవునండీ వెతుక్కుంటారో ఏమో. ఫోను చేసి చెప్పండి"

"ఎందుకు వెళ్లి ఇచ్చేస్తే సరి" పర్స్ పట్టుకుని బయల్దేరబోయాడు శ్రీనివాస్.

"నేనూ వస్తాను ఉండండి" అంటూ రెడీ అవుతున్న కోమలిని చిరాగ్గా చూసి అయిష్టంగానే స్కూటర్ మీద ఎక్కించుకుని మురళి ఇంటివైపు పోనిచ్చాడు శ్రీనివాస్.

* * *

మురళి ఇంటి గేటు ముందు స్కూటరాపారు. ఇంట్లో లైటు వెలుగుతోంది. మురళి మాటలు పెద్దగా విన్పిస్తున్నాయి. కోమలి, శ్రీనివాస్ ముఖాలు చూసుకున్నారు. "మాట్లాడకుండా పదండి" నెమ్మదిగా అంది కోమలి.

ఏమీ అర్థంగాక చిరాగ్గా ఆమెను అనుసరించాడు శ్రీనివాస్.

"ప్చ్. ఎన్నిసార్లు చెప్పాలి సత్యా. అలా ముభావంగా ఉండొద్దని? కాస్త సరదాగా మాట్లాడితే నీ సొమ్మేం పోయింది? కోమలిగారు చూడు ఎంత హడావుడిగా ఉన్నారో. గలగల మాట్లాడుతూ మనల్ని ఎంత బాగా చూసుకున్నారు. మనింటికి ఎవరన్నా వచ్చారంటే కొన్ని గంటలు ఉండాలన్పించాలి. హుఁ ఆ అదృష్టం మనకు లేదులే. ఎప్పుడూ ఏదో పారేసుకున్నట్లుగానే ఉంటావాయె. అయినా సత్యా... బంగారుగాజులు వేసుకోకపోయావా? నెక్లెస్ పెట్టుకుంటే ఏమయ్యింది? కోమలిగారు చూడు జడనిండా పూలు చక్కగా, చీరె... పూజించే దేవతలా అన్పించలేదూ"

భర్తవైపు చూసింది కోమలి "ఆ మాటలు వినండి" అన్నట్లుగా. మురళి కోమలిని ఇంకా పొగుడుతూనే ఉన్నాడు- సత్యాదేవిని అవమానపరుస్తూ.

"పదండి"

"పర్స్"

"హుష్ పదండి" అంది చిన్నగా.

స్కూటర్ దగ్గరకి వచ్చారు ఇద్దరూ.

"ఏంటి? పర్స్ ఇవ్వవా? "

"పర్స్ నాది"

"వ్వాట్? "

"అవును ఇక్కడి పరిస్థితి మీకు తెలియచేయాలనే మిమ్మల్ని పర్స్ వంకతో తీసుకొచ్చాను. భార్య పర్స్ తెలియదు. భార్య టేస్టేంటో తెలియదు. భార్య మనసేంటో తెలియదు. భార్యకు ఓ మెచ్చుకోలు ఉండదు. భార్యకు ఓ గౌరవం వుండదు. భార్య సాటి మనిషిగా కూడా గుర్తింపబడదు, మీ మగజాతంతా ఇంతే"

"కో... కోమలీ"

"హుఁ. ఎదుటి వ్యక్తి భార్యలో మాత్రం అన్ని మంచి గుణాలే కన్పిస్తాయి. వాళ్ల కట్టుబొట్టు, మాటకారితనం మొదలు సలహాలు వరకు కూడా వాళ్లకు ఎంత మెచ్చుకోలు. ఎంత గౌరవం... వాళ్లకిచ్చే ప్రాధాన్యతలో కనీసం సగమన్నా ఇవ్వగలరా...? భార్యాభర్త... పదాలే గదా అంత దగ్గరగా ఉండేది. పైగా అతి వినయంగా ముందు భార్య, తర్వాత భర్త. కానీ... కన్పించాల్సిన దగ్గరితనం జీవితాల్లో జీవించడంలో, మనస్తత్వ విధానాల్లో గదా ఉండాల్సింది. భార్యలో వున్న లక్షణాలు అవలక్షణాలుగా కన్పిస్తాయి మీ అందరికి. ఎదుటివారిలో ఉన్న లక్షణాలు చాలా చాలా గొప్ప లక్షణాలుగా కన్పిస్తాయి. ఎదుటివాళ్ల ఎదురుగా తీసిపారేస్తే అవమానింపబడేది మేం కాదు మీరు"

"కోమలీ... నేను... నేను" నడిచాడు

"మగాడు... మొగుడు... ఇంట్లో పంచభక్ష్య పరమాన్నాలు నచ్చవు గాని పొరుగింటి పుల్లకూర కోసం ఆరాటపడతారు. ఆ రుచికి మాత్రం లొట్టలేస్తారు. పదండి వెళ్దాం"

శ్రీనివాస్ స్కూటర్ 'కిక్' కొట్టాడు. ఇంకా మురళి గొంతు విన్పిస్తూనే వుంది. ✦

**సెంటిమెంటు నేపథ్యంలో**
**ఓ నరమాంసభక్షకి వేట**

# అరణ్యకాండ



## కథ వెనుక కథ

కొమ్మనాపల్లి గణపతిరావు

**సుమారు ఇరవై ఏళ్లక్రితం పాఠకలోకంలో 'అరణ్యకాండ' సృష్టించిన సంచలనం అంతా ఇంతాకాదు. రచయిత కొమ్మనాపల్లి గణపతి రావుకు అపారంగా పేరుప్రఖ్యాతులు తెచ్చిందా నవల. నవల పేరుతో కలిపి ఆయన పేరును పాఠకులు చెప్పుకున్నారంటే వారి గుండెల్లో దానిచోటు ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు. అలాంటి 'అరణ్యకాండ' కథ వెనుక కథ, అప్పటి పరిస్థితులపై కొమ్మనాపల్లి మనోగతం ఆయన మాటల్లోనే...**

రాసి రచయితలు అయినవాళ్లు చాలామంది వుండొచ్చు. కానీ ఒక రచన.. రాసినవాణ్ణి రచయితగా నిలబెట్టడమన్నది అరుదైన సంఘటన.

నేను మంచి రచయితనో కాదో తెలీదు కానీ నన్ను ఇప్పటికీ నవలా రచయితగా నిలబెట్టింది రెండు దశాబ్దాల క్రితం రాసిన 'అరణ్యకాండ' నవలే.

ఆ నవల రాసేనాటికి రచయితగా నావయసెంతని? పడిలేచే కడలితరంగం, హంసధ్వని అనే రెండు నవలలు! రెండూ మంచిపేరే తెచ్చాయి.. అదే నా అందోళనకి మొదటి కారణం.

మంచి రచనచేస్తే మంచి రచయితనిపించుకోవచ్చు కానీ మంచి రచయిత చేసే ప్రతి రచనా మంచిదనిపించుకునే అవకాశం లేదు.

అందుకే కష్టమైనా తక్కువ వ్యవధిలో ఎక్కువపేరు తెచ్చుకోవటానికి మంచిరచన కన్నా గొప్ప రచనేదో చేయాలనిపించింది. చదివినంతసేపూ ఆనందింపచేయడమేగాక చదివాకా పాఠకుల మనసుల్ని వెంటాడి వేటాడే రచన చేయాలని అనిపించింది.

సరిగ్గా ఈ ఆలోచనలో పుట్టుకొచ్చిన 'వేట'అనే పదం నా రచనకు తొలిస్ఫూర్తి..

రాత్రీపగలూ తేడా లేకుండా 'వేట' గురించి ఆలోచనల వేటలో మునిగిన నేను అనుకోకుండా ఒకరోజు మనిషి రక్తానికి అలవాటుపడ్డ ఓ పులి అడవినుంచి పల్లెల్లోకి ప్రవేశించి 'మేనీటర్'గా మారటాన్ని పేపర్‌లో చదివాను(ఉత్తర భారతదేశంలో జరిగిందా సంఘటన).

వెంటనే మా అమ్మమ్మ గుర్తుకొచ్చింది... విశాఖ జిల్లాలోని 'తెనుగుపూడి' అనే పల్లెలో ఉంటూ సమీప అడవిలోని గిరిజనులకి నువ్వులనూనె అమ్మడానికి వెళ్తుండగా తాను ఎదుర్కొన్న మృగాల కథలు చెప్పడమూ గుర్తొచ్చింది..

చిన్నతనంలోనే అమ్మప్రేమకు దూరమైన నేను దాన్ని పొందింది మా 'చిట్టెమ్మ' మామ్మ దగ్గరే! అయిదారేళ్ల వయసులో అమ్మకోసం నేను మారాం చేస్తుంటే అమ్మమ్మ కథలు చెప్పేది. అన్నీ అడవి జంతువుల కథలే! ఏడుపాపి ఆమె ఒడిలో ఒదిగిమరీ వినేవాడ్ని. విన్నంతసేపూ భయపడ్డా వినాలనే ఉత్కంఠ కలిగించేవి అవి. అలా చెప్పడం అమ్మమ్మ చాతుర్యం. స్క్రీన్‌ప్లే అంటే ఆమెకు తెలీకున్నా తాను క్రూరమృగాలను ఎదుర్కొన్న తీరు వర్ణించి చెబుతుంటే కళ్లకు కట్టినట్టే వుండేది.

నవలకు 'అరణ్యకాండ' పేరు బాగుంటుందని క్షణాల్లో నామకరణం చేసేసుకుని మేనీటర్‌గా మారిన పులికథనే రాయాలని అనుకున్నాను.




కానీ ఎలా?

ఎప్పుడో అమ్మమ్మ చెప్పినప్పుడు వినడమేతప్ప ఏరోజూ అడవిలో అడుగుపెట్టని నేను... సర్కస్‌లో తప్ప మామూలు పులినైనా చూడని నేను, మేనీటర్‌గా మారిన పులిగురించి అసలేమీ తెలియని నేను, దుర్గమారణ్యాల వాతావరణం ఎరుగని నేను నవలెలా రాయాలి? పాఠకుల్ని ఎలా ఆకట్టుకోవాలి? అసలు ఇతివృత్తం ఎలా వుండాలి?

మేనీటర్‌ని మించి భయపెట్టిన ప్రశ్నలివి!

నిద్రలేని రాత్రులు.. అంతర్మథనం.. ఆందోళన! ఎన్నిరోజులు గడిచాయో గుర్తులేదు...

హఠాత్తుగా అమ్మమ్మ చిన్నతనంలో అన్న మాటలు గుర్తుకొచ్చాయి.. ఓ అపరాత్రివేళ...

అడవిలో పులులూ పాములూ అంటే నీకు భయం వెయ్యదా? అని అడిగితే వరుసగా రెండు విషయాలు చెప్పిందామె.

మొదటిది... జాగ్రత్త పడటానికి భయం కూడా కావాలి.

రెండోది.. మృగాలు మంచివే.. ఆకలివేసినప్పుడు తప్ప, ఆకలి తీరిన మనిషిలా సర్దా కోసం సాటి మనిషిని వేటాడి వేధించవు.

అమ్మమ్మ మాటలు ఖచ్చితంగా ఇవికాకున్నా భావం ఇదే. ఇప్పటి వ్యవస్థకీ అన్వయించుకుని ఆలోచించదగ్గ సూక్తులే అనిపించాయి.

సరిగ్గా ఆ వాక్యాలే 'అరణ్యకాండ' ఇతివృత్తంగా మారాయి.

'వేటాడి ఆకలి తీర్చుకునే పులిలాంటి క్రూరమృగం ఒకవేళ మేధస్సున్న మనిషిలా గాడి తప్పి ప్రవర్తిస్తే?'

అంతే...

కేవలం ఇరవై నాలుగు గంటల వ్యవధిలో పులితోబాటు దానిని వేటాడటానికి చైతన్యలాంటి ఓ హీరో పాత్రనీ ప్రవేశపెట్టాలనుకున్నాను... అడవి గురించే కాక వేటగురించీ బాగా తెలిసిన పాత్రగా.. ధీరోదాత్తంగా దాన్ని మలచాలనీ నిర్ణయించుకున్నాను.

ఇప్పుడు మరోసమస్య. అడవి, వేటలతోపాటు పులి సహజ లక్షణాల గురించీ తెలుసుకోవడం.

అడవిలోని చెట్లు.. పుట్టలు.. అడవిని నమ్ముకొని బతికే గిరిజనుల గురించీ పాడేరు ఏజన్సీలో విలేజ్ డెవలప్‌మెంట్ ఆఫీసర్‌గా పనిచేస్తున్న మామయ్య కృష్ణమూర్తి నుంచి వివరాలన్నీ సేకరించాను.

పులి ప్రవృత్తి.. వేటవేళ వేటగాడి వ్యూహాలు తెలుసుకోవడానికి 'జిమ్ కార్బెట్' పులివేట పుస్తకాల్నీ చదివాను.

చాలా మెటీరియల్ దొరికింది. ఇకపోతే

పాఠకుల్ని ఆకట్టుకోవాలి అంటే వీటన్నిటికీ మించి మరేదో కావాలి... భయానకమైన సన్నివేశాల్తో బాటు పాఠకుల గుండెల్లో కలుక్కుమనే సెంటిమెంటల్ ట్రాక్‌ని కథలో చొప్పించాలి.

అప్పుడు ఊహల్లో మెదిలాడు నానీ! పుట్టగానే అమ్మని పోగొట్టుకున్న నేను 'నానీ' పాత్రలో మమేకమై కథ నడిపించగలనన్న నమ్మకం! నానీకి అమ్మగా ఓ పూర్ణిమ పాత్రకీ రూపకల్పన చేశాను.

ఈ ప్రపంచంలో ఏ మనిషినైనా అనూహ్యంగా కదిలించగల 'fear and pain' అనే రెండు అస్త్రాల్నీ ఒడుపుగా సంధించి నా రచనతో పాఠకుల మనసు గెలవాలనుకున్న నేను, పనిచేసే హెచ్ఎంటీ కంపెనీకి శలవు పెట్టి కురుక్షేత్ర సంగ్రామంలా శ్రమించి, సరిగ్గా పద్దెనిమిది రోజుల్లో మొత్తం నవల పూర్తిచేశాను.

రాసేనన్న తృప్తి ఒకపక్క.. పాఠకులు ఎంతవరకూ ఆమోదిస్తారో అన్న భయం మరోపక్క..

రాయగానే నవలని నాటి ఆంధ్రప్రభ సంపాదకులు పొత్తూరికి ఇచ్చాను. నెలరోజుల విరామం. ప్రచురిస్తారో తిప్పి పంపిస్తారో తెలీదు.

కానీ ఉపసంపాదకుల నుంచి పొత్తూరి దాకా అంతా చదివి 'వేటలో వెలువడ్డ తొలి తెలుగు నవల' అనకపోయినా ప్రయత్నం బాగుందని వెన్నుతట్టారు.

సీరియల్ ధారావాహికంగా రావడం మొదలైంది. కష్టపడి చదివి పరీక్షలు రాసి ఫలితం కోసం ఎదురుచూసే విద్యార్థిలా నాలో ప్రకంపనలు..

మొదటివారం బాగుందీ అన్నారు పాఠకులు.

రెండోవారం చాలా బాగుందీ అంటూ పత్రికాఫీసుకు చాలా ఉత్తరాలు..

ఇంత మంచి తెలుగు భాష నీకు ఎలా అబ్బిందీ అని పొత్తూరి పిలిచి అభినందించారు.

ఆనందబాష్పాల్లో తాతయ్య గురించిన ఆలోచనలు దూసుకొచ్చాయి.

ఒకనాడు శాపం అనుకొన్నది మరొకనాటికి వరంగా మారటం అంటే ఏమిటో అర్థమైంది.

నిజానికి మా కుటుంబంలో మొదటి రచయితని నేను... పాండిత్యంలేని వాడ్ని. కళ్లు సరిగా కనిపించని తాతయ్య నా చిన్నతనంలో రామాయణ భారతాలు నా చేత చదివించి వాటి తాత్పర్యాన్నీ అర్థాన్నీ మా పల్లెలో రైతులకి చెబుతుంటే..

ఆడుకునే వయసులో నాకీ శిక్షేమిటీ అని బాధపడ్డ రోజుల్ని మననం చేసుకుంటూ, ఆ వయసులో అయిష్టంగా చేసిన ఆ వ్యాయామమే భాష మీద నాకు ఆ మాత్రం పట్టుకి కారణమైందన్నాను పొత్తూరితో.

నవల్లో నానీ ఆకతాయితనానికి పరవశించిన ఓ పాఠకురాలు, అమ్మకి దూరంగా అడవిలో గుడిలో ప్రాణాలువదిలే పరిస్థితిని చేరుకున్న నానీకి ఏ ఆపదా రాకుండా చూడమని ప్రాధేయపడుతూ ఉత్తరం రాసింది.

'అమ్మ... నాకు భయంగా వుందే మరేటో'

'నాకు బతకాలనుంది మరేటో'

మేనీటర్ తిరిగే పరిసరాలలో ఓ అమ్మవారి గుడిలో దాక్కునే పరిస్థితిని చేరుకున్న నానీ తన తల్లికి ఆకలితో చివరి దశని సమీపిస్తూ చేసే నివేదనలో భాగంగా రాసిన ఆ వాక్యాలు మహిళా పాఠకుల్ని ఎంత కలవరపరిచాయీ అంటే నానీని బ్రతికించమని నన్ను వ్యక్తిగతంగా (తెలిసినవాళ్లు) అడగటమూ మొదలుపెట్టారు.

ఓ పసికందుపై నేను చేసిన ఆ ప్రయోగం బాధాకరమే అయినా ఒకేసారి రాసిచ్చిన నవల్లోని నానీ ముగింపుని నేనెలా మార్చను?

నాకులేని అమ్మకోసం ఆ వయసులో నేను పడ్డ ఆవేదనకి అక్షర రూపమిచ్చి నా ఆర్తిని అలా వెళ్లబుచ్చిన నేను ఆ నిజాన్ని అప్పుడు ఎవర్కైనా ఎలా చెప్పను?

నానీకి జరగాల్సిన అనర్థం జరిగిపో

## బ్లడీనోస్

బ్లడీనోస్.. ఇదేంటి ఇదేదో తిట్టులాగ ఉందనుకుంటున్నారా? కాదండీ! రక్తం కారే ముక్కుని బ్లడీనోస్ అంటార్లెండి ఆంగ్లంలో. సాధారణంగా చిన్నపిల్లల్లో, కొంతమంది పెద్దవాళ్ళలో కూడా అప్పుడప్పుడు అకస్మాత్తుగా ముక్కునుండి రక్తం కారుతుంటుంది. అలా జరిగినప్పుడు మన పెద్దవాళ్లు చల్లని నీళ్ళు తీసుకుని నెత్తిమీద టపాటపా కొడతారు. లేదా అందుబాటులో ఉంటే వెంటనే ఇ.ఎన్.టి. డాక్టర్ దగ్గరకి పరుగెత్తుతారు. ఈ సమస్యతో బాధపడేవారికి అలస్కా డాక్టర్లు కొన్ని టిప్స్ చెప్తున్నారు. వాళ్ల సలహాల ప్రకారం, ముక్కు నుంచి రక్తం కారుతున్నప్పుడు వెంటనే ముక్కును మోకాళ్ళ మధ్యకి చేర్చి ఆ తర్వాత తలని వెనక్కి వంచితే రక్తం ఉదరంలోకి వెళ్ళిపోతుంది. ఐస్ ముక్కల్ని ముక్కు మీదుంచటం వల్ల ఆ చల్లదనానికి రక్త నాళాలు సంకోచం చెంది, రక్తం కారటం ఆగిపోతుంది. కొంతసేపయ్యాక ముక్కు చీదితే.. గడ్డ కట్టిన రక్తం బయటికొచ్చేస్తుంది. ముక్కుల్లో దూదిని గట్టిగా బిగించి 5 నుండి 10 ని॥ ఉంచితే రక్తస్రావం ఆగిపోతుంది.

ముక్కునుంచి రక్తం కారే సమస్య ఉన్నవాళ్లు పదే పదే చీదటం వల్ల లోపలి పల్చటి చర్మం చిట్లి, రక్తం కారే అవకాశం ఉంది. రక్తస్రావం ఆగిన పిమ్మట, ముక్కుల్ని శుభ్రం చేసి, యాంటీ బయాటిక్ లేదా స్టీరాయిడ్ ఆయింట్‌మెంట్ రాసుకుంటే పుండు త్వరగా తగ్గి, ఇన్ఫెక్షన్ వచ్చే ప్రమాదాన్ని నివారించుకోవచ్చు



యినా... వాడికి ఉపయోగించిన 'మరేటో' పదప్రయోగంపై అడిగారు చాలామంది. అది మా చిన్నబ్బాయి వంశీది. 'అన్నం తిన్నావా నాన్నా' అని ప్రేమగా అడిగితే 'ఇందాకే తినేశాను మరేటో' అంటూ ఆరేళ్ల వయసులోనే చిత్రంగా జవాబుచెప్పే తనే దానికి ప్రేరణ.

ఏది ఏమైతేనేం...

అరణ్యకాండ రచయితగా నిలబెట్టింది... పేరు ఖ్యాతిలాంటి పదాలకు అర్థాన్ని తెలియ చెప్పింది.

ఎందరినో ఆకట్టుకున్న అరణ్యకాండ చివరికి నాగార్జున హీరోగా సినిమాగానూ రూపు దిద్దుకుంది.

అప్పటికి నాగార్జునకి అది మూడో చిత్రమనుకుంటాను. కథతోబాటు హీరోపాత్ర 'చైతన్య' పేరుకే బాగా ప్రేరణ పొందిన ఆయన తనకు కొడుకు పుడితే ఆ పేరే పెడతానన్నారు. సినిమా విజయవంతం కాకపోయినా, సినిమా విడుదలయ్యాక నాకు పెద్ద పేరు రాకపోయినా నాగార్జున మాత్రం తన పెద్దకొడుక్కి ఆ పేరే పెట్టారు.

తర్వాత నేను చాలా నవలల్ని రాశాను. కానీ ఇప్పుడు అరణ్యకాండ చదివినా, ఈ శైలీ శిల్పం ఆ తర్వాత నవలల్లో అంత పటిష్టంగా ఉపయోగించగలిగానా అని నన్ను నేను ఇప్పటికీ ప్రశ్నించుకుంటాను అంటూ ముగించారు కొమ్మనాపల్లి.

– సేకరణ: చంద్రప్రతాప్ ✦

# ప్రేమ ఒక ప్రశ్నల వలయం

ప్రేమగానం

"ఎవరి తల మీద ప్రేమ నీడ ఉందో వారి పాదాల కింద స్వర్గం ఉంది." - ఈ మాటల వెనుక నిజానిజాలు పరామర్శించడమో, పలకరించడమో, తూకం పట్టడమో చేయాలంటే ఒక మనిషికి ఒక జీవితం చాలకపోవచ్చు. అనేక చరిత్రలు తిరగేసినా తెలియకపోవచ్చు. కాబట్టి అది ఫలానా సమయంలో, ఫలానా రకంగా, ఫలానా మనుషుల మధ్య ఫలానా రకంగా ఉండే మూస ఘనపదార్థమూ కాదు. ద్రవంలా, పాదరసంలా జారుకుంటూ వస్తుండొచ్చు. జారుకుపోవచ్చు కూడా. ప్రేమకు నిజమైన అర్థాలు, అధివాస్తవిక ఇమేజ్‌లు ఉంటాయా అన్న కూలంకషమైన చర్చల కన్నా ప్రేమకు చాలా సామాజిక, ఆర్థిక, రాజకీయ పార్శ్వాలు ఉంటాయనే అనుకోవచ్చు. వాటి కాలానుగుణ్యతలు మారవచ్చు.

ప్రేమ కోసం ప్రాణాలు పోగొట్టుకున్న దేవదాసు మూర్ఖుడని, ధూర్తుడని ఇపుడు ఎంత మాత్రం అనలేము. కానీ ప్రేమించలేదని, కట్టుకున్న భార్య ఎవరి స్కూటరో ఎక్కిందని ప్రాణాలు తీసే వారికన్నా ప్రేమ కోసం అలమటించి తపించిన దేవదాసు అలా ప్రేమదాసు కావడమే నయం అనిపిస్తుంది.

బిడ్డలు కావాలని లక్షల కొద్దీ డబ్బు వెదజల్లి సాంకేతిక పరిజ్ఞానం సహకారం తీసుకోవాలని ప్రయత్నించే వారిదీ ప్రేమే! కన్నబిడ్డలకు పట్టెడన్నం పెట్టడం కూడా కష్టమైన నిరుపేదలైనవారు తల్లిదండ్రులు లేని అనాథలైపోయి, ఎయిడ్స్ సోకిన చిన్న పిల్లలను దత్తత తీసుకోవడమూ ప్రేమే!

మొదటి ప్రేమలో సామాజిక పార్శ్వాలున్నాయి. కానీ పూర్తి వ్యక్తిగతమైనది. రెండవ ప్రేమలో మానవ పార్శ్వం ఉంది. అలా దత్తత తీసుకోబడ్డ బిడ్డల పాదాల కింద నిజంగానే స్వర్గం ఉంది. ఇక ప్రేమ అజరామరమా? నిరంతర ప్రవాహమా? స్వచ్ఛమైనదా? ఇవన్నీ అసలు సరైన మీమాంసలేనా? ... ప్రపంచంలోని అతి రహస్య స్థావరం మనసుకు కూడా తెలియని జవాబు నిరంతరం మనసు వెతుక్కునే ప్రశ్నే అది.

ప్రేమకు మిగతా మానవ భావాలకు తేడా ఏమిటి? ప్రేమ మానవత్వం ఒకటేనా? ఇటువంటి జటిల భావాలు తరుచూ కలుగుతూనే ఉంటాయి. మానవత్వం నుంచి ప్రేమ వస్తుందా? ప్రేమ నుంచి మానవత్వం వస్తుందా? మానవత్వం రాజకీయ నేపథ్యం నుంచి సమకూర్చబడిన భావన అయితే అందులోని జాలి మాట ఏమిటి? జాలి నుంచి కూడా ప్రేమ వస్తుందంటారు.

పాతికేళ్ళ కిందట కమ్యూనిస్టు కాని వాడికి మనసు లేదని ఇపుడు కమ్యూనిస్టు

అయిన వాడికి బుర్ర లేదని అనే ఆసాములున్నారు. అప్పుడున్న మనసుకు, ఇపుడు లేని బుర్రకు మధ్యనే మనం అంతరించిపోతుందనుకుంటున్న ప్రేమ ఉందా? ఏ ప్రేమ అంతరించిపోతోంది అంటే సాటివారి మీదా, కుటుంబ సభ్యులమీదా, దేశం మీదా, సమాజం మీదా అందరి మీదాను.

జిహ్వాకో రుచి లాంటిదే మనసుకో ప్రేమ.' మనిషి నవ్వుతాడు, దుఃఖిస్తాడు, తపిస్తాడు, కోపిస్తాడు, ప్రాధేయ



పడతాడు, పశ్చాత్తాపపడతాడు, ద్వేషిస్తాడు, అలానే ప్రేమిస్తాడు అంతే! అలా మానవ భావనల్లో ప్రగాఢమైన భావన ప్రేమ!

ఇంకో సాధారణ ప్రశ్నే కానీ ఎప్పుడూ ఎదురయ్యే ప్రశ్న. ఎవరైనా ఎవరినైనా ఎందుకు ప్రేమిస్తారు? ప్రేమ కలిగిందనా? లేదా వారినుంచి ప్రేమ కోసమా? అబ్బే అసలు ప్రేమ కలిగితే అవతలి వారికి చెప్పాల్సిన పని కూడా లేదు. ఏమీ ఆశించనిదే ప్రేమ అని ఓషో లాంటివారో, జిడ్డు కృష్ణమూర్తి లాంటివారో సెలవిస్తే దానిని ఆచరణ స్థాయిలో తీసుకోగలమా?

ప్రేమ ఎంత ప్రగాఢమైన భావనో అంతకన్నా ఎక్కువ అర్థం కాని, జవాబులు లేని ప్రశ్నల వలయం. ఒక లాజిక్‌ను కాస్త ఆలోచించాలి. ప్రేమ, ద్వేషం రెండూ ఒకే నాణానికి ఉన్న రెండు వైపుల్లాంటివయితే ఇపుడు ఇంత హింసాత్మక ద్వేషం ఉన్న ప్రపంచంలో అంతకన్నా ఎక్కువ ప్రేమ ఉందనా అర్థం?

నిజమే ప్రేమ ఉంది. అతి ప్రేమ ఉంది. తమ మీద తమకు!

ఎవరి మీదయినా ప్రేమ ఎక్కువయితే ఎలాంటి ఉత్పాతాలు కలుగుతాయో తమని తాము అతిగా ప్రేమించుకోవడం అనేది కూడా అంతే. మానసిక బలహీనత అని గుర్తెరిగితే ఇంత ద్వేషమూ లేదు. అంత ప్రేమా అక్కర్లేదు, కాస్తంత ప్రశాంతత చాలు!

**– లాలస**



# సృష్టి విచిత్రం

ఏమి సృష్టి విచిత్రమిది... ఏమి ప్రేమ బంధమిది...

హృదయరూపాన్ని ప్రణయచిహ్నంగా
భావుకత వెల్లువెత్తిన ఏ రసిక పిపాసి...
తీర్చిదిద్దాడో కానీ ప్రపంచమంతటా
అదే చిహ్నం ప్రాచుర్యంలోకి వచ్చేసింది.
కానీ ఈ తూనీగలకు ఆ ప్రణయ చిహ్నం
గురించి ఎలా తెలుసు...
ఎవరు చెప్పారు సుమీ!
అంటే సమాధానం ఉండదు.
అది సృష్టి... ప్రకృతి కళాకౌశలమే
అనుకోవాలి. 'హృదయ'ంగమమైన
ఈ ప్రణయకేళీ భంగిమ రసరమ్యం కదూ.
ఈ భంగిమలో తూనీగల జంట
కొద్ది సెకండ్ల నుంచి కొన్ని గంటల
వరకూ ఉంటుందట, అవసరాన్ని బట్టి.
అంటే ఆడతూనీగ గుడ్లు పెట్టేవరకూ...!

నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

కాటూరి రవీంద్ర త్రివిక్రమ్

# జగన్నాటకం

జూన్ 1979: సంపుటి: 2 సంచిక: 5

***ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది.***

***1979వ సంవత్సరం జూన్ నెల చతురలో ప్రచురించిన కాటూరి రవీంద్ర త్రివిక్రమ్ నవల 'జగన్నాటకం' పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.***

ఎప్పుడో, ఎవరో తనకు అన్యాయం చేసినంత మాత్రాన న్యూనతా భావాన్నీ, సమాజం పట్ల ఏహ్యతనూ పెంచుకోవటం సబబు కాదని రుజువు చేస్తుందీ నవల. మానసికంగా దెబ్బతిని కఠిన శిలగా కుంచించుకుపోయిన ఒక విద్యావంతురాలిని హిమశిలను వలె ద్రవింపచేస్తాడొక యువకుడు. జీవితమంటే ఎడారి కాదనీ, అందులో వెన్నెల ఉందనీ, మల్లెలు పూయించవచ్చనీ నిరూపిస్తాడు. శిలవంటి యువతిని శిల్పంగా మార్చి జీవం పోస్తాడు. ఆమెలోని ద్వేషాన్ని తొలగించి అనురాగం నింపుతాడు. ఆమెకే కాదు. తన చుట్టూరా ఉన్న వారందరి కష్టసుఖాలలో పాలు పంచుకుని మానవత్వానికి నిలువెత్తు ప్రతీకగా నిలుస్తాడు.

**ఇతివృత్తం:**

భానుమూర్తి, ఓ కాలేజీలో 'హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్'గా ఆరోజే జాయినవుతాడు. ఆ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న విశాలాక్షి చాలా అందంగా ఉంటుంది. మనిషి సీరియస్‌గా ఉంటుంది. ఎవరైనా పలకరించినా నిర్లక్ష్యంగా జవాబిస్తుంటుందే తప్ప మర్యాదకైనా స్నేహభావం చూపదు. ఎవరినీ లెక్కచేయదు. ఆమె ధోరణికి ఆశ్చర్యపోయి సహోద్యోగి రాజుతో ఆమె గురించి ప్రస్తావించగా ఆమెకు తల్లిదండ్రులు లేరనీ, యౌవనారంభదశలో ప్రైవేట్ చెప్పే టీచర్ అఘాయిత్యం చేయగా ఆమెకు పురుష ద్వేషం కలిగిందనీ, కాలేజీ కమిటీ మెంబర్ ఆనందరావు ఆమె మేనమామ అనీ, అయన దగ్గరే ఉంటోందని చెబుతాడు. రాజే భాను

మూర్తికి ఇల్లు చూసి పెడతాడు. అది ఆనం దరావు మేడే అనీ చెబుతాడు. ఆ మేడలో ఇంకా చాలా పోర్షన్లలో తనలాంటి బ్రహ్మా చారులు అద్దెకు దిగటం చూస్తాడు. మేడ కింది భాగంలో ఉన్న ఔట్ హౌస్‌లో మాధ వరావు అనే వృద్ధుడు ఆరుగురు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు, భార్యతో కాపురముం టాడు. ఆనందరావు బంధువర్గంలోని వాడే కావటం వల్ల అతడినడిగి విశాలాక్షిని గురించిన వివరాలు తెలుసుకుంటాడు భానుమూర్తి. తన కూతురిని భానుమూర్తి పెళ్ళాడితే బాగుండునని ఆశ పడతాడు మాధవరావు. ఆ విషయం సూటిగా ప్రస్తా వించక పెళ్ళెందుకు చేసుకోలేదని అడిగి, తను పిల్లను చూడనా అని సరదాగా అడు గుతాడు. చేసుకోదలచినప్పుడే మీ ద్వారానే సంబంధం కుదుర్చుకుంటానంటాడు భాను మూర్తి.

విశాలాక్షికి రెండు రోజులు వరుసగా 'గుడ్‌మార్నింగ్' చెప్పి పలకరించటంతో ఆమె కాలేజీ ప్రిన్సిపాల్‌కు ఫిర్యాదు చేస్తుంది. విశాలాక్షి రిజర్వ్‌డుగా ఉంటుం దనీ, ఓ పరిధి గీసుకుని అందులోనే ఉంటుందనీ, డెలికేట్ మేటర్స్‌ను మనం జాగ్రత్తగా అర్థం చేసుకొంటే మంచిదనీ హెచ్చరిస్తాడు ప్రిన్సిపాల్.

ఓ రోజు మాధవరావు పెద్ద కూతురు రుక్మిణి ప్లేటు నిండుగా కప్పుల్లో ఆవకాయ, మాగాయ, గోంగూర, మిరపపళ్ళకారం, కంది సున్ని, గుత్తి వంకాయ కూర తెచ్చిస్తుంది. 'ఇంకెప్పుడూ ఇలా తేవద్దు' అని హెచ్చరించి వాటిని తీసుకుంటాడు భానుమూర్తి. మరో రోజు డిటెక్టివ్ నవలలుంటే పంపించమని చీటి రాసి తమ్ముడితో పంపిస్తుంది. అలాం టివి లేవని రామకృష్ణ పరమహంస జీవిత చరిత్ర పంపుతాడు.

రుక్మిణి ఇలాంటి ప్రయత్నాలే మరికొన్ని చేసి భానుమూర్తిని ఆకర్షించుకోవాలని ప్రయత్నిస్తుంటుంది.

కాలేజీలో విశాలాక్షి దిద్దిన పరీక్ష పేపర్లు పరిశీలిస్తాడు భానుమూర్తి. మార్కులు వెయ్యడంలో ఆమె ఒక పద్ధతిని అనుసరిం చలేదు. జవాబు స్పష్టంగా రాయని, వాటికి ఎక్కువ మార్కులు వేస్తుంది. అదెలా ఇచ్చా రని నిలదీయగా ఫెడీమని పెడసరంగా జవాబిస్తుంది. "ఒకరి గొడవ నాకనవసరం. నా సంగతి పట్టించుకుంటే ఎలర్జీ నాకు. మీరు నా విషయంలో ఎవరూ చూపని ఆసక్తి కనబరుస్తున్నారు. ఎందుకిలా? ధైర్యం ఉంటే మనసులోని మాట సూటిగా చెప్పండి. మీరు విన్న గాలి కబుర్లు నా కన్వయించాలని చూస్తున్నారు కదూ" అని కోప్పడి ప్రిన్సిపల్‌కి వెళ్ళి ఫిర్యాదు చేస్తుంది. ప్రిన్సిపాల్ భానుమూర్తిని పిలిపిస్తాడు.

మర్నాడు విశాలాక్షి మేనమామ ఆనంద రావు కూడా భానుమూర్తిని పిలిపించి విశా లాక్షి ఉద్యోగం చేయనంటోందనీ, లెక్చరర్ల కుర్రకారు ధోరణి భరించలేనంటోందనీ, ప్రిన్సిపాల్ కూడా విశాలాక్షి రాజీనామా చేయడానికి కారణం భానుమూర్తి అని అంటున్నాడనీ చెబుతాడు. ఆ సందర్భంలో భానుమూర్తి మాటతీరు, మర్యాద, ప్రవర్తన ఆనందరావుకు నచ్చుతాయి. అతని వివరా లడిగి తెలుసుకుంటాడు.

విశాలాక్షిని క్షమాపణ అడగడానికి మేడ పైన రూఫ్ గార్డెన్‌కు వెళ్తాడు భానుమూర్తి. "మీరిక్కడికి కూడా రాకుండా ఉంటే సంతో షించే దాన్ని" అంటుంది విశాలాక్షి. భాను మూర్తి వెనుదిరిగి వెళ్ళిపోతాడు. మేడ దిగి వస్తున్న విశాలాక్షికి మేనమామ ఆనంద రావు ఎదురుపడి "అతని వల్లనే నీవు రాజీ నామా చేసినట్లు నువ్వు తనను క్షమించని పక్షంలో తను కూడా రాజీనామా చేయదల చినట్లు చెబితే నేనే పైకి పంపించాను. నీ వల్ల అతడి ఉద్యోగం మానుకోవటం నా కిష్టం లేకపోయింది" అంటాడు.

ఫలితంగా విశాలాక్షి రాజీనామా రద్దు చేసుకుని మళ్ళీ కాలేజీకి వెళ్తుంది. ఇన్నేళ్లలా

గాకుండా తనకు తనే గుడ్‌మార్నింగ్ చెప్ప టంతో అందరూ ఆశ్చర్యపోతారు. వైష్ణవ మాయా? భానుమూర్తి ఏదన్నా వశీకరణ మంత్రం ప్రయోగించాడా? లేక విశాలాక్షి ఇన్నాళ్ళు పీడించిన దెయ్యం వదిలి పోయిందా అనుకుంటారు.

"విశాలా! మీ క్లాసు నుండి కంప్లయింట్స్ వస్తున్నాయి. మనసు బాగాలేక లెక్చర్ ఇవ్వ లేకపోతుంటే లీవ్‌కి అప్లయి చేయండి. మీ స్టూడెంట్స్ మిమ్మల్ని ఫాలో కాలేకపోతు న్నారు. సిలబస్ ఎప్పుడు కంప్లీట్ చేస్తారు? " అని నిలదీసిన భానుమూర్తి మాటలకు కోపగించుకుని క్లాసుకు వెళ్తుంది విశాల.

విద్యార్థులు సైతం, "మేడమ్! మీరెందు కనో ఇటీవల సరిగా పాఠాలు చెప్పలేకపో తున్నారు. పూర్వంలాగా పాఠాలు అర్థం కావటం లేదు" అనటంతో "ప్లీజ్! డూ సెల్ఫ్ స్టడీ" అని డిపార్ట్‌మెంట్‌కు వెళ్ళిపోతుంది. ఆమె క్లాసు తీసుకోవడానికి వెళ్తాడు భాను మూర్తి.

విశాల సెలవు పెట్టి వెళ్ళిపోతుంది. ప్రిన్సి పాల్ భానుమూర్తిని పిలిచి "టరమ్ పరీ క్షలు దగ్గరకొస్తున్నాయి ఎలా" అని అడగ్గా "అవన్నీ నేను చూసుకుంటాను. మీరు నిశ్చింతగా ఉండండి" అని హామీ ఇస్తాడు భానుమూర్తి. విశాల క్లాసు విద్యార్థులకు అర్థమయ్యేలా పాఠాలు చెప్పి వారి అభి మానం చూరగొంటాడు. ప్రోత్సాహక బహు మతులిచ్చి వారిని మరింత పట్టుదలతో చది వేలా చేస్తాడు. ఎక్కువమంది అత్యధిక శాతం మార్కులతో పాసవుతారు.

కాలేజీ వార్షికోత్సవాలను సైతం భాను మూర్తి సమర్థవంతంగా నిర్వహించి కమిటీ మెంబర్ల, ప్రిన్సిపాల్, తోటి లెక్చరర్లు, విద్యా ర్థుల మెప్పు పొందుతాడు. ఈ కార్యక్రమాల సందర్భంలో ఎప్పుడూ వాటిని నిర్వహించే ఇంగ్లిష్ లెక్చరర్ విన్సెంట్‌కి భానుమూర్తిపై కోపం వస్తుంది. తన అక్కసును, వ్యతిరేక తను వెళ్ళగక్కుతుంటాడు.

'వార్షికోత్సవం' కార్యక్రమాల కోసం తీరిక లేకుండా పనిచేసిన భానుమూర్తి ఒకరోజు నీరసంతో తూలి పడిపోతాడు. తోటి లెక్చ రర్లు, ప్రిన్సిపాల్ సపర్యలు చేయగా కోలు కుంటాడు. ప్రిన్సిపాల్ తన ఇంటి నుండి భోజనం తెప్పించగా విశాలాక్షి స్వయంగా భానుమూర్తికి వడ్డించటం అందరికీ అబ్బుర మనిపిస్తుంది.

రుక్మిణి గర్భిణి అను తెలుసుకున్న మాధ వరావు లబో దిబోమంటూ సలహా కోసం భానుమూర్తి దగ్గరికొస్తాడు. తమ మేడలో ఉండే రంగారావు దీనికి కారణం అని తెలు సుకున్న భానుమూర్తి మాధవరావును వెంట బెట్టుకుని రంగారావుతో మర్యాదగా మాట్లాడి రంగారావు, రుక్మిణిల పెళ్ళి జరిపి స్తాడు. ఈ విషయం తెలిసిన విశాలాక్షి అతడి చాకచక్యానికి ఆశ్చర్యపోయి అతడి పట్ల అభిమానం పెంచుకుంటుంది. కాలే జీలో సైతం భానుమూర్తి మంచి పేరు సంపాదించుకోవటంతో ఆ అభిమానం రోజు రోజుకీ పెరుగుతుంటుంది.

పని వత్తిడిలో పడి ఓ రోజు కాలేజీలోనే ఎక్కువసేపు ఉండిపోతారు ప్రిన్సిపాల్, భానుమూర్తి. ప్రిన్సిపాల్‌గారిని తన స్కూట ర్‌పై ఆయనింటి వద్ద దిగబెట్టిన భానుమూ ర్తిని ఇంట్లోకి ఆహ్వానిస్తాడు ప్రిన్సిపాల్. పూలు కోస్తున్న ఆయన కూతురు ప్రతిమ అందాన్ని చూసి అప్రతిభుడవుతాడు భాను మూర్తి. మరోసారి ప్రిన్సిపాల్ ఇంటికి వెళ్ళి నప్పుడు తన కూతురికి చిన్నతనంలో వివాహం చేశాననీ, అల్లుడు మరణించాడనీ అదే తన బెంగ అనీ చెబుతాడు ప్రిన్సిపాల్.

కాలేజీ స్టాఫంతా కలిసి పౌర్ణమి రోజు పిక్నిక్‌కు వెళ్ళాలని ప్రోగ్రాం వేస్తారు. అంద రితో ముభావంగా ఉండే విశాలాక్షి ఆ రోజు నుండీ ఎంతో స్నేహంగా ఉంటోంది. పిక్ని క్‌కి వెళ్తూ అందరికీ సరిపడా వంటలన్నీ చేయించుకుని తన వాన్‌లో తీసుకువె

## మెరిసే నవ్వు కోసం

గారపట్టిన పళ్ళతో బ్యార్ మంటున్నారా? ఆ సమస్య నుంచి బయట పడటానికి బేకింగ్ సోడా, హైడ్రోజన్ పెరాక్సైడ్ కలిపి పేస్టులా చేసి బ్రష్ చేసుకోండి. మీ పళ్ళు పాలిష్ చేసినట్టు తళతళ మెరుస్తాయి. దీనికి తోడు భోజనం చేసిన ప్రతిసారీ నోరు శుభ్రం చేసుకోవాలి. తరచూ తాగే నీటిలో ఫ్లోరిన్ శాతాన్ని పరీక్ష చేయించుకోవాలి. అంతే కాదండోయ్... మార్కెట్లో లభ్యమయ్యే మోల్డబుల్ టీత్ ప్రొటెక్టర్స్... అదేనండీ... బాక్సర్స్ పళ్ళు విరక్కుండా వాడుతుంటారే, వాటిని కొని ధూమపానం చేసే ముందు, కాఫీ తాగే ముందు నోటిలో అమర్చుకుంటే పళ్ళని గారల బారి నుండి కాపాడుకోవచ్చు. అప్పుడు మీరూ మిలమిలలాడే నవ్వుల్ని మెరిపించవచ్చు.



ళ్తుంది. కలివిడిగా వడ్డిస్తుంది. ఆమెలోని మార్పుకు స్టాఫంతా ఆశ్చర్యపడుతుంటారు.

వార్షికోత్సవం సందర్భంగా తన మాట చెల్లుబాటు కానీయ లేదన్న కోపంతో విన్సెంట్ భానుమూర్తిని కొట్టిస్తాడు. రౌడీల దెబ్బలకు స్పృహ కోల్పోయిన భానుమూర్తిని చూసి ఆ దారిన పోయేవారు అతని జేబులోని డైరీలో ఉన్న ఆనందరావు నెంబరుకు ఫోన్ చేస్తారు. ఆనందరావు, విశాలాక్షి భానుమూర్తిని ఆసుపత్రిలో చేరుస్తారు. విషయం తెలిసిన కాలేజీ స్టాఫ్, ప్రిన్సిపాల్, ప్రిన్సిపాల్ కూతురు ప్రతిమ అందరూ ఆసుపత్రికి వచ్చి భానుమూర్తిని పరామర్శిస్తారు.

భానుమూర్తి తల్లిదండ్రులైన సీతమ్మ, సుందరయ్యలను పిలిపిస్తారు. భానుమూర్తి మీద సీతమ్మ, సుందరయ్యలకు ఎనలేని ప్రేమ, వాత్సల్యం. భానుమూర్తికి విశాలాక్షి క్యారేజీలో భోజనం స్వయంగా సర్ది పంపిస్తుంది. కాలేజీ నుంచి నేరుగా వచ్చి కొద్ది నిమిషాలు భానుమూర్తి దగ్గర కూర్చుని ఇంటికి వెళ్ళిపోతుంది.

ప్రతిమ ప్రతిరోజూ పూల గుచ్ఛం తెచ్చి భానుమూర్తి కిస్తుంటుంది. "రోజూ నా కోసం ఇంత కష్టపడి పూల గుచ్ఛం చేయటం దేనికి?" అని భానుమూర్తి ప్రశ్నిస్తాడు. అంతేకాదు, "చూడండి, నాకు అసలే అత్యాశ! మీరిలాంటి కానుకలు అలవాటు చేస్తే పది రోజులలో తృప్తిపడే వాడిని కాను. జీవితాంతం కావాలంటాను" అంటాడు. ఆమె ఆశ్చర్యపోతుంది. తనీ నిర్ణయానికి ఎప్పుడో వచ్చానంటాడు భానుమూర్తి. "మీ మీద విశాలాక్షి ఆశలు పెట్టుకున్నారు! మీ పట్ల ఆమె ఆపేక్ష అనంతం. మీరు నిరాకరిస్తే తట్టుకోలేకపోవచ్చు" అంటుంది ప్రతిమ.

అంతే కాదు. "మాస్టారూ! మీరు నన్ను అదృష్టవంతురాలిని చేయదలుచు కున్నందుకెంతో కృతజ్ఞురాలిని. కానీ నా జీవితాన్ని చక్కదిద్దేందుకు మరో జీవితాన్ని కూలదొయ్యటం మంచిది కాదేమో ఆలోచించండి" అంటుంది ప్రతిమ.

ఒక్కగానొక్క కొడుకు ఉద్యోగం పేరుతో ఊళ్ళు పట్టి తిరగటం ఇష్టం లేకపోయినా సుందరయ్య, సీతమ్మలు కాదనలేకపోతారు. జబ్బు పడిన కొడుకును తమతో కొన్నాళ్ళ కోసం ఇంటికి రమ్మని బలవంత పెట్టటంతో కొన్నాళ్ళు సెలవు పెట్టి వాళ్ళతో ఇంటికి వెళ్తాడు భానుమూర్తి. ప్రతిమ ఉత్తరం రాస్తుంది. జవాబు రాస్తాడు. ఆ సాయం

త్రమే "ప్రతిమ మిస్సింగ్. స్టార్ట్ ఇమ్మీడియట్లీ..." అని టెలిగ్రామ్ వస్తుంది. వెంటనే బయల్దేరతాడు భానుమూర్తి. అతడు వెళ్లేసరికి ప్రిన్సిపాల్ గారికి గ్లూకోజ్ ఎక్కిస్తుంటారు. అపస్మారకంలో ఉంటాడాయన. భార్య కన్నీరు, మున్నీరుగా విలపిస్తుంటుంది. విశాలాక్షి అక్కడే కూర్చుని ఆమెకు ధైర్యం చెబుతుంటుంది. "ప్రతిమనెవరో ఎత్తుకు పోయారు" అని చెబుతుంది భానుమూర్తికి విశాల. భానుమూర్తికి చాలా బాధనిపిస్తుంది. విన్సెంట్ తనపై దాడి చేయించటమే కాక ప్రతిమను సైతం అపహరింప చేయటం క్షమించరాని నేరం అనిపించింది. తనకు బి.ఎ.లో క్లాస్‌మేట్ బాపిరాజు ఇక్కడ సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్‌గా ఉన్నాడు. భానుమూర్తి వెళ్ళి బాపిరాజును కలుసుకుని విషయం చెబుతాడు. అతడు జీపులో భానుమూర్తితో పాటు ఇద్దరు కానిస్టేబుల్స్‌ను తీసుకుని సంఘటన జరిగిన చోటికి వెళ్తాడు. కానిస్టేబుల్స్ జీపు దిగి కారా కిళ్లీ నములుతూ నిలబడి చోద్యం చూస్తున్న ఓ గుండాని ఈడ్చుకొస్తారు. బాపిరాజు "ప్రిన్సిపాల్ గారమ్మాయిని ఎత్తుకెళ్ళిందెవరు?" అని అడిగితే తెలియదంటాడు. కానిస్టేబుల్స్ ఆ రౌడీని గుంజి డొక్కలో కొట్టేసరికి "జర్మయ్యగాడు, కాలేజీ కుర్రాళ్లు డబ్బులిస్తే ఆశ పడి ఈ పని చేశాడు" అని చెబుతాడు. జర్మయ్యా ఇల్లు చూపించమని అడిగితే జీపెక్కుతాడు.



ఓ పావు గంట ప్రయాణించాక దూరం నుండే ఇల్లు చూపిస్తాడు. అతనింట్లోని లావెట్రీలో విన్సెంట్, ముగ్గురు విద్యార్థులు దొరుకుతారు. వాళ్ళను కానిస్టేబుల్ తీసుకొచ్చి బాపిరాజు ఎదుట నిలబెడతాడు. "నేను లావెట్రీకి వెళ్తే నన్ను బయటకు లాగారు. ఇన్ డీసెంట్ ఫెలోస్" అంటాడు విన్సెంట్.

"ఆ అమ్మాయి నెక్కడ దాచావ్ జర్మయ్యా?" అని బాపిరాజు ప్రశ్నిస్తే "వెతుకుతున్నారుగా" అంటాడు నిర్లక్ష్యంగా.

ఆ మర్నాడు రైల్వే పట్టాల మీద శవం పడి ఉందని రిపోర్టు రాగా భానుమూర్తిని తీసుకుని అక్కడికి వెళ్తాడు బాపిరాజు. అది ప్రతిమ శవమే. వంటిపై పంటి గాయాలున్నాయి. దుస్తులు సరిగా లేవు. ఆమె నరకమనుభవించిందని ఊహించిన భానుమూర్తికి స్పృహ తప్పుతుంది. స్పృహ వచ్చాక భానుమూర్తి కన్నీళ్లు ఆపటం ఎవరి తరమూ కాదు.

కూతురి చావు సంగతి తెలిసిన ప్రిన్సిపాల్‌కు 'పెరాలిసిస్ మైల్డ్ స్ట్రోక్' వస్తుంది. శవ దహన కార్యక్రమమంతా భానుమూర్తి

నిర్వహిస్తాడు.

విన్సెంట్, అతడి ముగ్గురు అనుచరులు జర్మయ్య కలసి ప్రతిమను మానభంగం చేసి, హత్య చేశారని తెలుస్తుంది. కాలేజీ అధ్యాపకుడు ఇలా పాల్పడటం విని పుర ప్రజలు అలజడి చెందుతారు. ఆడపిల్లల్ని చదువులు మాన్పిస్తారు కొందరు. ప్రిన్సిపాల్ రాలేని పరిస్థితుల్లో ఉన్నందున మరొకరిని ప్రిన్సిపాల్‌గా నియమించాలని కమిటీ మెంబర్లు, లెక్చరర్లు ఆలోచిస్తారు. ప్రిన్సిపాల్‌గా భానుమూర్తి పేరు ప్రతిపాదించగా భానుమూర్తి నిరాకరిస్తాడు. ప్రిన్సిపాల్ గారు ఎంతో నచ్చచెపితే అప్పుడు భానుమూర్తి అంగీకరిస్తాడు.

భానుమూర్తి ప్రిన్సిపాల్ అయ్యాక కాలేజీ విద్యార్థుల్ని సమావేశపరిచి వారి సహకారం కోరతాడు. త్వరలోనే కాలేజీకి మునుపటి కళ తీసుకువస్తాడు. రెండు నెలల తరువాత జర్మయ్యకు మరణ శిక్ష, విన్సెంట్, ఇతర విద్యార్థులకు జీవిత ఖైదీలుగా శిక్ష విధించింది కోర్టు.

తరచూ ప్రిన్సిపాల్ గారింటికి వెళ్ళి పరామర్శించి వస్తుంటాడు భానుమూర్తి. విశాలాక్షి భానుమూర్తికి చేరువయ్యే ప్రయత్నం చేస్తుంది. విశాలాక్షి భానుమూర్తి పట్ల ప్రవర్తించే తీరు చాలా మందికి ఆసక్తికరంగా పరిణమిస్తుంది.

ఒకరోజు ప్రిన్సిపాల్ గది వైపు వస్తున్న విశాలాక్షి కంట్లో రెండు మూడు నలకలు పడతాయి. చీర చెంగుతో అద్దుకుంటుంది. కానీ ఒకటి బయటికి రాదు. ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్తుంది. "ఏమైంది" అని భానుమూర్తి అడగ్గా నలక పడిందని చెబుతుంది. "నలపకండి. ఊదేస్తాను" అని జాగ్రత్తగా ఊదేస్తాడు. అప్పుడే ఆ గదిలోకి అడుగు పెట్టబోతున్న ఇద్దరు లెక్చరర్లు ఈ దృశ్యం చూసి మర్నాడు యువతీ, యువకులు ముద్దు పెట్టుకుంటున్నట్లు కార్టూను అతికించి కింద విశాలాక్షి పేరు రాస్తారు. ఆ కార్టూనును ప్యూను చేత తీయించి జేబులో పెట్టుకుని క్లాసు రూంవైపు వెళ్తాడు భానుమూర్తి. అక్కడో విద్యార్థి బోర్డు మీద అచ్చం అలాంటి కార్టూనే వేయటం చూస్తాడు. అతడిని తన వెంట ప్రిన్సిపాల్ రూంకి తీసుకు వెళ్తాడు. ఇది తెలియని విశాలాక్షి క్లాసు రూముకి రాగానే కార్టూను కనిపిస్తుంది. డస్టరుతో తుడిపించి బాధగా అక్కడినుంచి వెళ్ళిపోతుంది. ఆ విద్యార్థిని సస్పెండ్ చేయమని భానుమూర్తిని అడుగుతుంది. అతడు వద్దంటాడు. మనసు బాగోలేక ఇంటికి వెళ్ళి ఆనందరావుతో జరిగిన విషయం చెబుతుంది. ఆయన భానుమూర్తిని సాయంత్రం తమింటికి ఆహ్వానిస్తాడు. భానుమూర్తి వెళ్ళాక, "మీరు నన్ను బలవంతంగా లాక్కొచ్చి, సంఘం అనే మురికి చెరువులో ముంచారు. ఎందుకలా చేశారు? నన్నిలా చిత్రవధ చేయడానికా? " అని నిలదీస్తుంది.

"ఎవరినీ నమ్మని నేను. నేను మీ నిజాయితీనీ, ఔన్నత్యాన్నీ నమ్మాను. మీరు వెలిగించిన దీపం ఆరకుండా చూసే బాధ్యత మీకు లేదా"? అంటుంది.

"నేను అదృష్టహీనుడను. దీపం మలగకుండా చేతులడ్డుపెడతానే గాని జీవన జ్యోతిగా నిలుపుకుని బతుకులోని చీకట్లను పారదోలలేను. నన్ను మన్నించు" అంటున్న అతడికి తనను చంపెయ్యమన్నట్లుగా తుపాకీ ఇచ్చి "ఒక గుండెను బద్దలు చేస్తే గానీ కొన్ని జీవితాలకు ఉన్నతి కలగక పోవచ్చు" అంటుంది. అతడు తుపాకీ జారవిడుస్తాడు. ఆమెను హత్తుకుంటాడు. అంతలో ఆనందరావు బయటినుండి లోపలికి వచ్చి శుభం పలుకుతాడు. కథ సుఖాంతమవుతుంది.

అద్భుతమైన కథా కథనంతో, అలతి అలతి పదాలతో నవలను నడిపించి ఆపకుండా చదివించడంలో సఫలీకృతులయ్యారు రచయిత.

✦



# దోస్తీని మించింది లేదు లోకాన...

"దోస్తీని మించింది లేదు లోకాన! రతనాలకన్నా అది మిన్న తూకాన" అన్నారో కవిగారు. కష్టసుఖాలలో అండగా నిలిచే మిత్రులు లభించటం వరం. ఓ అదృష్టం. సాధారణంగా తల్లిదండ్రులు తమ పిల్లల చదువు, కెరియర్, ఇంకా ఇతర ఆవశ్యకతల పట్ల ఎంతో జాగ్రత్త తీసుకుంటారు గానీ పిల్లల స్నేహితుల గురించి ఎక్కువగా పట్టించుకోరు. వారి పిల్లలు యోగ్యులు, బహుముఖ ప్రజ్ఞాశాలురు కావాలని ప్రతి క్షణం ఆలోచిస్తారు. ఇందుకు మంచి మిత్రులు ఉండటం కూడా అవసరమేనని ప్రతి తల్లిదండ్రులూ తెలుసుకోవాలి.

పిల్లలలో ప్రతి ఒక్కరి స్వభావం, ఆలోచన ఒకలాగే ఉండదు. కొందరు తమ తోటి పిల్లలతో వెంటనే కలిసిపోతారు. మరి కొందరికి ఇందుకుగాను కొన్ని నెలల సమయం పడుతుంది. పిల్లల ఆలోచనలను సంతులితం చేయాలే తప్ప అది వారి అలవాటు అని ఊరుకోకూడదు.

తనుశ్రీ ఇంట్లో పుట్టిన రోజు పార్టీ ఏర్పాటైంది. రజని కూడా సహకుటుంబ సపరివారంగా వెళ్లింది. తనుశ్రీ వయసు తొమ్మిదేళ్లు. ఆ పాప స్నేహితులందరూ దాదాపు ఆ వయసు వాళ్లే. అందరూ సంతోషంగా, ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉన్నారు. ఒకరు గాలిబుడగలు ఊదుతున్నారు. మరొకరు గట్టిగా అరుస్తున్నారు. నవ్వుతున్నారు. వేరొకరు డాన్స్ చేస్తున్నారు. మరికొందరు పరుగులు పెడుతూ దాగుడుమూతలు ఆడుకుం

టున్నారు. ఈ సందడిలో రేణుక కొడుకు మురళి నిశ్శబ్దంగా ఓ చోట కూర్చుని కనిపించాడు. "మురళి ఆరోగ్యం బాగా లేదా? " అని అడిగింది రజని రేణుకను. "లేదే! బాగానే... ఉన్నాడు. అలా మౌనంగా ఉండటం వాడి అలవాటు" రేణుక.

బహుశా కొత్త వాతావరణం గనుక పిల్లలందరితో కలవలేకపోతున్నాడనుకుంది రజని. కానీ సంవత్సరం గడిచాక కూడా మురళి ప్రవర్తన అలాగే ఉంది.

ఇలాంటి పిల్లల తల్లిదండ్రులు చెప్పేదొకటే. తమ పిల్లవాడు అంతర్ముఖుడనీ, ఎక్కువగా ఎవరితోనూ కలవలేడనీ, స్నేహం అలవరచుకోడనీ చెబుతారు. పిల్లలను ప్రేరేపించి స్నేహం చేసుకునే అలవాటును తల్లిదండ్రులే పెంపొందింపచేయాలి.

మీరంతా పెద్దవారైనా స్నేహితుల మధ్య కూర్చుంటారు. వారితో మీ మనసులోని మాటలు చెబుతారు. వారి మాటలు వింటారు. మరి పిల్లలకు ఎందుకు ఆ అలవాట్లను నేర్పించరు? స్నేహితుల వినా, బంధువుల వినా అసంపూర్ణంగా మిగిలిపోతామని పిల్లలకు బోధించాలి. నచ్చచెప్పాలి.

పిల్లలు మిత్రుల మధ్య ఉండే సామాజిక వ్యవహారాలు, సమస్యలకు సమాధానాలు, మంచి ప్రవర్తన నేర్చుకుంటారు.

బర్త్‌డే కానుక ఇచ్చి స్నేహ భావనలను పంచటం, చిన్న చిన్న కలహాల వలన తమను తాము రక్షించుకోవటం నేర్చుకున్నట్లే సంతోషాలను, అభిమానాలను కూడా పంచుకుంటారు. నేర్చుకుంటారు.

స్నేహితులు లేని పిల్లలు సదా ఒంటరిగా ఉంటారు. పెద్దవాళ్లయ్యాక డిప్రెషన్‌కు గురవుతుంటారు.

**పిల్లల స్నేహితులు ఎలాంటి వారై ఉండాలి?**

పిల్లలు చిన్నవారైనా కానీ పెద్దవారైనా కానీ తల్లిదండ్రులు పిల్లల స్నేహితుల గురించి పూర్తిగా తెలుసుకొంటూ ఉండాలి. ఎందుకంటే సాంగత్య ప్రభావం చాలా త్వరగా పడుతుంది. మీ పిల్లవాడు అబద్ధం చెబితే లేక తిట్లు తిడుతుంటే, ఎవరినైనా కొడుతుంటే అతడి స్నేహితులలో ఇలాంటి వారు తప్పనిసరిగా ఉండి ఉంటారని అర్థం చేసుకోవాలి. ఆ ప్రభావమే ఇందుకు కారణం. కనుక మీ పిల్లల స్నేహితులు ఏ కుటుంబం వారో, వారిలో ఏ సంస్కారాలున్నాయో, అలవాట్లున్నాయో తెలుసుకోవటం తప్పనిసరి. చెడు సాంగత్యం ఉంటే దానిని వదిలేలా చేయాలి. పిల్లలకు సహజమైన పద్ధతిలో నచ్చచెప్పాలి. పెరుగుతున్న పిల్లల్ని కొట్టటం సమంజసం కాదు. ఎందుకంటే దీని ప్రభావం తీవ్రంగా ఉంటుంది.

**ఉదాసీనులైన పిల్లల తల్లిదండ్రులేం చేయాలి?**

* పిల్లలను తమ మిత్రుల ఇళ్ళకూ, బంధువుల ఇళ్లకూ తీసుకువెళ్తుండాలి.
* బంధువులను, మిత్రులను సపరివారంగా తమ ఇళ్లకు ఆహ్వానించాలి.
* పిల్లల పుట్టిన రోజునాడు స్నేహితులను తప్పనిసరిగా ఆహ్వానించాలి.
* అప్పుడప్పుడు పిల్లల సంతోషం కోసం సామూహిక పార్టీలు, పిక్నిక్‌లనూ ఏర్పాటు చేయాలి.
* వీలైనప్పుడల్లా పిల్లల స్నేహితులతో తల్లిదండ్రులు మాట్లాడుతుండాలి. వారి చర్యలను గమనిస్తుండాలి.

ఉద్యోగరీత్యా బదిలీలైనప్పుడు తల్లిదండ్రులతోపాటు పిల్లలూ మరోచోటికి వెళ్లాల్సి వస్తుంది. పాత స్నేహితులను వదలక తప్పదు. అలాంటప్పుడు పిల్లలలో ఒంటరితనం పోగొట్టేందుకు తల్లిదండ్రులే ప్రయత్నించాలి.

రోహిత్ తండ్రికి బదిలీ అయినప్పుడు మరో ఊరికి వెళ్లారు. అక్కడ రోహిత్ విచారంగా, ఉదాసీనంగా ఉండేవాడు. దీపావళి నాడు ఆ కాలనీలోని పిల్లలందరినీ పిలిచింది రోహిత్ తల్లి. దీపాలు వెలిగించాక

అందరికీ మిఠాయిలు పంచిపెట్టింది. టపాసులు ఇచ్చింది. కొంచెం సేపట్లోనే రోహిత్‌కు కాలనీలోని పిల్లలందరూ పరిచయమయ్యారు. అతడు ఇక పాత మిత్రుల్ని మరిచి కొత్త మిత్రుల మధ్య సరదాగా గడపగలుగుతున్నాడు.

ఇరుగు పొరుగున ఉండే రెండు కుటుంబాల వారికి పరస్పరం భేదాభిప్రాయాలు వచ్చి కలహాలు జరగవచ్చు. ఆ ఇళ్లల్లోని పిల్లల మధ్య స్నేహం ఉంటే వాళ్ళని ఉసిగొల్పి స్నేహం మాన్పించకూడదు. పిల్లలతో ఎదుటివారి గురించి కఠిన పదాలతోనో, తిడుతూనో వ్యతిరేకతను తెలియజేయకూడదు.

చదువుతోపాటు ఇతర వ్యాపకాలలోనూ పిల్లలకు సంబంధం ఉండేలా తల్లిదండ్రులు చూడాలి. ఇతర వ్యాపకాల కారణంగా మిత్రులు ఏర్పడతారు. అది వాళ్ల ఉన్నతికి తోడ్పడే అవకాశం ఉంది. కలిసి మెలిసి పనిచేసే స్వభావం పిల్లలకు అలవడుతుంది.

పిల్లలు పక్కనే ఉన్నా కొందరు మహి



ళలు పరస్పరం చాడీలు చెప్పుకొంటూ ఉంటారు. పిల్లల వ్యక్తిత్వంపై ఇది చెడు ప్రభావం చూపుతుంది. వాళ్లు కూడా ఇలాంటి అలవాట్లు చేసుకుంటారు.

'స్నేహం'కు సరైన అర్థం పిల్లలకు చెప్పాలి. ఈ బంధంలోని లోతుపాతులను తెలియచేయాలి. కేవలం ఆడుకోవటం, కలిసి కూర్చోవటమే స్నేహం కాదు. మిత్రులు ఒకరికొకరు అవసరమైనప్పుడు ఏ విధంగా ఉపయోగపడతారో చెప్పాలి.

పిల్లలు స్నేహితులతో ఆడుకుంటారు. అవసరమైనప్పుడు హోంవర్కు వంటివాటిలో కూడా సహాయపడతారు. పిల్లలు జబ్బుపడినప్పుడో మరో కారణం వలననో బడికి వెళ్లనప్పుడు హోంవర్కు పూర్తి చేయటానికి స్నేహితులే సహాయపడతారు.

ఎప్పుడైనా ఏదైనా దుర్ఘటన సంభవిస్తే ముందుగా మిత్రులే సహాయపడతారు. ఏ టిఫిన్ బాక్సో పొరపాటున మరిచిపోయినా పిల్లలు ఆకలితో ఉండకుండా స్నేహితులందరూ కలిసి పంచుకుని తినటం చూస్తుంటాం.

బడి నుంచి బయల్దేరి దారిలో వస్తుండగా, ఏ యాక్సిడెంటో, ఇతర ప్రమాదమో జరిగితే పక్కన నడిచే మిత్రులే సహాయపడే వీలుంది. ఇంటికి ఫోన్ చేసి, విషయం తెల్పటం, ఆస్పత్రికి తరలించటం, యాక్సిడెంట్ చేసి పారిపోతున్న కారు నెంబరుగానీ, స్కూటర్ నెంబర్‌గానీ నోట్ చేసుకోవడం వంటి సహాయాలు సమయానికి అందుతాయి.

'స్నేహం' ప్రపంచంలో అన్నిటికంటే సత్యమైనదీ, నిజాయితీ ఉన్న బాంధవ్యం. ఎందుకంటే ఇందులో మోసాలు, ద్వేషాలు ఉండవు. మనిషి సన్మార్గంలో నడిచినా, దుర్మార్గుడిగా మారినా స్నేహితుల ప్రభావం ఉంటుందన్నది నిజం. కనుక వక్రమార్గం పట్టకుండా మంచి మిత్రుల సాంగత్యంలో ఉండేట్లు తల్లిదండ్రులు పిల్లల పట్ల జాగ్రత్త వహించాలి.

—జ్యోతిరాణి



ఏప్రిల్ 2006 'చతుర' నవల

# చీకటి వలయాలు

## పై సమీక్షలు



### మంచి రచనలు మరుగున పడకుండా...

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

చక్కటి కథాంశం, అద్భుత కథనం కలిగి, పెద్దగా పేరు పొందని వారయినప్పటికీ చక్కటి శైలితో రాస్తున్న నవలలు చదువుతుంటే ఇంత బాగా రాయగలిగినప్పటికీ వారి రచనలు మరుగునే ఉండిపోతున్నాయనిపిస్తోంది. వీరికి చక్కటి ప్రోత్సాహాన్నిచ్చి ప్రచురిస్తున్న 'చతుర'కు హార్ధిక అభినందనలు, కృతజ్ఞతలు. వీరి కలం నుండి మరిన్ని రచనలు చదువుతామని ఎదురుచూస్తున్నాము.

ఈ నెల (ఏప్రిల్) చతుర నవల 'చీకటి వలయాలు' పైన చెప్పిన విధంగా మనస్సును ఎంతగానో ఆకట్టుకుంది. ఒకప్పుడు బాగా బతికి, ఆర్థికంగా చితికిపోయి, భార్యమీద అపనమ్మకం, అనుమానంతో భర్త పరారీ అయినప్పుడు తానొక్కతే ఆ కుటుంబానికి అండయై, చిన్న వ్యాపారం చేసుకుంటూ కష్టనష్టాలను ఎదుర్కొంటూ కన్నకూతుళ్ళ జీవన వైఫల్యాన్ని నిర్వేదంగా భరిస్తూ జీవనం సాగిస్తున్న రంగమ్మ కథ చదువుతుంటే కంటతడి పెట్టని వారుండరనిపిస్తోంది.



కథ ఆద్యంతమూ ఉత్కంఠతో, చక్కటి కథనం, మాటలతో సాగింది. ఫైనాన్స్ సంస్థలు, వడ్డీలు, చిట్ ఫండ్ మోసాలు, వాటి మూలంగా నిలువునా మునిగిన వైనాలూ, కళ్ళకు కట్టినట్లుగా చూపించారు రచయిత 'మంచికంటి'. తమ దగ్గర వస్తువులు కొని, డబ్బులివ్వకుండా జబర్దస్తీగా తప్పించుకుంటున్న వారు కొందరు. కడుపు నిండా టిఫిన్లు తిని డబ్బివ్వకుండా తప్పించుకునే వాళ్ళు కొందరు. కడుపు నింపుకోవడమే కష్టమయ్యే బడుగు జీవులకు ఆశలు కల్పించి చిట్టీలు కట్టించి నిలువునా ముంచే వాళ్ళు కొందరు. చదువుతుంటే ఉక్రోషం కలిగి, ఆవేదనలో ఏమీ చేయలేని నిస్సహాయతలో చదువరుల మనస్సు భారమయిపోతుంది. రైతుల ఆత్మహత్యలని విన్నప్పుడు వారి మూర్ఖత్వమనుకున్న నేను వారిని ఆ పని చేసుకోవడానికి పురి కొల్పిన పరిస్థితులను ఈ నవల ద్వారా తెల్సుకున్నాను. అన్ని సమస్యలను, అంశాలను ఒకచోట చేర్చి, కష్టాలలో కూడ మంచితనం విడవకుండా (ముసలి అత్తగార్ని పోషించటం, మెతక మనసుతో మంచిగా అందరితో ప్రవర్తించటం) వ్యవహరించిన రంగమ్మ గొప్పదనాన్ని ఇంత అద్భుతంగా అందించిన మంచికంటిగారు అభినందనీయుడు.

– **జీడిగుంట ఉషారాణి,**
సిరిపూర్, కాగజ్‌నగర్.

## ఒక సమస్య నుండి మరో సమస్యకు...

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఏప్రిల్ చతుర నవల 'చీకటి వల యాలు' చైనా చిత్రకళవలె ఒక్క ఊపున ఆప వీలులేనట్లుగా చదివించింది. రచయి తకు అభినందనలు. రైతులు కూలీలుగా ఆ తదుపరి కాలక్రమేణ అనేక రకాల అవతా రాలెత్తినా బతుకుతెరువే ప్రశ్నార్థకమై మను షులుగా మనగలగడమే దుర్లభమవు తోంది. కారణం?

టాల్‌స్టాయ్, దోస్తోవస్కి, రంగనాయక మ్మల లాగా ముగించక, చెహోవ్ ఛాయలు కన్పిస్తున్నాయి ఈ నవలలో. జీవితాలను, సమస్యలను వర్ణించి వదిలేయడం, పరి ష్కారం రచయిత చూపించడం కాక పాఠ కులు, ఆయా సమస్యలలో వున్న బాధితులు తమకి తామే ఆలోచించుకొనే రీతిలో చిత్రిం చడమే ఆ ఛాయలు.

రంగమ్మ లాంటి సుఖమెరుగని జీవులు నిరంతరం సమస్యల వలయాల్లో పరిభ్ర మిస్తూ- గౌతమబుద్ధుడు చెప్పినట్లు ఒక సమస్య నుంచి మరొక సమస్యకు ప్రయా ణించగలరేగాని- వాటి నుంచి బైట పడ లేరు. ఈమెలాంటి కష్టజీవులు అజ్ఞానం, అత్యాశలకు లోనై దోపిడిదారుల పాలబడి తేనెలో ఈగ చందంగా తమ కష్టార్జితాన్ని కూడా తామనుభవింపలేకపోతున్నారు.

బడుగుజీవుల బాధలను, అపరిష్కృత మైన సమస్యలను చెక్కి మంచికంటి, ముల్కరాజ్ ఆనంద్, బలివాడ, కాంతారావు, పెద్దిబట్ల, సుబ్బరామయ్యల రచనలను గుర్తుకు తెచ్చారు.

ఏ నవలైనా సుఖాంతమైతే బాగుం టుంది. అందరికీ ఆనందం అన్నది ఆదర్శ మేనా? ఈ నవలా నాయిక లాంటి వ్యక్తు లకు సుఖం మరీచికేనా? వారి జీవితాల్లో ఒయాసిస్సు కనబడేదే లేదా?

నవలాంతానికి వచ్చేసరికి ఆలోచించే అల వాటున్న పాఠకుల్ని కలత చెందించే ప్రశ్నలు మిగులుతాయి.

*- గొల్లపూడి సీతాదేవి, హైద్రాబాద్.*

## ఏదీ సూర్యకిరణం?

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

జనని, జన్మభూమి స్వర్గం కంటే గొప్ప వని అంటారు. అలాంటి జన్మభూమిని విడిచిపెట్టి, ఎక్కడో ఎడారిలో ఎండమా వులు వెతుక్కోవడానికి వలసపోయి, అష్టక ష్టాల నెదుర్కుంటున్న వాళ్లు కోకొల్లలు. బడుగువర్గాలు కూలీకి వెళ్తే వలసలనేస్తు న్నారు. అదే చదువుకున్నోళ్లు విదేశాలకెళ్లి అక్కడ రెండవ తరగతి మనుషులుగా మనుతున్నా అదే చాలా గొప్పగా చెప్పుకుం టున్నారు. అలాంటి ఎండమావి వేటలో స్థానభ్రంశం చెందింది రంగమ్మ. అప్పుల ఊబిలో కూరుకుపోయి, పైకి వచ్చే మార్గం లేక, కాబూలీవాలా సుబ్బారావుకి ఆహుతి అయిపోయింది. ఫలితం భర్త పలా యనం,అత్త అస్తమయం, ఇద్దరు కూతుళ్లూ తలో మార్గం పట్టడం వగైరా ఈ నవలలో ముఖ్యవస్తువు. దీనికి పల్లెలలో పెళ్ళిళ్ల తీరూ, ఏరువాక, జాతరలు, మనుగడకు పోటీలు, పోటీలలో ఘర్షణలు, సమష్టి కుటుంబాల విభజన, ఎవరికి వారే యుమునా తీరే - వగైరాలన్నీ నవలలో జొప్పించారు. వీటి గురించి అవగాహన

లేని వారికి కళ్లకు కట్టినట్లు వర్ణించి ఒప్పిం చారు. ఇవన్నీ చాలా బాగున్నాయి.

అయితే ఈ నవల చూపే మార్గదర్శకం ఏమిటి? చీకటి వలయాలను సృష్టించు కుని, చుట్టుకుపోయిన పాత్రలన్నీ వాటికే బలి అయిపోయాయి. ఆ వలయాల్ని ఛేదించగల ఒక్క సూర్యకిరణం అయినా లేకపోవటం చాలా విచారకరం! పరిచయ వాక్యం చదివి, నవల ప్రారంభించిన పాఠ కుడికి ఆఖరుకి అసంతృప్తి మిగుల్తుంది తప్ప తరుణోపాయం దొరకదు. సమస్య లను వర్ణించుకునిపోవడం కంటే, రంగ మ్మను చీకటి వలయాల్లోంచి పైకి తీసి ఇతరులకు - అంటే పాఠకులకు-మార్గదర్శ కురాలిగా చూపిస్తే నవల బాగుండేది.

సొంత ఊరిలోనే గుప్పెడు గంజితో సేద తీర్చుకొన్న సంతృప్తి, పై ఊళ్లలో లేదన్న నగ్నసత్యాన్ని ఈ నవల చాటు తోంది.

*- వి.లలితాంబ, పర్లాకిమిడి*

## ఊరు మారినా మారని రాత

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**చ**తుర నవల 'చీకటి వలయాలు' జీవిత మంటే చీకటివలయాలేనా అన్పించేటంత బాధామయంగా వుంది. సుబ్బులమ్మ, రంగ మ్మల కష్టాలు కన్నీళ్ళు తెప్పించాయి. మట్టిని నమ్ముకున్నన్నాళ్ళు వాళ్ళ జీవితాలు బాగానే ఉన్నాయి. ఆ తర్వాతే... దురాశ, స్వార్థపరత్వం ఆ ఉమ్మడి కుటుంబాన్ని ఛిన్నాభిన్నం చేసింది. చెట్టుకొకరు... పుట్ట కొకరు అన్నట్టుగా అయిపోయారు వాళ్ళు. ఊరు మారినా రాత మారలేదు. కష్టాలు కన్నీళ్ళు తప్పలేదు రంగమ్మకు. భర్తృహరి సుభాషితాల్ని తెనుగుచేసిన ఏనుగు లక్ష్మణ కవి అంటారు ఒకచోట - "దైవోపహతుండు బోవు కడకుం బోవుగదా యాపదల్" అని. అది అక్షరసత్యమని నిరూపించింది రంగ మ్మ జీవితం. అంత బాధలోనూ తనను బీదింటి నుండి వచ్చిందన్న భేదభావం లేకుండా స్వంత కూతురిలా చూసిన అత్త పట్ల కృతజ్ఞతాభావం నింపుకుని ఆమెను జీవితాంతం పోషించింది. చేతనైనంతలో ఒకరికి సాయపడిందేగాని ఎవరినీ తక్కు వగా చూడలేదు. జీవితంలో పైకి రావాల న్న తపన, కష్టపడి నాలుగు రూకలు సంపా దించుకోవాలన్న ఆరాటం ఆమెది. 'కష్టేఫలి' అన్న నానుడి ఆమెపట్ల నిజం కాలేదు.

అవకాశవాదానికి... అవసరానికి తప్పని పరిస్థితులలో సుబ్బారావు కామాగ్నికి తనని తాను ఆహుతిగా చేసుకుంది. ఆ తప్పట డుగు వేయడంలో ఆమె పాత్ర ఎంతయినా అది ఆమె కాపురాన్ని బలి తీసుకుంది. మరోసారి మగవాడి దౌష్ట్యం చేతగానిత నంతో భార్యను వదిలిపోయిన నారాయణ రూపంలోనూ, దుర్మార్గంతో నమ్మిన వాళ్ళ ను నట్టేట ముంచిన సుబ్బారావు రూపం లోనూ బయటపడింది. ఫలితంగా మరిం తగా అప్పుల ఊబిలో కూరుకుపోయింది. కోరి కట్టుకున్న ఇంటిని కోల్పోయి నిరాశ్ర యురాలైంది. చేతికంది వస్తాడనుకున్న కొడుకు చెడుసావాసాల పాలయి ఆరోగ్యాన్ని పాడుచేసుకొని ఆస్పత్రి పాలయ్యాడు. కూతుళ్ళు ఆధునిక జీవిత గమనంలో వాలు గాలికి నిస్సహాయంగా కొట్టుకుపోయారు.

'మంచికంటి' వారి నవల గ్రామీణ జీవి తం, ఆ జీవితాల్లో సంతోషం, సహజత్వం, బడుగు బతుకుల బాధలు, వెతలు కళ్ళ ముందు కదలాడుతున్న భావనకు లోను చేసింది.

*-సువర్చలా జ్యోతి, తణుకు*

## ఎందరో రంగమ్మలు!

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'చీకటి వలయాలు' నవల చదివిన తర్వాత "పట్టణంలో బతుకుదామని తల్లి మాటను చెవిన పెట్టక దారితప్పిన బాటసారికి ఎంత కష్టం... ఎంత కష్టం" అనే శ్రీశ్రీ కవిత చటుక్కున గుర్తుకు వస్తుంది. కష్టాల కొలిమిలో సమస్యల సమ్మెట దెబ్బలు తిని అలసి సొలసి పోతున్న 'రంగమ్మ'లు ఈ భారతావనిలో ఎందరో!

మంచి కంటి రాసిన ఈ మంచి నవల 'వెలిగిపోతున్న భారతదేశ'పు మరో కోణాన్ని చక్కగా చూపెట్టింది. ఇందులో రంగమ్మ బతుకు దుర్భరంగా మారే పరిస్థితులు సహజత్వానికి దగ్గరగా ఓ యధార్థగాథను కళ్ళముందు నిలిపినట్టుగా వుంది.



ఉమ్మడి కుటుంబం నుండి వేరుబడి చెల్లాచెదురై ఆనక చితికిపోయిన సుబ్బులమ్మ కొడుకుల దుస్థితి గమనిస్తే "కలిసి ఉంటేనే కలదు సుఖము" అనే నానుడి మరోసారి గుర్తొస్తోంది.

మైక్రో ఫైనాన్స్ పేరిట జరుగుతున్న దా'రుణాలు' నిత్యం వార్తల్లో వెలుగు జూస్తున్న ప్రస్తుత తరుణంలో 'సామ్రాజ్యం' ఆత్మహత్య ద్వారా ఈ సమస్య తీవ్రతను రచయిత బాగా వ్యక్తం చేయగలిగారు. 'అప్పు లేనివాడే అధిక సంపన్నుడు' అన్నట్టు అప్పు తెచ్చే ముప్పును రచనలో చెప్పకనే చెప్పారు.

ఒకనాటి పల్లెల్లోని ప్రజల అన్యోన్యతను, ఇచ్చిపుచ్చుకునే ధోరణిని, కష్టకాలంలో వెన్నంటి నిలిచే నైజాన్ని రంగమ్మ పెద్దమనిషైన సందర్భంలోనూ, పెళ్ళి ఘట్టంలోనూ రచయిత ఆవిష్కరించిన తీరు పాఠకులను తన్మయులను చేస్తుంది.

ఒకటి సమసిపోయిందనుకునే లోపే మరో సమస్య కొడుకు అనారోగ్యం రూపంలోనూ, 'తిరిగొచ్చిన' కూతురు సుజాత రూపంలోనో వచ్చి రంగమ్మను కొండచిలువలా చుట్టుకోవటం పాఠకులను ఎంతో వేదనకు గురిచేస్తుంది. రంగమ్మ చీకటి వలయాలను ఛేదించే కాంతిరేఖ ఒకటి సుదూరంగానైనా పాఠకులకు కన్పింపజేస్తే కొంత ఊరటగా ఉండేదేమో!

మానవ జీవితాల్లోని వైవిధ్యానికి, వైచిత్రికి అద్దం పట్టే ఇలాంటి ఇతివృత్తాన్ని ఎన్నుకొన్న మంచికంటికి అభినందనలు. ప్రకాశం జిల్లా మాండలికపు సొబగు ఈ రచనలో కదను తొక్కింది. ఇటువంటి రచనలను ప్రోత్సహించే 'చతుర'కు కృతజ్ఞతలు.

**– మధుసూదన్ యాదవ్**, నరసరావుపేట

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net




అది జపాన్ ఉత్తర ప్రాంతంలోని హొకాయిడో ద్వీపం... ఫిబ్రవరి మాసం... మంచు వాకిలి... వణికించే చలి... కంపించే అంతర్తంత్రులు... నిలువెల్లా నిలకడగా ఉండనీయని తపన... వెరసి పొంగి పొరలే శృంగార భావన... ఫలితం మనసులు పెనవేసుకునే ఈ మనోహర నర్తనం. ఎంతో హుందాగా, రాజసంగా కనిపించే ఈ కొంగలు జతకట్టి కలిసి కాపురం చేయబోయే ముందు 'సంప్రదాయికం'గా నాట్యం చేసే దృశ్యమిది. జపనీయులు ఈ కొంగలను అమితంగా అభిమానించి ఆరాధిస్తారు.

